# ఎమెస్కో వచన మహాభాగవతం

2వ



శ్రీ పోతన మహాభాగవతమునకు అనుకృతి

అయినంపూడి గురునాథరావు

# ఎమెస్కో వచన మహాభాగవతం

## (రెండవ సంపుటం)

శ్రీ పోతన మహాభాగవతమునకు అనుకృతి


అయినంపూడి గురునాథరావు





యం. శేషాచలం అండ్ కంపెనీ
మచిలీపట్నం — సికింద్రాబాద్

EMESCO VACHANA MAHA BHAGATAM-2

As retold by
Sri AYINAMPUDI GURUNATHA RAO

First Edition :
March 1985



Publishers
M SESHACHALAM & Co
Machilipatnam - Secunderabad - 3



Printers :
PUSHPA PRINTERS,
Tilak nagar, Hyderabad

Distributors :
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
3237, Rashtrapati Road Secunderabad-500 003

Price . Rs. 15-00



# మహాభాగవతం

## (చతుర్థ స్కంధం)

సూతుడు శౌనకాది మహర్షుల నుద్దేశించి, "మునీంద్రులారా! ప్రాయోపవిష్టుడైయున్న పరీక్షిన్నరేంద్రునకు శుకమహర్షి విదురునకు మైత్రేయుడింకేమని చెప్పాడో చెపుతాను వినండి" అని ఇలా చెప్పడం మొదలు పెట్టారు:

'స్వాయంభువునకు శతరూపవలన ఆకూతి దేవహూతి ప్రసూతి అను ముగ్గురు కూతుళ్ళు; ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు అను ఇద్దరు కొడుకులూ కలిగారు. ఆయన ఆకూతిని తనకు బహుసంతానం కావాలనే కాంక్షతో పుత్రికా ధర్మం[1] అవలంబించి, రుచి ప్రజాపతికి ఇచ్చి పెండ్లి చేశాడు అందుకు శతరూప కూడా అంగీకరించింది.

రుచి ప్రజాపతి బ్రహ్మ వర్చస్వి గుణ గరిష్టుడు. ఏకాగ్ర చిత్తంతో శ్రీహరిని ఆరాధించడం చేత ఆకూతి యందు శ్రీహరి అంశం వలన యజ్ఞుడనే కొడుకూ, లక్ష్మీదేవి అంశంతో దక్షిణ అనే కూతురూ జన్మించారు. స్వాయంభువుడు యజ్ఞుని తన ఇంటికి తీసుకొని వెళ్లాడు దక్షిణను రుచి ప్రజాపతి తన వద్దనే వుంచుకున్నాడు. కాలక్రమంలో దక్షిణ యజ్ఞుణ్ణి పతిగా వరించి వివాహం చేసుకుంది. వారు ఆదిదంపతులు కాబట్టి ఆ వివాహం నిషిద్ధం కాలేదు.

---

1 'పుత్రికా ధర్మం' అంటే· 'ఓయీ నాకు పుత్రసంతానం లేదు. సాలంకృతయైన కన్యను నీకిచ్చి వివాహం చేస్తున్నాను ఈమె యందు పుత్రుడు జనిస్తే అతణ్ణి నేను పుత్రునిగా స్వీకరిస్తాను అని వాఙ్నియమ పూర్వకంగా చేసిన కన్యాదానం అయితే, స్వాయంభువునకు పుత్రులున్నారు గదా! ఇదేమిటి?' అంటే – తనకు పుత్రులున్నా, బహుపుత్రులు కావాలనే కోర్కెతో ఇలా ఆకూతిని రుచికి ఇచ్చి కన్యాదానం చేశాడు అంచేత ఇందులో దోషంలేదని విజ్ఞుల అభిమతం.

ఆ దంపతులకు యమనామధేయులైన పన్నెండు మంది దేవతలు కలిగారు. తోషుకు, ప్రతోషుడు, సంతోషుడు, భద్రుడు, శాంతి ఇడస్పతి, ఇధ్ముడు, కవి విభువు, వహ్ని, సుదేవుడు రోచనుడు అను పేర్లతో వారు ప్రసిద్ధులయ్యారు. వారూ మరీచి మొదలైన ఋషీశ్వరులూ, నారాయణాంశ సంభూతులైన యజ్ఞుడు దేవేంద్రుడూ, తేజోరూప సంపన్నులైన ప్రియ ప్రతోత్తానపాదులూ - వారి పుత్ర పౌత్రాదులూ ఆ మన్వంతరంలో పరి పాలించారు.

స్వాయంభువమనువు రెండవ కూతురు దేవహూతికర్దముని వివాహ మాడింది. వారి సంతానం కూడా తామర తంపరగా పెరిగింది. ఆ విషయం నీకు ఇంతకు పూర్వమే చెప్పియుంటిని కదా। ఇక అతని మూడవ కుమార్తె ప్రసూతి బ్రహ్మ పుత్రుడగు దక్షప్రజాపతిని పెండ్లి యాడింది. వారికి జనించిన సంతానం ముల్లోకాల్లో విస్తృతమైంది కర్దమప్రజాపతి పుత్రికలు తొమ్మండుగురు బ్రహ్మర్షులను వివాహమాడటం కూడా తెలుసుగదా। ఇక వారి సంతాన పరంపరను వివరిస్తాను విను.

## కర్దమ ప్రజాపతి సంతతి

మరీచికి కర్దమాత్మజమైన కళ వలన కశ్యపుడను కొడుకున్నూ, పూర్ణిమ యను కూతురున్నూ జన్మించారు. వారికి పుట్టిన సంతానంతో లోకా లన్నీ నిండిపోయాయి పూర్ణిమ దేవకుల్య అనే కుమార్తెనూ, విరజుడనే కుమారునీ కన్నది ఆ దేవకుల్యయే జన్మాంతరంలో శ్రీహరి పాదాంబువుల నుండి జన్మించిన గంగ

కర్దముని రెండవ కూతురు అత్రి మహర్షిని వివాహమాడింది. వారికి నారాయణాంశం వలన దత్తాత్రేయుడు, శివాంశం వలన దుర్వాసుడు, బ్రహ్మాంశం వలన చంద్రుడు జన్మించారు—'

అని మైత్రేయుడు అనేసరికి విదురుడు, మునీంద్రా। సృష్టి స్థితిలయ కారకులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఏ కారణం చేత అత్రి మహాముని యింట అనసూయ కడుపున పుట్టారు?' అని అడిగేసరికి మైత్రేయుడిలా చెప్పడం మొదలు పెట్టాడు:

'బ్రహ్మ యాజ్ఞానుసారం అత్రిమహర్షి సంతానేచ్ఛతో భార్యాసమేతుడై ఋక్ష మనెడి కులపర్వతం మీద తపస్సు చెయ్యడానికి వెళ్లాడు. అచట నిర్వింధ్యా నదీతీరాన నానావిధ వృక్ష పంక్తులతో మనోహరంగా వున్న కాంతారంలో ద్వంద్వాతీతుడై ప్రాణనియమంతో ఒంటికాలిపై నిలిచి వాయు భక్షణం చేస్తూ నూఱు దివ్య వత్సరాలు దారుణ తపం చేశాడు చిక్క-

శల్యమై పోయాడు. అలా తపస్సు చేస్తూ ఆ మహర్షి తన మనస్సులో జగదీశ్వరుడైన దేవదేవుని వంటి కుమారుడు కలగాలని వాంఛించాడు.

అపుడాతని శిరస్సునుండి తపోవహ్ని బయలుదేరింది. ఆ అగ్నికి ముల్లోకాలూ తప్తమయ్యేసరికి బ్రహ్మ విష్ణు మహేశ్వరులూ, మునులూ, సురలూ, సిద్ధులూ, సాధ్యులూ అప్సరోగణం వెంటరాగా అత్రిమహర్షి ఆశ్రమ ప్రాంతానికి వచ్చారు. భార్యాసహితులై అలావచ్చిన త్రిమూర్తులను జూచి అత్రిమహర్షి అమందానందం చెందాడు వారికి సాష్టాంగ దండప్రణామం చేశాడు పుష్పాంజలి ఘటించాడు చేతులు జోడించి నమస్కరించాడు. దుర్నిరీక్షమైన వారి తేజస్సు చూడలేక కనులు మూసుకొని, వారి చరణ కమలములందు మనస్సును నిల్పి, మృదు మధుర వాక్కులతో ఇలా నన్నుతించాడు ·

మహనీయులారా! ప్రతీ కల్పంలోనూ లోకాలను సృజించి పెంచి, లయం చేయడానికి మాయామయములైన సత్వరజస్తమోగుణాల నాశ్రయించి బ్రహ్మ విష్ణు మహేశ్వరాఖ్యలతో వ్యవహరించెడి మీ పాదకమలాలకు నా అభినందనాలు సంతానకాంక్షతో నేను నా మనస్సులో జగదీశ్వర నాముణ్ణే సంస్మరించాను అలాంటప్పుడు మానవులకు మనోభిగమ్యులుకూడా కాని మీరు ముప్వురూ ఇలా నా యెదుట ప్రత్యక్షమవడం ఆశ్చర్యకరంగా వుంది అనేసరికి వారు అత్రిమహర్షికి ఇలా అన్నారు :

మునీంద్రా మేము ముగ్గురంగా గోచరించినా మాకు భేదం లేదు. నీవు నీ మనస్సులో జగదీశ్వరుని ధ్యానించావు మేము ముప్వురమూ కలిసే జగత్పాలనం చేస్తూ వుంటాము. నీ మనోవాంఛ నెరవేరుతుంది మా ముప్వురి అంశాలతో నీకు ముప్వురు కొడుకులు పుట్టి, నీకు లోకవిఖ్యాతి కల్పిస్తారు అని వరమిచ్చి మునిచేత సంపూజితులై అంతర్హితులయ్యారు.

ఆ దంపతులకు అలాగే బ్రహ్మదేవుని అంశంలో చంద్రుడు, శ్రీహరి అంశంలో దత్తాత్రేయుడు, మహేశ్వరుని అంశంలో దుర్వాసుడూ జన్మించారు ఆ ముప్వురూ అనవద్యచరిత్రులు; పరమపావనులు.

అంగిరసునకు శ్రద్ధ యందు మహా సౌందర్యవతులైన నల్వురు కుమార్తెలు జన్మించారు సినీవాలి, కుహువు రాక అనుమతి అను పేర్లతో వారు విఖ్యాతి చెందారు ఆ నలుగురు కుమారెలేకాక ఆ దంపతులకు భగవత్తుల్యులూ, బ్రహ్మనిష్ఠులూ అయిన ఉచథ్యుడూ, బృహస్పతి అను ఇద్వురు కొడుకులు కూడా పుట్టారు.

పులస్త్యునకు హవిర్భుక్కు అను ఒక భార్యయందు అగస్త్యుడు జన్మించాడు ఆ అగస్త్యుడే జన్మాంతరంలో జఠరాగ్ని రూపంలో ప్రవర్తించాడు.

ఆ దంపతులకు యమనామధేయులైన పన్నెండు మంది దేవతలు కలిగారు. తోషుడు, ప్రతోషుడు, సంతోషుడు, భద్రుడు, శాంతి ఇడస్పతి, ఇధ్మడు, కవి, విభువు, వహ్ని, సుదేవుడు రోచనుడు అను పేర్లతో వారు ప్రసిద్ధులయ్యారు. వారూ, మరీచి మొదలైన ఋషీశ్వరులూ నారాయణాంశ సంభూతులైన యజ్ఞుడు దేవేంద్రుడూ, తేజోరూప సంపన్నులైన ప్రియ వ్రతోత్తానపాదులూ - వారి పుత్ర పౌత్రాదులూ ఆ మన్వంతరంలో పరి పాలించారు.

స్వాయంభువమనువు రెండవ కూతురు దేవహూతికర్దముని వివాహ మాడింది. వారి సంతానం కూడా తామర తంపరగా పెరిగింది ఆ విషయం నీకు ఇంతకు పూర్వమే చెప్పియుంటిని కదా ఇక అతని మూడవ కుమార్తె ప్రసూతి బ్రహ్మ పుత్రుడగు దక్షప్రజాపతిని పెండ్లి యాడింది. వారికి జనించిన సంతానం ముల్లోకాల్లో విస్తృతమైంది కర్దమప్రజాపతి పుత్రికలు తొమ్మండుగురు బ్రహ్మర్షులను వివాహమాడటం కూడా తెలుసుగదా ఇక వారి సంతాన పరంపరను వివరిస్తాను విను.

## కర్దమ ప్రజాపతి సంతతి

మరీచికి కర్దమాత్మజమైన కళ వలన కశ్యపుడను కొడుకున్నూ, పూర్ణిమ యను కూతురున్నూ జన్మించారు. వారికి పుట్టిన సంతానంలో లోకా లన్నీ నిండిపోయాయి పూర్ణిమ దేవకుల్య అనే కుమార్తెనూ, విరజుడనే కుమారునీ కన్నది ఆ దేవకుల్యయే జన్మాంతరంలో శ్రీహరి పాదాంబువుల నుండి జన్మించిన గంగ

కర్దముని రెండవ కూతురు అత్రి మహర్షిని వివాహమాడింది వారికి నారాయణాంశం వలన దత్తాత్రేయుడు, శివాంశం వలన దుర్వాసుడు, బ్రహ్మాంశం వలన చంద్రుడు జన్మించారు—'

అని మైత్రేయుడు అనేసరికి విదురుడు, మునీంద్రా! సృష్టి స్థితిలయ కారకులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఏ కారణం చేత అత్రి మహాముని యింట అనసూయ కడుపున పుట్టారు?' అని అడిగేసరికి మైత్రేయుడిలా చెప్పసాగం మొదలు పెట్టాడు:

'బ్రహ్మ యాజ్ఞానుసారం అత్రిమహర్షి సంతానేచ్ఛతో భార్యాసమేతుడై ఋక్ష మనెడి కులపర్వతం మీద తపస్సు చెయ్యడానికి వెళ్లాడు. అచట నిర్వింధ్యా నదీతీరాన నానావిధ వృక్ష పంక్తులతో మనోహరంగా వున్న కాంతారంలో ద్వంద్వాతీతుడై ప్రాణనియమంతో ఒంటికాలిపై నిలిచి వాయు భక్షణం చేస్తూ నూఱు దివ్య వత్సరాలు దారుణ తపం చేశాడు చిక్క-

శల్యమై పోయాడు. అలా తపస్సు చేస్తూ ఆ మహర్షి తన మనస్సులో జగదీశ్వరుడైన దేవదేవుని వంటి కుమారుడు కలగాలని వాంఛించాడు.

అపుడాతని శిరస్సునుండి తపోవహ్ని బయలుదేరింది. ఆ అగ్నికి ముల్లోకాలూ తప్తమయ్యేసరికి బ్రహ్మ విష్ణు మహేశ్వరులూ, మునులూ, సురలూ, సిద్ధులూ సాధ్యులూ అప్సరోగణం వెంటరాగా అత్రిమహర్షి ఆశ్రమ ప్రాంతానికి వచ్చారు. భార్యాసహితులై అలావచ్చిన త్రిమూర్తులను జూచి అత్రిమహర్షి అమందానందం చెందాడు వారికి సాష్టాంగ దండప్రణామం చేశాడు పుష్పాంజలి ఘటించాడు. చేతులు జోడించి నమస్కరించాడు. దుర్నిరీక్షమైన వారి తేజస్సు చూడలేక కనులు మూసుకొని వారి చరణ కమలములందు మనస్సును నిల్పి, మృదు మధుర వాక్కులతో ఇలా సన్నుతించాడు

మహనీయులారా! ప్రతీ కల్పంలోనూ లోకాలను సృజించి పెంచి, లయం చేయడానికి మాయామయములైన సత్వరజస్తమోగుణాల నాశ్రయించి బ్రహ్మ విష్ణు మహేశ్వరాఖ్యలతో వ్యవహరించెడి మీ పాదకమలాలకు నా అభివందనాలు. సంతానకాంక్షతో నేను నా మనస్సులో జగదీశ్వర నాముణ్ణే సంస్మరించాను అలాంటప్పుడు మానవులకు మనోభిగమ్యులుకూడా కాని మీరు ముప్పురూ ఇలా నా యెదుట ప్రత్యక్షమవడం ఆశ్చర్యకరంగా వుంది' అనేసరికి వారు అత్రిమహర్షికి ఇలా అన్నారు :

'మునీంద్రా మేము ముగ్గురంగా గోచరించినా మాకు భేదం లేదు. నీవు నీ మనస్సులో జగదీశ్వరుని ధ్యానించావు మేము ముప్పురమూ కలిసే జగత్పాలనం చేస్తూ వుంటాము నీ మనోవాంఛ నెరవేరుతుంది మా ముప్పురి అంశాలతో నీకు ముప్పురు కొడుకులు పుట్టి, నీకు లోకవిఖ్యాతి కల్పిస్తారు' అని వరమిచ్చి మునిచేత సంపూజితులై అంతర్హితులయ్యారు.

ఆ దంపతులకు అలాగే బ్రహ్మదేవుని అంశంలో చంద్రుడు, శ్రీహరి అంశంలో దత్తాత్రేయుడు మహేశ్వరుని అంశంలో దుర్వాసుడూ జన్మించారు ఆ ముప్పురూ అనవద్యచరిత్రులు· పరమపావనులు

అంగిరసునకు శ్రద్ధ యందు మహా సౌందర్యవతులైన నల్వురు కుమార్తెలు జన్మించారు. సినీవాలి, కుహువు, రాక అనుమతి అను పేర్లతో వారు విఖ్యాతి చెందారు ఆ నలుగురు కుమార్తెలేకాక ఆ దంపతులకు భగవత్తుల్యులూ, బ్రహ్మనిష్ఠులూ అయిన ఉచథ్యుడూ, బృహస్పతి అను ఇద్దరు కొడుకులు కూడా పుట్టారు.

పులస్త్యునకు హవిర్భుక్కు అను ఒక భార్యయందు అగస్త్యుడు జన్మించాడు ఆ అగస్త్యుడే జన్మాంతరంలో జఠరాగ్ని రూపంలో ప్రవర్తించాడు.

పులస్త్యునకు విశ్రవసుడనే మరో కొడుకు కూడా పుట్టాడు. ఆ విశ్రవసునకు ఇలబిల యను భార్యవలన కుబేరుడు; కైకసి యను నామెవలన రావణ కుంభకర్ణ విభీషణులు కలిగారు

పులహునకు నిజాంగనయైన గతియందు కర్మశ్రేష్ఠుడు వరీయాంసుడు సహిష్ణుడు అను ముప్వురు పుత్రులుదయించారు

క్రతువునకు క్రియయను నామెవలన బ్రహ్మతేజస్కులైన వాలఖిల్యాది మహామునులు అఱువదివేలమంది కలిగారు

వశిష్ఠునకు ఊర్జ యను నామెవలన చిత్రకేతుడు సురోచి, విరజుడు, మిత్రుడు, ఉల్బణుడు వసుభృద్యానుడు, ద్యుమంతుడు అను సప్తర్షులున్నూ; మరో భార్యవలన శక్తి మొదలైన పుత్త్రిలనేకులు ఉదయించారు

అథర్వునకు చిత్తి యను భార్య యందు ధృతవ్రతుడు అశ్వశిర స్కుడూ అయిన దధ్యంచు డనెడి కొడుకు పుట్టాడు

భృగుమహర్షికి ఖ్యాతి యను పత్నియందు ధాత విధాత అను ఇద్దఱు కొడుకులూ, భగవత్పరాయణ యైన శ్రీ యను కన్యకా జన్మించారు ఆ ధాతృ, విధాతృలు మేరువు కుమార్తెలైన ఆయతి, నియతి అనువారిని వివాహమాడి మృకండుడు ప్రాణుడు అనెడి కొడుకులను కన్నారు. మృకండుని కుమారుడు మార్కండేయుడు ప్రాణుని కొడుకు వేదశిరుడు. భృగువునకు ఉశను యను మరో కన్యయందు కవి యనువాడు పుట్టాడు.

ఈ రీతిగా కర్దమ దుహితలైన తొమ్మండుగురి వలన కలిగిన సంతాన పరంపరతో లోకాలన్నీ నిండిపోయాయి ఇప్పుడు నీకు కర్దమ దుహితృసంతాన ప్రకారం చెప్పాను ఇది వింటే పాపక్షయం కలుగుతుంది. ఇక దక్షప్రజాపతి వంశక్రమం చెపుతాను విను.

## దక్ష ప్రజాపతి సంతతి

మనువు తృతీయ పుత్రికయయిన ప్రసూతి యందు బ్రహ్మసూనుడగు దక్షప్రజాపతికి పదునాఱుగురు పుత్రికలు పుట్టారు. వారిలో శ్రద్ధ మైత్రి, దయ, శాంతి తుష్టి పుష్టి, క్రియ ఉన్నతి బుద్ధి, మేధ, తితిక్ష హ్రీ, మూర్తి అను పదముప్వురు కన్యలను దక్షుడు ధర్మునకిచ్చాడు మిగిలిన ముప్వురిలో స్వాహా అను నామెను అగ్నికి, స్వధయను కన్యను పితృదేవతలకు కడపటి కుమార్తె సతిని శివునకు ఇచ్చాడు

ధర్ముని భార్యల్లో శ్రద్ధవలన శ్రుతం,[1] మైత్రివలన ప్రసాదం, దయ వలన భయం, శాంతి వలన సుఖం తుష్టి వలన ముదం, పుష్టివలన స్మయం,[2] క్రియ వలన యోగం ఉన్నతి వలన క్షేమం, హ్రీ వలన ప్రశయం[3] అనెడి సంతతి కలిగింది. శ్రుత ప్రసాదాదులు ఆయా అభిమాని దేవతలని గ్రహించాలి.

ఇక ధర్మునకు పదమూడవ భార్యయైన మూర్తివలన నరనారాయణ ఋషులు జనించారు. వారు జనించినపుడు లోకాలన్నీ ప్రసన్నమయ్యాయి. వాయువు మందగమనంతో అనుకూలంగా వీచింది. దిక్కులు విశద మయ్యాయి దివ్యదుందుభులు మ్రోగాయి సముద్రాలు నిశ్చలంగా వున్నాయి. నదులు నిండుగా ప్రవహించాయి. గంధర్వులు మధురంగా గానం చేశారు అప్సరలు లాస్యం[4] చేశారు.

అప్పుడు బ్రహ్మాది దేవతలు ఆ మహానుభావులను దర్శించి, ఆకాశంలో గంధర్వనగరంలాగా స్వీయ మాయా బలంతో విశ్వాన్ని తన ఆత్మలో విర చించి దానిని ప్రకాశింపజేయడానికి ముని రూపంలో ఇలా జన్మించిన పరమ పురుషా నీకు మా ప్రణామాలు లోకంలో దుష్కర్మలు జరగకుండా చూచేం దుకు సత్త్వగుణంలో మమ్ము సృజించిన దేవదేవా! లక్ష్మీనివాసమై అర విందం[5] యొక్క కాంతిని తిరస్కరించెడి నీ కృపాపాంగ వీక్షణాలతో మమ్మల్ని చూడు' అని, సాక్షాత్తు భగవత్స్వరూపులైన ఆ నరనారాయణులను సన్నుతించేసరికి వారు మందస్మితంతో దేవగణాన్ని అభినందించి, తపశ్చ ర్యకై గంధ మాదనానికి వెళ్ళారు. ఆ నరనారాయణులే భూభారం తీర్చ డానికి భూలోకంలో కురు యదు వంశాల్లో అర్జునుడు కృష్ణుడు అనే నామా లతో జన్మించారు

అగ్నికి స్వాహా దేవియందు హుత భోజులగు పావకుడు, పవమానుడు, శుచి అను ముగ్గురు కొడుకులు పుట్టారు. వారికి నలుబదియైదు మంది కొడు కులు జనించారు పితృ పితామహులతో కలిసి వారు నలుబది తొమ్మిదిమంది అయ్యారు బ్రహ్మవాదులు యజ్ఞ కర్మల్లో అగ్ని దేవతాకములైన యిష్టులు ఆయా నామాలతో చేస్తారు. ఆ అగ్నులు-అగ్నిష్వాత్తులు, బర్హిషదులు, సౌమ్యులు, పితలు, ఆజ్యపులు, సాగ్నులు, నిరగ్నులు అని ఏడు విధాలు.

పితరులకు దాక్షాయణియైన స్వధయందు వయున, ధారిణి అను ఇద్దరు కన్యలు జన్మించారు వారు జ్ఞాన విజ్ఞాన పారంగతులు బ్రహ్మనిష్ఠాగరిష్ఠలు

---

1 శాస్త్రం, వినికి 2 గర్వం 3. అనునయం 4 నృత్యం.
5 తామర పువ్వు

దక్ష ప్రజాపతి కడపటి కూతురు సతి శివుని భార్య. ఆమె మహా పతి వ్రత. చాలాకాలం వరకు ఆమెకు సంతానం కలగలేదు. శివుని యెడల ద్వేష భావం వహించిన తన తండ్రి దక్షునిమీది కోపంతో యోగమార్గాన ఆమె శరీర త్యాగం చేసింది.' అని మైత్రేయుడనేసరికి, విదురుడు విస్మయంతో, 'మునీంద్రా! ముల్లోకాలకూ పూజనీయుడైన శివునకూ, దక్షప్రజాపతికీ విరో ధం ఎందుకు వచ్చింది? వారి వైరం కారణంగా సతీదేవి ప్రాణత్యాగం చెయ్యడం ఏమిటి? నాకు ఆ గాథ వివరంగా చెప్పండి' అని అర్థించేసరికి, మైత్రేయుడిలా చెప్పడం ప్రారంభించాడు

పూర్వం ఒకప్పుడు ప్రజాపతులు సత్రయాగం ఒకటి చేశారు. ఆ యాగం చూడటానికి మహర్షులూ దేవతలూ, బ్రహ్మ దేవుడూ, శివుడూ, అగ్ని మొదలైన వారందరూ వచ్చారు. ఇంతలో దక్షప్రజాపతి అక్కడకు వచ్చే సరికి అందరూలేచి ఆయనకు ప్రాంజలించారు బ్రహ్మ ఈశ్వరుడూ లేవ లేదు. దక్షప్రజాపతి వస్తూనే తన తండ్రియైన బ్రహ్మకు నమస్కరించి, నియ తాసనం మీద కూర్చున్నాడు. సదస్యుల పూజలందుకున్నాడు. కాని, అల్లుడైన ఈశ్వరుడు అందరితోపాటులేచి తనను గౌరవించలేదని ఆగ్రహించాడు కను కొలకులనుండి నిప్పులు కురిపిస్తూ రోషంతో ఇలా అన్నాడు

'సభా సదులారా! మీరందరూ నిశ్శబ్దంగా నేను చెప్పేది వినండి. మోహంతోగానీ మాత్సర్యంతోగానీ నేను చెప్పడం లేదు ఇదుగో, ఈ మహే శ్వరుణ్ణి చూడండి ఇతడు దిక్పాలకుల కీర్తికి కళంకం తెచ్చాడు, ఇతనికి సిగ్గులేదు. సజ్జనాచరిత మార్గాన్ని భంగించాడు సావిత్రితో సమానమైన నా కుమార్తెను ఈ వికటనేత్రునకిచ్చి అగ్నిసాక్షిగా పెండ్లి చేశాను. ఇతడు శిష్య భావం గుణించి లేచి నన్ను గౌరవించకపోతే పోనీ, నోటిమాటకేం కొఱత వచ్చింది?

'ఇతనికి ఉండడానికి ఇల్లులేదు. వల్లకాడు ఈతని నివాస భూమి కట్టుకునేందుకు బట్టలేదు. గజచర్మం ఇతని పరిధానం ఇక ఈతని చుట్టూ వుండేది భూతాలూ, ప్రేతాలున్నూ జుట్టు విరియబోసుకొని మహోగ్రంగా వుంటాడు. అలాంటి వానికి శివుడు (శుభంకరుడు) అనే పేరు ఎలా వచ్చిందో వచ్చింది కాని, వాస్తవంగా ఇతడు అశివుడు. మర్యాద లేనివాడు ఎఱిగి యెఱిగి శూద్రునకు వేదాన్ని ఇచ్చినట్లు ఇతనికి నా కూతురును విధిప్రేరణతో ఇచ్చి వివాహం చేశాను '

తన మామ దక్షుడు ఇంతగా నిందించినా రుద్రుడు కిమ్మనలేదు. మౌనంగా వుండిపోయాడు అయినా, దక్షుడు శాంతించలేదు ఇంకా రెచ్చి పోయి "ఇతన్ని శపిస్తాను చూడండి' అని చేతిలో నీటిని గ్రహించి లేచి

"యజ్ఞాల్లో ఇంద్రుడూ, ఉపేంద్రుడూ మొదలైన దేవతలతో పాటు ఇతనికి ఇది మొదలు హవిస్సులో భాగం లేకుండుగాక!" అని శపించాడు.

ఇలా దక్షుడు పలికిన వాక్యాలు నిందింపదగినవైనా అర్థాంతరంలో అవన్నీ భగవంతుడగు రుద్రుని యెడల స్తుతి వాక్యాలే కాగలవు. అయినా, సదస్సులందరూ ఒక్కుమ్మడిగా దక్షుని నిరసించేసరికి అతడు క్రోధోద్ధతుడై ఆ యజ్ఞశాల విడిచి నిజానివాసానికి వెళ్ళిపోయాడు.

అపుడు శివుని ప్రమథగణాలకు అధిపతియైన నందికేశ్వరుడు దక్షుని దురాలాపాలూ, అతడు శివుని కిచ్చిన శాపం విని, మహోగ్రుడై, కనులెఱ్ఱ వారగా "దక్షుడు మానవ శరీరాన్నే శ్రేష్ఠంగా భావించి అప్రతి ద్రోహియైన భగవంతునందు భేద దర్శియై మహాపరాధం చేశాడు. కనుక, అతడు తత్వ విముఖుడై తుచ్ఛములైన గ్రామ్య సుఖాలను ఆశిస్తూ అర్థవాదాలైన వేదాల చేత బుద్ధిని కోల్పోయి, కర్మ తంత్రాన్ని విస్తృతం చేస్తాడు. ఆత్మ తత్వాన్ని మఱచి పశుప్రాయుడై స్త్రీలోలుడౌతాడు. అచిరకాలంలోనే మేషముఖు డౌతాడు, అని ప్రతిశాపం ఇచ్చి, "అంతేకాదు, గౌరీశుని తిరస్కరించిన దురాత్ముడగు దక్షుని అనువర్తించే వారుకూడా జనన మరణాది దుఃఖాల పాలై, అర్థవాదాలైన వేదాదులందు నిరూపింపబడిన స్వర్గాది సుఖాలను కాంక్షించి కర్మాసక్తులౌతారు. భక్ష్యాభక్ష్య శూన్యులౌతారు శరీర పోషణం కోసం విద్యనభ్యసిస్తూ తపోవ్రతాలు ఆచరిస్తూ భౌతిక సుఖాలకోసం యాచక వృత్తి నవలంబిస్తారు" అని బ్రాహ్మణ జనాన్ని కూడా శపించేసరికి–

భృగుమహర్షి ఆగ్రహించి, "శివభక్తులూ వారి అనుచరులూ పాషండు లౌతారు సకల వర్ణాశ్రమాచారాలకు హేతువూ, సనాతనమూ, నిత్యమూ, పూర్వ ఋషి సమ్మతమూ, శ్రీ విష్ణుమూలకమూ అయిన వేదాన్నీ విప్ర గణాన్నీ నిందించిన కారణంచేత ఏ శివదీక్షయందైనా శివుడు మధ్యమ పూజ్యుడే గాని ఆది పూజ్యుడు కాడు మీరందరూ భస్మం, జడలు, ఎముకలు ధరించి మూఢులై నష్టశౌచులై పాషండులై చరిస్తారు' అని శపించాడు.

ఇలా వారు పరస్పరం శపించుకున్నా, భగవదనుగ్రహం కలవారవడం చేత ఎవరూ నశించలేదు అపుడు విమనస్కుడై ఈశ్వరుడు తన అనుచరులతో గూడి వెళ్ళిపోయాడు.

అనంతరం బ్రహ్మ గంగా యమునా సంగమస్థలంలో వేయి సంవత్స రాలు వైష్ణవ యజ్ఞం చేశాడు యజ్ఞ పరిసమాప్తి అయ్యాక అవభృథ స్నానం చేసి అందరు నిజాశ్రమ భూములకు వెళ్ళిపోయారు—' అని విదురునకు మైత్రేయుడు ఇంకా ఇలా చెప్పడం మొదలు పెట్టాడు

'దక్షుడు శివునితో వైరం పెట్టుకున్న చాలా కాలానికి అతడు ఆ పూర్వ విరోధాన్ని దృష్టిలోపెట్టుకుని రుద్రవిహీనంగా వాజపేయసవనం చేశాడు వాస్తవంగా రుద్రవిహీనమైన యాగం ఉండదు పరమేష్ఠి అతణ్ణి ప్రజాపతులందరికి అధిపతిగా చేశాడు ఆ గర్వం కూడా అతడలా అరుద్రయాగం చెయ్యడానికి మరోకారణం. వాజపేయ యాగానంతరం బృహస్పతి సవనం అనే మరో యజ్ఞం చెయ్యడానికి ఉపక్రమించాడు ఆ యజ్ఞానికి మహర్షులు, ప్రజాపతులు, దేవతలు నిజాంగనలతో కలిసివచ్చి దక్షుని దీవించి ఆయన పూజలందుకున్నారు.

ఆ యజ్ఞ విషయం సతీదేవికి తెలియదు గగన చరులు ఆ యజ్ఞ మహిమను సన్నుతించడం ఆమె చెవిని పడేసరికి ఆమె కుతూహలంతో ఆకాశంవంక చూచింది. నలువైపులనుంచి ఎందరో ఆ యజ్ఞం చూడడానికి వెళ్తున్నారు. వారి వెంట వారి భార్యలు కూడా ఉన్నారు అలా పతులననుగమించి వెళ్తున్న ఆ సుందరాంగనల చెవి కమ్మల జిలుగులు చెక్కుటద్దాలపై ప్రతిబింబిస్తున్నాయి కాంచన మణిహారాల కాంతులు భుజసీమను ఆవరిస్తున్నాయి వారు ధరించిన చీని చీనాంబరాల ప్రభలతో ఒడ్డాణపు శక్కులు మేలమాడుతున్నాయి లేడి కన్నుల్లాగా చంచలములైన వారి కనుల కాంతులు నల్దిక్కులా వ్యాపిస్తున్నాయి.

దక్షుని యజ్ఞం చూడడానికి అలా కలిసి మెలిసి వెళ్ళుతూన్న ఆ ఖేచరదంపతుల సోయగానికి సతీదేవి ముగ్ధురాలైంది తానుకూడా తండ్రి యజ్ఞం చూడాలని కుతూహల పడింది మందగమనంతో, వినయం ఉట్టిపడగా భర్త దరిచేరి యిలా అన్నది:

"దేవా! మీమామ యజ్ఞం చేస్తున్నారని విన్నాను అదిగో సురగంధర్వాదులందరు గగనమార్గాన నిజపత్నులతో గూడి ఆ యజ్ఞానికి వెళ్ళుతున్నారు, చూడండి. మనంకూడా అక్కడకు వెళ్లాలని నాకు కుతూహలంగా ఉంది ఆ యజ్ఞానికి నాతోబుట్టులందరు వారి పతులతో గూడి వస్తారు. మనం వెళ్ళితే వారిని చూడవచ్చు. నన్నెంతో అల్లారుముద్దుగా పెంచిన మా అమ్మను యజ్ఞదీక్షలో ఉండగా చూడాలని కూడా కుతూహల పడుతున్నాను.

"మహాశ్చర్య కరమూ గుణత్రయాత్మకమూ అయినా ఈ ప్రపంచం మీ మాయచేత విరచితమైంది. అంచేత మీకు ఏదీ కౌతూహల జనకం కాదు అయినా స్త్రీ సహజమైన చాపల్యంతో నా పుట్టినింటిని చూడాలని కాంక్షిస్తున్నాను ఆ యజ్ఞ వైభవం చూడడానికి దివ్యకాంతలు సాలంకృతలై నిజపతులతో కూడి కలహంసల్లా తెల్లగావున్న విమానాల నధిరోహించి అదిగో ఎలా వెళుతున్నారో చూడండి! నన్ననుగ్రహించి నాకోర్కె తీర్చండి తండ్రి ఇంట

జరిగేవేడుకలు చూడకుండా కుమార్తెలెలా వుంటారు? అయితే 'ఆయన మనల్ని పిల్వలేదు గదా!' అని మీరనవచ్చు. కాని, తండ్రీ, గురువూ, సుహృజ్జనులూ పిల్వకపోయినా వారి యిండ్లకు వెళ్ళడం అనుచితంకాదు. నేను మీ అర్ధాంగిని నన్ను మన్నించండి" అని సతీదేవి అర్థించేసరికి మహేశుడు మందస్మితం చేసి, ప్రజాపతుల సమక్షంలో దక్షుడు ఛళ్ళాడిన వాడి ములుకుల్లాంటి నిందావాక్యాలను తలపోస్తూ యిలా అన్నాడు:

కల్యాణీ నీవన్నది వాస్తవం పిలువకపోయినా బంధువుల యిండ్లకు వెళ్ళవచ్చునన్నావు కాని వారు దేహాభిమానంతోనూ, మదగర్వంతోనూ కోపావిష్టులు కాకపోతే వెళ్ళవచ్చు విద్య, తపస్సు, విత్తం, రూపం, వయస్సు, కులం- ఇవి సజ్జనులకు గుణాలు కాగా దుర్జనులయెడ దోష హేతువులవుతాయి మూర్ఖులు ఆత్మగర్వంలో మహాత్ముల మహిమనెఱుగరు. కనుక, కుటిలులైన వారిండ్లకు బంధురీతిని వెళ్ళకూడదు. వెళ్తే వారు కను బొమలు చిట్లించి రోషకషాయిత నేత్రాలతో అనాదరంగా చూస్తారు.

అభిమాన వంతుడు శత్రుప్రయుక్త బాణాలతో శరీరం శిథిలమైనా సహించి నిద్రిస్తాడు కృశించడు. కాని ఇష్టబాంధవుల మర్మచ్ఛేదకాలైన దురుక్తులకు పరితపించి కృశించి పోతాడు. విను దక్షునకు నీమీద ఎంత అను రాగం వున్నా, నన్నుబట్టి అతడు నిన్నాదరించడు అతడు వచ్చేసరికి నేను లేచి అతన్ని గౌరవించలేదని మాత్సర్యంతో అతడు నాపై అకారణ వైరం వహించాడు. అతనికి దేహాభిమానం ఎక్కువ.

లోకంలో మానవులు ఎవరైనా పెద్దలు వచ్చినప్పుడు లేచి నమస్క రించడం కద్దు కాని ప్రాజ్ఞుల దృష్టిలో అలాంటి దైహిక వ్యాపారం అయుక్తం పరమ పురుషుడు సర్వాంతర్యామి అంచేత వారు మనస్సులోనే నమస్కారం చేస్తారు కాని దేహాభిమానం గల పురుషులయెడ అలా చెయ్యరు అలాగే, నేనున్నూ ప్రాణికోటి అంతఃకరణాల్లో ఆవరణం లేకుండా ప్రకాశించే వాసుదేవునకు నా హృదయంలో నమస్కరిస్తాను.

"పూర్వం ప్రజాపతులు చేసిన సత్రయాగ లో నన్ను ద్వేషించి, కూడని పల్కులెన్నో పలికిన నీ తండ్రి దక్షుడూ అతని అనుచరులూ నింద్యులు. నీవు వారిని చూడడానికి వెళ్ళడం అనుచితం ఒకవేళ నీవు నా మాట అతిక్రమించి అక్కడకు వెళ్ళితే నీకు పరాభవం తప్పదు. బంధుజనుల వలన జరిగెడి అవమానం మృత్యుతుల్యం అని పలికి, 'వెళ్ళమంటే ఆమెకు అక్కడ పరాభవం తప్పదు వద్దంటే ఆమె మనోవేదనతో కుంగి పోతుంది' అని మనస్సులో భావించి శివుడు ఇంకేమీ అనకుండా మౌనంగా వుండిపోయాడు.

పతి మాటలు విని సతి కంపించిపోయింది కనులవెంట బొటబొట నీళ్ళు కారాయి ఆమె వెచ్చని నిట్టూర్పులకు ఆమె కంఠహారాలు కూడా వెచ్చబడ్డాయి. దుఃఖంతోనూ రోషంతోనూ ఆమె హృదయం చలించింది ఏమైనాసరే, పుట్టింటికి వెళ్లాలనే కోర్కె ప్రబలమైంది. ఎంతో అనురాగంతో ఆత్మదేహంలో అర్ధ భాగ మిచ్చిన పతిని విడిచి మౌర్ఖ్యంతో తండ్రిని చూడాలని బయలుదేరింది

అలా ఆమె ఒంటరిగా, చరచరా వెళ్ళిపోతుంటే మణిమన్నదాదులైన వేయిమంది శివానుచరులు ఆమె నిత్యమూ ధరించెడి క్రీడాకందుకం[1] పద్మం, గోరువంక తాళవృతం[2] అద్దం, వెలిగొడుగు, పూలదండ పచ్చకప్పురం కస్తూరి, చందనం, మణి భూషణాదులు తీసికొని వృషభ వాహనాన్ని వెంట బెట్టుకుని వెళ్లారు. ఆమెను కలిసికొని శంఖ దుందుభి వేణునాదాలు అతిశయిస్తుండగా ఆమెను వృషభవాహనంపై ఎక్కించి శీఘ్రగమనంతో దక్షుని యజ్ఞభూమిని చేరారు

యజ్ఞభూమి వేదఘోషలతో ప్రతిధ్వనిస్తోంది. కుశ చర్మాదులతోను, మృత్కనకమయములైన పాత్ర విశేషాలతోను యూపస్తంభాలతోను అతి మనోహరంగా వుంది. మునులూ, దేవతలూ యథార్హస్థానాల్లో కూర్చున్నారు అలా కనుల పండువుగా వున్న యాగశాలలోకి సతీదేవి మహానందంతో ప్రవేశించేసరికి ఆమె తల్లీ, పినతల్లులూ ఆమెను కౌగలించుకొని ఆనంద బాష్పాలు చిందిస్తూ ఆమె యోగక్షేమాలు అడిగారు కాని ఆమె తండ్రి దక్షుడు మాత్రం ఆమెను కన్నెత్తి యైనా చూడలేదు. అతని వలని భయం చేత సదస్యులెవరూ కూడా ఆమెను పలకరించనైనా పలకరించలేదు

సతీదేవి మనస్సు చివుక్కుమన్నది ఆమె తండ్రి చేసిన అవమానం భరించలేకపోయింది. తల్లీ, తోబుట్టువులు చేసిన పూజలను తిరస్కరించింది మాట పలకకుండా నిలబడిపోయింది –

ప్రమథగణాలు దక్షుడు సతీదేవికి చేసిన పరాభవం చూసి మండిపడ్డారు. అరుదంగా అతడు చేస్తున్న యజ్ఞం చూసి మహోద్రేకం చెందారు. రోషాగ్నితో లోకాలను దహించివేసేలా గోచరించారు. రుద్రద్వేషి అయిన దక్షుని వధించడానికి ఉద్యుక్తులయ్యారు. అపుడు సతీదేవి వారిని వారించి, తండ్రి నుద్దేశించి యిలా అన్నది :

"లోకంలో దేహధారులైన జీవులకు ఆత్మ స్వరూపుడైన శివుని దృష్టిలో ప్రియులూ, అప్రియులూ అధికులూ అని యెవ్వరూ వుండరు.

1. బంతి. 2. విసనకఱ్ఱ

సకల కారణుడూ మాత్సర్య విహీనుడూ అయిన రుద్రునియందు నీవు తప్ప ఇతరులెవ్వరు ప్రతికూలాచరణం చేస్తారు? నీవంటివారు ఇతరుల గుణాల యందు దోషాలను ఆరోపిస్తారు. సాధువులైనవారు పరుల దోషాలను కూడా గుణాలుగా గ్రహిస్తారు జడ స్వభావంతో దేహాన్ని ఆత్మగా భావించెడి దుష్టులు మహాత్ములను నిందించడంలో ఆశ్చర్యం లేదు.

'శివ' అను అక్షరద్వయాన్ని మనస్సులో భావించి నోటితో పలికితే చాలు. సకలపాపాలు హరిస్తాయి మహితాత్ముడైన ఆ శివుణ్ణి నీవు ద్వేషించ డం ఆశ్చర్యం ఎవని పాదపద్మాలను దర్శించి బ్రహ్మానందమనెడి మక రందాన్ని హృదయ మధుపాళి[1]తో త్రావి విజ్ఞులు సంతుష్టచిత్తులౌతారో ఆ దేవదేవునికే నీవు అపచారం చేశావు. నిన్ను ఏమనాలి?'

"ఆ మహాదేవుని చరణ కమలాలను సేవిస్తే కోరిన కోర్కెలన్నీ ఫలిస్తాయి అలాంటి వానినా నీవు తిరస్కరించడం? చితాభస్మం, పునుక దండలు ధరించి, పిశాచగణాలతో పరివేష్టితుడై శ్మశానంలో నివాసం చేస్తా డనిన్నీ, అమంగళకరుడనిన్నీ మహేశ్వరుణ్ణి నీవు తప్ప ఇంకెవ్వరూ చులకన చెయ్యరు. బ్రహ్మేంద్రాది దేవతలందఱు ఆ మహాత్ముని చరణ సరోజ రేణువు లను తలదాల్చి తరించరూ? అలాంటి దేవదేవుని నిందించెడి కలుషాత్ముని నాలుక కొయ్యాలి. ఆ పని చెయ్యలేకపోతే తాను ఆత్మాహుతి యైనా చేసు కోవాలి. ఈ రెంటికి ఓపనివాడు చెవులు మూసుకుని వెళ్ళిపోనైనా పోవాలి- అని ధర్మవిదులంటారు.

'మానవుడు తెలియక తిన్న దుష్టాన్నాన్ని కక్కివేసి పవిత్రుడైన ట్లుగా దుష్టబుద్ధితో ఈశ్వరుని నిందించిన నీ కడుపున పుట్టిన నేను హేయ మైన ఈ శరీరాన్ని విడిచి పరిశుద్ధురాలనవుతాను దేవతలకు ఆకాశగమనం, మానవులకు భూతల గమనం స్వాభావికం అలాగే ప్రవృత్తిలక్షణమైన కర్మరాగకారణమనిన్నీ, నివృత్తిలక్షణమైన కర్మ వైరాగ్య కారణమనిన్నీ వేదాలు నిర్వచిస్తున్నాయి. ప్రవృత్తి కర్మలు సంసారులకు విహితములైనట్లు నివృత్తి లక్షణంగల యోగులకు విహితములు కాగలవు. కనుక, ఆత్మారాము లైన యోగులు విధి నిషేధ రూపకములైన కర్మలను అనుసరించనూవచ్చు, మాననూవచ్చు. వానిని మానినంత మాత్రంచేత వారికి కలిగే ప్రత్యవాయం[2] ఏమీ వుండదు. కనుక, స్వధర్మనిష్ఠుడగు వానిని నిందించడం తగదు.

"బ్రహ్మభూతుడైన సదాశివునకు విధి నిషేధాత్మకాలైన ఉభయ కర్మలతో పనిలేదు. అలాంటి మహానుభావుని క్రియాశూన్యుడని నిందించడం

---

1 హృదయములనెడి తుమ్మెదలలో

2 దోషం.

పాపహేతువు యోగిజనసేవ్యాలైన అణిమాద్యష్ట సిద్ధులు మాకు సంకల్ప మాత్రంచేత ప్రాప్తిస్తాయి అవి నీకు లభించవు ప్రవృత్తి కర్మలవలన నీకు లభించేది సిద్ధులు సామాన్యమైనవి కనుక, చితాభస్మాస్థిధారణుడైన శివుడు దరిద్రుడనిన్నీ, నీవే అధికుడవనిన్నీ భావించడం అవివేకం శివుని యెడ అపరాధం చేసిన నీకు నేను కుమార్తెనని చెప్పుకొనడం కూడా సిగ్గు చేటు. మహాత్ములకు అపరాధం చేసేవారి జన్మ యెందుకు? కాల్చనా?

"నా ప్రాణనాధుడైన ఈశ్వరుడెప్పుడైనా నన్ను జూచి 'దాక్షాయణీ' అని నర్మగర్భంగా పిలిస్తే నేను ఆ అవమానాన్ని ఎలా భరించగలను? అట్టి అవమానం భరించడంకంటె చావడం మంచిది" అని పలికి సతీదేవి ఉత్తర దిక్కుకు తిరిగి యోగమార్గాన శరీరత్యాగం చెయ్యాలనే తలంపుతో ఆచ మించి నేలమీద కూర్చుంది.

ప్రాణాపాన వాయువులను నిరోధించి, ఆ రెంటిని ఏకరూపం చేసి నాభితలమందలి సమానవాయువుతో చేర్చింది. అనంతరం ఉదానవాయువును లేపి, ఆ ఉదానవాయువును కంఠమార్గాన భ్రూమధ్యమందు నిలిపింది. శివుని పాదపద్మాలను చింతిస్తూ, తన భర్తను తప్ప అన్యమేదీ చూడడానికి అంగీ కరించక మహాదేవుని అంకపీఠిక యందు అధివసించి గౌరవమందెడి శరీరాన్ని తన తండ్రి యందలి వైరంతో భస్మీకరింపదలచి అనిలాగ్ని ధారణచేసింది అందుండి యోగాగ్ని బయల్వెడలి క్షణంలో సతీదేవి శరీరాన్ని దహింపజేసే సరికి నలుదిక్కులా హాహాకారాలు చెలరేగాయి అపుడందరు ఒక్కుమ్మడిగా "సకలచరాచరజనకుడైన ఈ దక్షుడు అవమానంతో తన కుమార్తె సతీదేవి తన కట్టెదుట శరీరత్యాగం చేస్తే చూస్తూ ఊరకున్నాడు ఇంతకంటె క్రూర త్వం ఎక్కడైనా వుంటుందా? ఈ దుష్టునకు శాశ్వతమైన అపకీర్తి తప్పదు ఇతడు దుర్గతి పాలౌతాడు" అని నిందించారు.

అలా దేహత్యాగం చేసిన సతిని చూచి రుద్రపార్షదులు దక్షుని వధింప డానికి ఆయుధాలు గైకొని ఉద్రేకంతో లేచారు. ఆ కలకలం చూచి భృగు మహర్షి యజ్ఞభంగం చెయ్యడానికి తలపెట్టిన వారిని సంహరించేందుకు దక్షి ణాగ్నిలో అభిచారహోమం చేశాడు. అపుడు నిజ తపఃప్రభావంచేత సోమ లోకంలోవున్న వేలకొలది ఋభునామధేయులైన దేవతలు ఉదయించి కొఱవు లను ఆయుధాలుగా గ్రహించి, ప్రమధగణాలను పారద్రోలారు.

అనంతరం శివుడు నారదర్షివలన సతీదేవి దక్షునిచే అవమానితయై శరీర త్యాగం చెయ్యడం, ప్రమధగణాలు ఋభునామక దేవతలచే పరాజితులు కావడం విని క్రుద్ధుడయ్యాడు. పండ్లు పటపట కొరకుతూ సింహగర్జనం చేశాడు. అగ్ని జ్వాలలాగా వెలుగులు చిమ్ముతూ తన జటాభారం నుండి ఒక జటను పెరికి భూమి మీద విసిరివేశాడు.

అప్పుడా జటనుండి అపరరుద్రుడు లాగా వీరభద్రుడు జనించాడు. అత్యంత దీర్ఘమైన అతని నీల శరీరం ఆకాశాన్ని తాకుతోంది అతని తల వెంద్రుకలు అగ్ని జ్వాలికల్లాగా మెఱుస్తున్నాయి. ఏనుగు తొండాల్లాంటి వేలు బాహువులతో భీకరంగా వున్నాడు. సూర్యుని లాగా ప్రకాశిస్తూన్న మూడు నేత్రాలతో అతడు సకల లోక దుర్నిరీక్ష్యంగా వున్నాడు అతని కోఱలు జంపపు పళ్ళలాగా వున్నాయి. మెడలో పునుకదండలు వ్రేలాడుతున్నాయి;

రుద్రుని జట నుండి అలా ఆవిర్భవించిన వీరభద్రుడు తన వేయి చేతులు మొగుడ్చి, తాను ఏం చేయాలో చెప్పమని అర్థించేసరికి రుద్రుడు ఓయీ నీవు ప్రమథగణాలకు అధిపతివై పోయి దక్షుణ్ణి దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేయి. బ్రాహ్మణ తేజం అమోఘమని నీవు శంకించాల్సిన పనిలేదు. నా అంశంలో జనించావు కనుక నీకు అసాధ్యమైనదేదీ ఉండదు" అని ఆజ్ఞాపించాడు.

వీరభద్రుడు భయంకరమైన శూలం ధరించి, తండ్రికి ప్రదక్షిణం చేశాడు. రుద్రానుచరులు వెంట రాగా వెంటనే బయలుదేరాడు. అతని గమన వేగానికి భూమి కంపించిపోతోంది అతని కాలి అందెలరవళి నలుదిక్కులా ప్రతిధ్వనిస్తోంది.

## దక్షాధ్వర ధ్వంసం

అలా ఉరవడి వస్తున్న రుద్రపార్షదుల పాద ఘట్టనలకు రేగి ఉత్తరదిశ నంతటా అలముకొన్న ధూళిని దక్షుడూ, ఋత్విజులూ చూచి ముందు చీకటి యని భ్రమించి, చీకటి కాదు-ధూళి పటలమని నిశ్చయించుకొని, 'ఈ సమయంలో ఇలా ధూళి పుంజం బయలుదేరడానికి వాయువులు వీవడంలేదే; పోనీ, చోరాదులవలన చెలరేగిన రజఃపటలం అనుకుందామా అంటే, ప్రాచీన బర్హి రాజ్యపాలనలో చోరులకు తావెక్కడిది? అలా కాక, గోధూళులేమో అనుకుంటే ఇది అందుకు తగిన సమయం కాదే ఇక ప్రళయ సమయం దాపురించిందేమో లేకపోతే, ఏదో మహాప్రమాదాన్ని సూచించే ఈ భయంకర ధూళి పటలం ఏమిటి?' అని అనేక రీతుల వితర్కించడం మొదలుపెట్టారు.

అపుడు ప్రసూతి మొదలైన మునికాంతలిలా అన్నారు, "అది ఏదీ కాదు. అందటి సమక్షంలో రుద్రుని నిందించడమే కాక, న్యాయాన్ని కాలరాచి సతీదేవి యెడల మహాపరాధం చేసిన దక్షుని పాపవిపాకం ఇది రుద్రుడు సామాన్యుడా? అతడెంతకైనా సమర్థుడు. ప్రళయ సమయంలో తన త్రిశూలాగ్రంతో దిగ్గజాలను వధిస్తాడు అతని అట్టహాసానికి దిక్కులు బ్రద్దలౌతాయి అతని దంష్ట్రాగ్రాల తాకిడికి నక్షత్రాలు నేల రాలిపడతాయి. అతడు

కనుబొమ ముడిస్తేచాలు- అఖిల లోకాలు గజగజలాడతాయి అతడు జుట్టు విరియబోసుకుని భయంకరంగా వుంటాడు ముల్లోకాలను తృటిలో సంహరించగల సమర్థుడాతడు- అలాంటి జగదీశ్వరునకు కోపం తెప్పించిన మనకు అమంగళం తప్పదు "

విప్ర కాంతలలా భయ విహ్వలలై అంటుండగా దక్షుడు కూడా చలించాడు. అతనికి భూనభోంతరాలల్లో ఎన్నో దుర్నిమిత్తాలు పొడగట్టాయి. ఆ సమయంలో రుద్రాను చరులు యజ్ఞశాలలో ప్రవేశించి అటూ యిటూ పరుగులు పెట్టుతూ దక్షాధ్వర ధ్వంసం మొదలుపెట్టారు కొందఱు ప్రాగ్వంశాన్ని* కొందఱు పత్నీశాలను, కొందఱు సదస్యశాలను, కొందఱు మహానస గృహాన్ని[1], విధ్వంసం చేశారు. మఱి కొందఱు యజ్ఞపాత్రలను పగులకొట్టారు. కొందఱు హోమాగ్నులను ఆర్పివేశారు కొందరుయజ్ఞవేదిక మేఖలలు త్రెంచి వేశారు. కొందరు మునులను బాధించారు. కొందరు మునిపత్నులను భయ పెట్టారు కొందరు దేవతలను నిరోధించారు

మణిమదాదులు భృగువును, దక్షుని, పూషుని, భగుని పట్టుకొని బంధించారు ఋత్విక్కులను, సదస్యులను మోచేతులతోను, మోకాళ్ళతోను పొడిచారు. అరచేతులతో మోదారు అపుడు వారందరు కకావికలై తలకొక దారి పట్టి పారిపోయార్రు.

ఆనాడు దక్షుడు శివనింద చేస్తున్నప్పుడు కనుగిటిన భగుని పట్టుకొని నందీశ్వరుడు కనులు పెరికి వేశాడు. పరిహసించిన పూషుని చండీశ్వరుడు నిరోధించి, బలభద్రుడు కళింగుని[2] దంతాలను ఊడగొట్టినట్లు అతని పండ్లు ఊడగొట్టాడు. గడ్డం దువ్వుతూ నవ్విన భృగువును వీరభద్రుడు బయటకు లాగి, అతని గడ్డాన్నీ మీసాలనూ ఊడబెరికాడు

అనంతరం వీరభద్రుడు దర్పంతో దక్షుని పైబడి, అతని రొమ్మును కాలితో త్రొక్కిపట్టి, పదునైన కత్తితో పొడిచాడు. మంత్ర సమన్వితాలైన ఎన్నో అస్త్రాలు ప్రయోగించాడు కాని అతని చర్మం అణు మాత్రం కూడా ఛిన్నం కాక పోయేసరికి వీరభద్రుడు విస్మయపడి, తుదకు యజ్ఞ పశువును వధించినట్లు వధించడానికి ముందు దక్షుని మెడనులిమి అనంతరం అతని శిరస్సును ఛేదించాడు

వీరభద్రుడు చేసిన ఆ ఘోరకార్యం చూచి ప్రమథగణాలు మహానందం చెందాయి. బ్రాహ్మణులు హాహాకారాలు చేస్తూ తల్లడిల్లిపోయారు. ఆ రీతిగా

---

* యజ్ఞ వాటికలో ఒక గృహం.

1. వంట యిల్లు 2. అనిరుద్ధుని వివాహ సమయంలో బలరాముడు కళింగుని దంతాలు ఊడగొట్టాడు.

వీరభద్రుడు దక్షుని యాగ విధ్వంసం చేసి అతని ఖండిత శిరస్సును దక్షిణాగ్నిలో వ్రేల్చి నిజ నివాసమైన కైలాసానికి వెళ్ళిపోయాడు.

## దేవతలు బ్రహ్మను దర్శించడం

రుద్రానుచరుల దారుణ శస్త్రాస్త్రాలతో విదారితగాత్రులైన దేవతలు ఒకాయొకని బ్రహ్మ దగ్గఱకు వెళ్ళి ఆయన పాదాలకు నమస్కరించారు. జరిగిన వృత్తాంతం అంతా పూస గుచ్చినట్లు విన్నవించారు ఇలా జరుగుతుందని అంతకుముందే యెఱిగిన విశ్వాత్ముడైన విష్ణువూ, బ్రహ్మ ఆ యజ్ఞానికి వెళ్ళలేదు

దేవతల మొఱ ఆలించి బ్రహ్మ వారితో ఇలా అన్నారు. 'మహా తేజశ్శాలియైన పురుషుడొక వేళ ఏదైనా అపరాధం చేసినా, స్వీయ క్షేమం కోరిన వాడెవ్వడూ అందుకు ప్రతీకారం చెయ్యడానికి యత్నించడు యజ్ఞభాగానికి అర్హుడైన రుద్రునకు యజ్ఞభాగం లేకుండా చేసిన మీరందఱు మందమతులు, దుష్టులు

రుద్రుడంటే ఎవ్వరనుకున్నారు ? ఆ మహానుభావుడు ఆగ్రహిస్తే లోకాలూ, లోకపాలకులూ ఇట్టే నశిస్తారు దక్షుని దురుక్తుల చేతనే అతని మనస్సు ఎంతో గాయపడింది ఇక సతీవియోగం వలన ఆయన ఎంతగా క్రోధోన్మత్తుడై వుంటాడో ఊహించండి అయినా మీరు తిరిగి యజ్ఞాన్ని నిర్వహించాలనుకుంటే ఆ దేవదేవుని పాదాలపై వ్రాలి నిర్మల మనస్సుతో ఆయన్ను వేడుకోండి మీ కోర్కె సిద్ధిస్తుంది అని పలికి శివుని దర్శించడానికి భయపడుతున్న దేవ పితృగణాలనూ, ప్రజాపతులనూ వెంటబెట్టుకుని బ్రహ్మ కైలాసానికి బయలుదేరారు.

అలా వారందఱు వెళ్ళి వెళ్ళి కనుల పండువుగా వున్న కైలాస పర్వతాన్ని చూచి మహానందం చెందారు శివనివాసభూతమైన ఆ కైలాస నగరం సకల శుభాలకు ఆస్పదమైనది. దేవతలూ, కిన్నరులూ, సిద్ధులూ, అక్కడ మహోల్లాసంగా సంచరిస్తూ వుంటారు. ఆ పర్వతం ముందు కులపర్వతాలు కూడ ఎందుకూ పనికిరావు. ఆ గిరిశృంగాలు గైరికాది ధాతువులతోను రత్న కాంతులతోను జ్వలిస్తూ ఉంటాయి ఆ కొండచరియల్లో గంధర్వులూ కిన్నరులూ అప్సరలూ విహరిస్తూ వుంటారు ఆ వెండికొండ నానావిధ వృక్ష పంక్తులతోనూ మృగనివహాలతోనూ పక్షిగణంతోనూ ముచ్చటగా వుంటుంది. అచటి సరోవరాల్లో కలహంసలూ చక్రవాకాలూ మొదలైన జలపక్షులు

విహరిస్తూ కలకూజితాలు చేస్తుంటాయి ఆ సరోవరాల్లో జలక్రీడలాడే జవ్వనుల మైపూతల సుగంధం నలువైపులా గుబాళిస్తూ వుంటుంది

అలా చూపరులకు ఎంతో మానసోల్లాసాన్ని కల్పించే కైలాస పర్వతాన్ని సమీపించి పద్మభవాదులు తొలుత అలకానగరాన్ని అతిక్రమించారు క్రమంగా నంద, అలకనంద అనెడి నదీద్వయాన్ని దాటారు అనంతరం సౌగంధికవనం సమీపించారు ఆ వన రామణీయకం వర్ణించడానికి సాధ్యం కాదు. ఆ వనంలోని మంచి గంధపుచెట్లను మదగజాలు ఒరసికొనడంవల్ల ఉత్పన్నమైన సువాసనలతో గూడిన వాయువును అచట విహరించెడి యువతీ జనం పదేపదే ఆస్వాదించి పారవశ్యంతో సోలిపోతూ ఉంటారు ఆ ఉద్యాన వన సోపానాలు వైడూర్య నిర్మితాలు అచటి దిగుడుబావులు స్వర్ణకమలాలతో మనోజ్ఞంగా వుంటాయి

ఆ సౌగంధిక వనానికి అనతి దూరంలో ఒక విశాలమైన మఱ్ఱిచెట్టు వుంది. దాని పొడవు నూరు యోజనాలు డెబ్బైఅయిదు యోజనాల నిడివి గల దాని కొమ్మలు నలువైపులా వ్యాపించి వున్నాయి. సందు లేకుండా దాని ఆకులు దట్టంగా వుండడంచేత దాని నీడ కూడా చిక్కగా వుంది. దాని పండ్లు మాణిక్యాల్లా ఉన్నాయి

ఆ వటవృక్షమూలంలో మహేశ్వరుడు ఎడమపాదాన్ని కుడితొడపై నుంచి ఎడమ బాహువును ఎడమ మోకాలిమీద ఆన్చి వీరాసనాసీనుడై వున్నాడు. కుడి ముంజేతిలో అక్షమాల ధరించాడు తర్కముద్ర* వహించాడు. సనందాది మహర్షులూ, సిద్ధులూ, యక్షాధిపతి కుబేరుడూ ఆయన్ను భక్తితో సేవిస్తున్నారు ఆయన ముఖంలో శాంతం, వాత్సల్యం ఉట్టిపడుతున్నాయి. యోగీంద్రులు వింటూండగా నారద మహర్షితో ప్రియ సంభాషణం చేస్తూన్న ఆ చంద్రశేఖరుని దర్శించి లోకపాలకులూ, మునులూ ఆయన పాదాలపై వ్రాలారు.

వారితోపాటు వచ్చిన చతురాననుని చూచి మహేశ్వరుడు ససంభ్రమంగా లేచాడు. వామనుడు కశ్యపునకు నమస్కరించినట్లు ఆయనకు నమస్కరించాడు అనంతరం రుద్రానువర్తులైన ఋషులూ సిద్ధులూ బ్రహ్మదేవుని పాదాలకు మ్రొక్కారు అపుడు బ్రహ్మ మందహాసం చేస్తూ మహేశ్వరునకిలా అన్నాడు-

---

*చూపుడు వ్రేలియొక్కయు, బొటనవ్రేలియొక్కయు మధ్యభాగాలను కలిపి, తక్కిన వ్రేళ్ళను చాచిన యెడల దానిని 'తర్కముద్ర' అంటారు.

## బ్రహ్మాదులు దక్షిణామూర్తి స్వరూపుడగు శివుని నుతించడం

'మహేశ్వరా! నీవు జగత్కారణుడవు నిర్వికార పరబ్రహ్మవు నీ అంశాలైన శక్తి శివరూపాలతో క్రీడిస్తూ సాలెపురుగులాగా అన్యసాధనాపేక్ష లేకుండా నీవు లోకాలను సృజించి పెంచి లయం చేస్తూ వుంటావు. వర్ణాశ్రమ ధర్మాలకు ఆశ్రయి భూతాలైన వేదాలను వృద్ధి చెయ్యడానికే కదా! నీవు దక్షునిచేత యజ్ఞం చేయించింది

నీవు శుభాకారుడవు శుభకర్మలు చేసేవ్వారికి మోక్షాన్నీ అశుభకర్మాచరణానికి పాల్పడేవారికి నరకాన్నీ ఇచ్చేది నీవే. అలాంటప్పుడు ఆయా కర్మలు ఒక్కొక్కని యెడల వ్యత్యాసం పొందడానికి కారణం ఏమిటో తెలియదు. నీ చరణ కమలములయందు మనస్సును నిల్పి సర్వభూతాల్లో నిన్నూ, తన ఆత్మలో సర్వభూతాలనూ అభేదభావంతో చూచెడి మహాత్ముల యెడ నీకు క్రోధం కలుగదు అయినా, నీకు క్రోధమేమిటి?

. కనుక భేద బుద్ధితో కర్మప్రవర్తకులై పరవైభవాన్ని సహించలేక మర్మచ్ఛేదకాలైన దురుక్తులతో ఇతరులను పీడించే దైవోపహతులను కూడా నీవంటివారు కరుణించి క్షమించాలి ఎంతటివారికైనా విష్ణుమాయ అలంఘ్యం. ఆ మాయచేత మోహితాత్ములై ఎవరైనా భేదభావంతో అపరాధం చేస్తే దాన్ని దైవకృతంగా భావించి సాధువులు అలాంటివారిని కూడా కరుణిస్తారు హింసించరు నీవు విష్ణుమాయకు అతీతుడవు సర్వజ్ఞుడవు. కనుక మాయా మోహితులై కర్మ ప్రవర్తనులైన వారివలన ద్రోహమేదైనా కలిగితే నీవు ఆగ్రహించక వారిని రక్షించాలి.

యజ్ఞభాగానికి అర్హుడవైన నీకు యజ్ఞభాగంలేకుండా చెయ్యడం మహాదోషం. అంచేతనే దక్షాధ్వరం నీ వలన భగ్నమైంది నీవు కరుణించి ఆ యజ్ఞ పరిసమాప్తి చెయ్యాలి కనుక దక్షుని పునర్జీవికుని చెయ్యి. భగునకు నేత్రాలూ భృగునకు శ్మశ్రువులూ[1] పూషునకు[2] దంతాలూ తిరిగి వచ్చేలా అనుగ్రహించు నీ పార్షదుల శస్త్రాస్త్రాలంచే వికలాంగులైన దేవతలకూ, ఋత్విక్కులకూ అంగసాకల్యం కల్పించు యజ్ఞ పరిపూర్తికి హేతుభూతమైన నీ యాగభాగం నీకు లభిస్తుంది'

---

1 గడ్డం మీసం 2 సూర్యునకు

# రుద్రుడు దక్షాదులను అనుగ్రహించడం

అని చతురాననుడు సవినయంగా అర్థించేసరికి చంద్రమౌళి సంతృప్తుడై, 'ప్రజాపతీ విను విష్ణుమాయచే పామరులు చేసే అపరాధాలను నేను పట్టించుకోను కాని కలుషాత్ముల దోషాలకు మాత్రం తగిన దండనం విధిస్తాను. మదోన్మత్తులను దండించడం దుర్బలులను రక్షించడం ధర్మపద్ధతి కాదా' అని పలికి-

దక్షుని శిరస్సు దగ్ధమైపోయింది కనుక అతనికి మేక తలతెచ్చి అమర్చండి అతడు పునర్జీవుడవుతాడు కళ్ళు పోగొట్టుకొన్న భగుడు మిత్రుడను పేరుగల దేవత కళ్ళతో చూస్తాడు దంతాలు కోల్పోయిన పూషుడు యజమానుని దంతాలతో పిష్టపురోడాశం* భుజిస్తాడు. యజ్ఞావశిష్టాన్ని నాకు ఇవ్వడంచేత దేవతలకు అవయవ సాకల్యం కలుగుతుంది ఖండితాంగులైన ఋత్విక్కులు మొదలైనవారు సూర్యకిరణాల చేతను, దేవవైద్యులైన అశ్వినీ దేవతల చేతను తిరిగీ తమ బాహువులను పొంది జీవిస్తారు ఇక శ్మశ్రువులను పోగొట్టుకున్న భృగువు మేష శ్మశ్రువులతో మీసాలతో వర్తిస్తాడు అని అనుగ్రహించేసరికి సమస్తభూతాలూ సంతోషించి అయన్ను అభినందించారు.

అనంతరం బ్రహ్మాదులు రుద్రుని మున్నిడుకొని దక్షాధ్వరవాటికకు వెళ్ళారు.

శివుని యోగక్రమం చేత మునులూ ఋత్విక్కులూ దేవతలూ సంపూర్ణ శరీరాలతో ప్రకాశించారు దక్షుని మేషముఖుణ్ణిగా చేసేసరికి అతడు నిద్రనుండి మేల్కొన్నట్లు లేచాడు. తన కట్టెదుటనున్న శివుని చూడగానే రుద్రద్వేషంచేత కలుషితమైన అతని మనస్సు శరత్కాల మందలి సరోవరం లాగా నిర్మలమైంది శివుణ్ణి సన్నుతించడానికి యత్నించాడు. కాని, మృతి చెందిన తన కుమార్తె సతీదేవి స్మృతిపథంలో మెలగేసరికి దుఃఖం ఆపుకోలేక పోయాడు. కనులవెంట అశ్రుబిందువులు బొట బొట స్రవించాయి. కంఠం గద్గదమైంది. నోట మాటరాలేదు కాని, ఎలాగో దుఃఖం దిగమ్రింగి కుమార్తె యెడల గల ప్రేమాతిశయం చేత వికలచిత్తుడై యిలా అన్నాడు:

"నీవూ, నారాయణుడూ బ్రహ్మఘాతుకులను ఉపేక్షింపరు సృష్టి ఆరంభంలో వేద సంప్రదాయాలను పరిరక్షించడానికి విద్యాతపోవ్రత పరాయణులైన బ్రాహ్మణులను సృష్టించి దండం చేదాల్చి గోపాలకుడు గోవులను రక్షించినట్లు నీవు వారిని రక్షిస్తూ వుంటావు తత్త్వజ్ఞాన శూన్యుడనై సభాంతరంలో నిన్ను దూషించాను అయినా ఆ ద్వేషాన్ని విస్మరించి నన్ను అనుగ్ర

* యజ్ఞార్థం పిండితో చేయబడిన రొట్టె

హించావు. నేను నీకు ఏమి ప్రతికృతి చేయగలను?" అని ఈశ్వరుని సన్ను తించి బ్రహ్మచేత అనుజ్ఞాతుడై తిరిగీ యజ్ఞకార్యం నిర్వర్తించడానికి పూను కున్నాడు.

అపుడు యజ్ఞం నిర్విఘ్నంగా పరిసమాప్తమయ్యేందుకున్నూ, ప్రమథ గణ సంసర్గం వలన కలిగిన దోషం పరిహరింప బడేందుకున్నూ ఋత్విజులు విష్ణుదేవతాకమైన పురోడాశాన్ని సిద్ధంచేశారు దక్షుడు దాన్ని గ్రహించి అధ్వర్యుడైన భృగు మహర్షితోగూడి నారాయణ స్మరణపూర్వకంగా హోమం చేసేసరికి శ్రీహరి గరుడారూఢుడై అక్కడ సాక్షాత్కరించాడు

## దక్షాదులు శ్రీమన్నారాయణుని స్తుతించడం

ఆ దేవదేవుని శ్యామల శరీరకాంతులు నలుదిక్కులా ప్రసరిస్తున్నాయి. ఆయన ధరించిన బంగారు మొలనూలు కాంతి పీతాంబరచ్ఛాయను ఇనుమ డింప చేస్తోంది లక్ష్మీదేవికి స్థానభూతమైన ఆయన వక్షస్థలానికి వనమాల వన్నెకూరుస్తోంది ఆయన దాల్చిన స్వర్ణ మణిమయ విభూషణ కాంతులు సూర్యకాంతులను పరిహసిస్తున్నాయి. శంఖచక్రాద్యాయుధ కాంతులతోనూ, మణికంకణ ముద్రికాదుల ప్రభలతోను ఆయన బాహుచతుష్టయం దీప్తిమంతమై పుష్పించిన కొండ గోగులాగా ప్రకాశిస్తోంది ఆయన నెఱికురులు నీలమేఘపు కాంతిని తిరస్కరిస్తున్నాయి: దేవాంగనలు రాయంచల్లాంటి వింజామరాలను విసురుతున్నారు నిండు చందురుని వంటి సితాతపత్రం* పట్టుకొని కొందఱు వెంటవస్తున్నారు ఆయన దేహకాంతులముందు బ్రహ్మేంద్రాదుల కాంతులు వెల వెల బోతున్నాయి.

అలా యజ్ఞవాటికకు శ్రీహరి వచ్చేసరికి బ్రహ్మేంద్రాది దేవతలూ, శివుడూ మునులూ ఋత్విక్కులూ ససంభ్రమంగా లేచి నమస్కరించారు. ఆ జగన్నాయకుని మహాతేజం చూచి అందఱు భయాక్రాంతులయ్యారు. వారి నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి. ఎలాగో ధైర్యం తెచ్చుకొని గద్గద కంఠా లతో నిగ్రహానుగ్రహదక్షుడైన ఆయనను ఎవరికి తోచిన రీతిని వారు ఇలా స్తోత్రం చెయ్యడం మొదలుపెట్టారు

ముందుగా దక్షుడు యజ్ఞేశ్వరుడైన శ్రీహరిని స్తుతించాడు "నీవు స్వస్వరూపంలో ఉన్నప్పుడు మాయను తిరస్కరించి రాగాది ముక్తుడవై మాయను దరిజేరనీయకుండా అద్వితీయుడవై భేదరహితుడవై ఉంటావు. మాయను అనుసరించి లీలా మానుషరూపాలు ధరిస్తావు స్వతంత్రుడవై యుండిన్నీ




* తెల్లని గొడుగు

మాయకు వశుడవై రాగాదులు కలవాని వలె రామ కృష్ణాద్యవ తారాలలో గోచరిస్తావు. కనుక ఈ లోకాలన్నింటికి నీవే అధిపతివి. బ్రహ్మ, రుద్రుడూ నీ మాయ విభూతులగుట వలన వారు లోకేశ్వరులు కాదు విశ్వకారణులైన బ్రహ్మాదులూ సకల చరాచర జంతువులూ నీ రూపాలే నీకు వ్యతిరిక్తమైనది ఈలోకంలో ఏదీ లేదు. నన్ను కరుణించు" అని అర్థించాడు

అనంతరం ఋత్విక్కులు శ్రీహరికి ప్రాంజలించి "మహాత్మా! మేము నందీశ్వరుని శాపం వలన కర్మాసక్తులమై నీయదార్థ స్థితిని తెలిసి కోలేకుండా ఉన్నాము వేదప్రతిపాదితాలైన ధర్మాలు ఉపలక్ష్యంగా గల యజ్ఞాలు చేస్తూ వుంటాము ఆ యజ్ఞాల్లో ఇంద్రాది దేవతా రూపాలలో యజ్ఞేశ్వరుడవూ' నిర్మలుడవూ, అనవద్యమూర్తివీ అయిన నీవే వర్తిస్తూ వుంటావు. అలాంటి నీ తత్వ స్వరూపాన్ని అజ్ఞానవశం చేత మేము గ్రహించలేకుండా వున్నాము అని కీర్తించారు.

తర్వాత సదస్యులు అంజలి ఘటించి ప్రభూ మేము మూఢులము అడుగడుగునా ఎన్నో ఆపదలతో గూడిన సంసార మార్గంలో సంచరిస్తూ వుంటాము. ఆ దారిలో శోకమనెడి కార్చిచ్చు శరీరాన్ని దహిస్తూ వుంటుంది కష్టాలనే దుర్గమస్థానాలెన్నో తగులుతాయి మృత్యువనెడి క్రూరసర్పం వెంటబడి తరుముతూ వుంటుంది. పాపకర్మలనెడి పెద్దపులులు పొంచి వుంటాయి ఏక్కడ చూచినా ద్వంద్వాలనెడి గుంటలు వుంటాయి విశ్రాంతి నిచ్చే స్థావరం ఒకటీ కనబడదు విషయ వాసనలనెడి ఎండమావులు భ్రాంతి కలిగిస్తూ వుంటాయి అలాంటి దుర్గమ మార్గాన వర్తించెడి మాకు మీ పాద పద్మాల ఆశ్రయం ఎప్పుడు లభిస్తుందో? అని అర్థించారు

రుద్రుడంతట శ్రీహరి నుద్దేశించి వరదా! యోగి జన సంపూజితా నీ పాదాంబుజాలను నిరంతరం మనస్సులో నిలిపి నీ పరిపూర్ణ కటాక్షాన్ని ఆకాంక్షించెడి నన్ను మూఢులు అమంగళాచరుడని తిరస్కరించిన తిరస్కరింతురు గాక, నేనది లక్ష్యపెట్టను' అన్నాడు

తర్వాత భృగుమహర్షి, పద్మనాభా నీ మాయచే మోహితులై బ్రహ్మదులు కూడ నీ మహామహిమ నెఱుగలేరు నీ కృపాంగావలోకనాలతో భక్తుల ఆర్తిని పూర్తించెడి నీవు నాకు నిత్యానందాన్ని కల్పించి అనుగ్రహించు అని ప్రార్థించాడు

అపుడు బ్రహ్మ యిలా అన్నాడు: మహాత్మా నీ రూపం విలక్షణమైనది జ్ఞానానికి జ్ఞేయమైన ద్రవ్యానికి, సత్వాది గుణాలకూ నీవు ఆశ్రయభూతుడవు అలాంటి నిన్ను ఎదుటనున్న వస్తుభేదాన్ని గ్రహించెడి బాహ్య నేత్రాలతో పురుషుడు చూడలేడు అని ప్రశంసించాడు

అనంతరం ఇంద్రుడు శ్రీహరికి నమస్కరించి, 'దేవా! నీవు నీ ఎనిమిది చేతులతో నానా విధాలైన ఆయుధాలు ధరించి రాక్షస నాశం చేస్తుంటావు. నీ రూపం యోగి జనులకు మనోనందాన్ని కల్పిస్తుంది. అది శాశ్వతమైనది. విశాలమైన ఈ ప్రపంచం లాగా మిథ్యాభూతమైనది కాదు. అలాంటి నీ రూపాన్ని నేను నా మనస్సులో ధ్యానిస్తాను అన్నాడు.

ఆ పిమ్మట ఋత్విక్కులు అచ్యుతా నీచరణ కమలాలను సేవించడానికై దక్షుడు ప్రారంభించిన ఈ యజ్ఞం రుద్రుని క్రోధాగ్నికి భస్మీభూతమై శ్మశాన వాటికగా ఎలా మారిందో చూడు' అనగా, ఋషులు కమల గర్భునకు కై మోడ్చి దేవా! నీ చరిత్ర విచిత్రమైనది నీవున్నూ కర్మలను- చేస్తావు. కాని నీకు ఆ కర్మ ఫలంతో పనిలేదు. ప్రపంచంలో అందఱూ సంపదలాశించి లక్ష్మీదేవిని సేవిస్తారు అలాంటి లక్ష్మి నీ అనుగ్రహాన్ని కాంక్షించి తానై నీ దగ్గఱకు వస్తే నీవు గ్రహించవు అని ప్రశంసించారు.

అవల సిద్ధులు జగన్నాథుని దగ్గఱకు వచ్చి కృతాంజలులై, 'శ్రీహరీ! మామనస్సులనెడి మదపుటేనుగులు భవదుఃఖమనెడి దావాగ్ని తాపం భరించలేక నీ కథ యనెడి సుధానదిత్తులో ఓలలాడుతో ఆ తాపాన్ని తొలగించుకొని బ్రహ్మమును దర్శించిన ధీరుడు లాగా అందుండి తిరిగి రాకున్నవి అని ప్రస్తుతించారు

ఆ పిమ్మట దక్షపత్నియైన ప్రసూతి, రమాధిపా! మమ్మురక్షించు. ఋత్విక్కులెందఱున్నా నీవులేని యీ యజ్ఞం కరచరణాద్యవయవాదులన్నీ వున్నా శిరస్సులేని మొండెంలాగా కాంతి హీనంగా వుంది. ఇపుడు నీరాక మాకు శుభాస్పదం కాగలదు' అని సన్నుతించింది

అవల లోకపాలకులు యోగీశ్వరులు, శబ్దబ్రహ్మ, అగ్ని, దేవతలూ, గంధర్వులూ విద్యాధరులూ శ్రీహరి చరణ కమలాలకు ప్రణమిల్లి అనేకరీతుల కీర్తించారు.

తుట్టతుదకు బ్రాహ్మణులు పద్మలోచనునకు చేమోడ్చి, 'దేవా! నీవు యజ్ఞ స్వరూపుడవు. అగ్ని, ఋత్విక్కులూ, సదస్యులూ, దేవతలూ నీవే! యజ్ఞ సాధనాలైన సమిధలూ, దర్భలూ, పాత్రలూ, హవ్యం ఆజ్యం, సోమం మొదలైన సమస్త పరికర సంపత్తి నీ స్వరూపమే! పూర్వం నీవు వేదమయమైన సూకరావతారం ధరించి, మదగజం తన తుండాగ్రంతో తామర తీవను నీటినుండి ఉద్ధరించినట్లు దంష్ట్రాగ్రంతో రసాతల గతయైన భూదేవిని ఉద్ధరించావు నీ నామ సంకీర్తనం చేత సకల యజ్ఞాలూ నిర్విఘ్నంగా సమాప్తి నొందుతాయి అజ్ఞానవశంచేత పరిభ్రష్ట కర్ములమైన మమ్ము అనుగ్రహించు' అని ప్రార్థించారు

ఇలా అందఱూ నన్నుతించేసరికి శ్రీహరి ప్రసన్నుడై, శివుని వలన విధ్వస్తమైన దక్షయజ్ఞాన్ని ఏ కొఱతా లేకుండా నిర్విఘ్నంగా పరిసమాప్తం చేయించాడు. శ్రీహరి సకలాత్మకుడూ, సకల హవిర్భోక్తా అయినా తన భాగం మాత్రం గ్రహించి దక్షుని ఉద్దేశించి ఇలా అన్నాడు:

'అనఘా నేనూ బ్రహ్మ ఈశ్వరుడూ ఈ జగత్తులన్నింటికీ కారణ భూతులం అందునేను ఈశ్వరుడను సాక్షిమాత్రుడను. స్వయం ప్రకాశకు డను. గుణమయమైన స్వీయమాయలో ప్రవేశించి సృష్టిసంహార కార్యాలు నిర్వహించడానికి బ్రహ్మరుద్రాది నామధేయాలతో వ్యవహరింపబడుతూ వుంటాను కాని, మూఢుడైనవాడు బహ్మరుద్రాదులనూ అన్యభూతకోటినీ అద్వితీయ బ్రహ్మస్వరూపుడనైన నాకంటె వేఱుగా భావిస్తాడు. శరీరం వేఱూ, శరీరాంగాలైన కరచరణాదులు వేఱూ అని ఎవరైనా భావిస్తారా? అలాగే జ్ఞానియైనవాడు నాయందు భూతకోటిని వేఱుగా భావించడు. కనుక, మా ముగ్గురిని భేదభావంతో చూడనివాడు చరితార్థుడు కాగలడు అని చెప్పే సరికి,

దక్షుడు విష్ణుదేవతాకమైన త్రికపాలమనెడి ఇష్టిని గావించి శ్రీహరి పాద పద్మాలను పూజించాడు. అనంతరం అంగభూతాలైన యాగాలను కూడా చేసి దేవతలను, రుద్రుని అర్చించాడు. యాగపరిసమాప్తి అయ్యాక ఋత్విగాదులతో గూడి అవభృథ స్నానం చేశాడు అలాగా అభీష్ట ఫలసిద్ధి పొందిన దక్షుని దేవతలు, బ్రాహ్మణులు మునులు దీవించి స్వస్థలయాలకు వెళ్లారు.

యోగాగ్నిలో శరీరత్యాగం చేసిన సతీదేవి అనంతరం హిమవంతునకు మేనకయందు పుట్టి ప్రళయకాలంలో ప్రసుప్తయైన శక్తి సృష్టికాలంలో ఈశ్వరుని పొందునట్లు తన పూర్వపతియైన రుద్రుని వరించింది అని దక్షా ధ్వర విధ్వంసకుడైన రుద్రుని చరిత్రను బృహస్పతి తన శిష్యుడైన ఉద్ధవు నకు చెప్పాడు. ఉద్ధవుడు నాకు చెప్పాడు. ఆ కథను నేను నీకు చెప్పాను ఈ ఆఖ్యానం వింటే ఆయువూ కీర్తి లభిస్తాయి పాపాలు హరిస్తాయి' అని మైత్రేయుడు విదురునకు ఇంకా యిలా చెప్పడం మొదలు పెట్టాడు

"విదురుడా! విను. బ్రహ్మ కుమారుల్లో మరీచి మొదలైనవారు గృహస్థులయ్యారు కాని, సనకాదులు, నారదుడు, హంసుడు, అరుణి, ఋభుడు, యతి అనువారు గార్హస్థ్య ధర్మం పాటింపకుండా బ్రహ్మ నిష్ఠ లయ్యారు అంచేత వారి వంశాలు వృద్ధి చెందలేదు.

బ్రహ్మపుత్రుల్లో అధర్ముడనే వాడొకడున్నాడు. అతనికి మృషయనెడి భార్యయందు దంభుడను కొడుకూ మాయయను కూతురూ పుట్టారు అధర్మ

సంతానమైన వారిద్దరూ దంపతులయ్యారు. సంతానహీనుడైన నిర్ఋతి వారిని దగ్గఱకు తీసికొన్నాడు. ఆ దంపతులకు లోభుడను పుత్రుడు, నికృతి యను పుత్రిక జనించి, మిధునమయ్యారు. ఆ మిధునానికి క్రోధుడు అను కుమారుడు, హింస యను కుమార్తె కలిగి, వారున్నూ దంపతులయ్యారు. ఆ దంపతులకు కలియను కొడుకూ దురుక్తి యను కూతురూ పుట్టి, వారుకూడా దంపతులు కాగా, వారికి భయ మృత్యువులు జనించి అలాగే దాంపత్యభావం వహించారు ఆ దంపతులకు కలిగిన యాతన నిరయం అనువారు కూడా భార్యాభర్తలయ్యారు. వీరందఱు సంసారహేతువైన అధర్మ తరుశాఖలై వర్తిస్తారు. శ్రేయస్సును కోరేవాడెవ్వడూ వానిదఱిచేరడం భావ్యంకాదు. ఈ అధర్మాదుల సృష్టినే ప్రతి సర్గం అంటారు. "విదురా! ఇక స్వాయంభువుని వంశాన్ని వర్ణిస్తాను విను

## ధ్రువోపాఖ్యానం

అఖిలలోక పాలనం కోసం శ్రీహరి అంశంలో బ్రహ్మకు స్వాయంభువమనువు జన్మించాడు ఆ మనువునకు శతరూప వలన ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అను ఇద్దఱు కొడుకులు పుట్టారు ఉత్తాన పాదునకు సురుచి, సునీతి అను భార్య లిద్దఱున్నారు అతనికి సురుచివలన ఉత్తముడు సునీతి వలన ధ్రువుడు అనెడి ఇరువురు కొడుకులు పుట్టారు. ఆ రాజునకు సురుచిపై ఎక్కువ అనురాగం.

ఒకనాడు అతడు తనకు ప్రియురాలైన సురుచి కొడుకు ఉత్తముని తన తొడపై కూర్చుండబెట్టుకొని లాలిస్తున్నాడు అదే సమయంలో అక్కడకు ధ్రువుడు వచ్చి తండ్రి అంకసీమ నధిరోహించడానికి యత్నించాడు. కాని, తండ్రి అతని నిరాదరించేసరికి సురుచి గర్వాతిశయంతో ధ్రువుని చూచి, "ఓయీ నీకు తండ్రి తొడపై ఎక్కే అదృష్టమే వుంటే నా కడుపున పడేవాడివే అలాకాక అన్యగర్భమందు జనించిన నీకు ఆ భాగ్యం ఎలా కలుగుతుంది? నీ అభిలాష తీరాలంటే నేనో ఉపాయం చెపుతాను. విను. నీవుపోయి శ్రీహరిని గూర్చి తపస్సుచేయి ఆయన అనుగ్రహించి నిన్ను నా కడుపున పుట్టిస్తాడు. అపుడు నీకోర్కె తీరుతుంది అని అపహసిస్తూ మాట్లాడింది.

పినతల్లి తనతండ్రియెదుట పలికిన ఆ దుర్భాషలు వాడి ములుకుల్లాగా ధ్రువుని లేతమనస్సును గాయపరచాయి తండ్రికూడా ఏమీ అనకుండా తనను ఉపేక్షించేసరికి అతనికి దుఃఖం ముంచుకొని వచ్చింది. దండతాడిత సర్పంలాగా రోషా విష్టుడయ్యాడు ఏడుస్తూ తల్లిదగ్గఱకు మరలి వెళ్లాడు.

సునీతి అతణ్ణి కౌగిలించుకొని తొడపై కూర్చోబెట్టుకొని అనురాగంతో అతని ముఖం నిమిరింది. అంతఃపుర కాంతలవలన జరిగిన ఉదంతం అంతావిని నిట్టూర్చింది. కన్నీరు కారుతుండగా సవతి యాడిన మాటలను మాటి మాటికి తలపోస్తూ దుఃఖాబ్ధిలో మునిగిపోయింది. ధావాగ్ని శిఖలుసోకిన మాధవీలతికల గా ఆమె కాంతిని కోల్పోయింది కుమారుని చేరదీసి బుజ్జగిస్తూ ఇలా అన్నది:

'నాయనా! దుఃఖింపకు. పూర్వజన్మలో మనం చేసిన దుష్కృతం యొక్క ఫలితం మనలను వెంటాడుతున్నప్పుడు ఇతరులను నిందించి ప్రయోజనంలేదు. భర్త అనురాగానికి నోచుకొనని దుర్భగురాలను నేను. నాకడుపున పుట్టిన నీకు తండ్రి ఆదరం ఎలా లభిస్తుంది? ఆ సురుచి అన్నమాటలు నిజం నీకు నీ తండ్రి అంకం అధిరోహించాలనే అభిలాషవుంటే సర్వశరణ్యుడైన ఆ శ్రీహరి పాద పద్మాలను సేవించు

విశ్వపాలనం కోసం త్రిగుణాత్మకుడై వ్యక్తుడైన నారాయణుని చరణ సరోజాలను సేవించి బ్రహ్మ బ్రహ్మత్వం పొందాడు. మీ తాతస్వాయంభువ మనువు అభేద దృష్టితో యజ్ఞాలుచేసి భౌతిక సుఖాలూ దివ్యసుఖాలూ అనుభవించి మోక్షపదం పొందాడు యోగీంద్రులు కూడా ఆ శ్రీహరి పాద పద్మాల నాశ్రయిస్తారు కరతలమందు లీలా కమలాన్ని ధరించి లక్ష్మీదేవి కూడా ఆ పరమేశ్వరుని అన్వేషించి ఆయన దరి జేరుతుంది అలాంటి శ్రీహరిని నీవు ఏకాగ్రచిత్తంతో సేవించు నీ దుఃఖాన్ని తొలగించగలవాడు ఆ మహాత్ముడు తప్ప అన్యులెవ్వరూ లేరు — అని తల్లి హితోపదేశం చేసే సరికి ధ్రువుడు తన్ను తాను నిగ్రహించుకొని వెంటనే నగరం విడిచి వెళ్లాడు

## ధ్రువుడు నారదోపదేశం విని తపస్సు చేయడం

ఆ వృత్తాంతం తెలుసుకొని నారదుడు, 'అవమానం సహించని క్షత్రియుల ప్రభావం అద్భుతం కదా! పిన్నవయసువాడైనా పినతల్లి యాడిన దురుక్తులు సహింపలేక ధ్రువుడు నగరం విడిచిపోతున్నాడు ఔరా! ఎంతటి స్వాభిమాని!' అని భావించి ధ్రువుని కలుసుకొని, ధ్రువకుమారా! ఎక్కడికి ప్రయాణం? సకల సంపదలతో తులదూగెడి నిజమందిరం విడిచి యొంటిగా వెళ్తున్నావే. నీ స్వజనం నిన్నేదో అవమానించినట్లు భావిస్తున్నాను ఔనా?' అనేసరికి ధ్రువుడు ఔను నా సవతితల్లి వాగ్బాణాలచే కలిగిన గాయాన్ని భగవద్ధ్యాన యోగ రసాయనం చేత మాన్పుకోవడానికి వెళ్తున్నాను' అనగా, నారదర్షి అతనితో ఇలా అన్నాడు.

రాకుమారా! ఆటలాడుకొనే ఈ లేత వయస్సులో నీకు మానావమానాలేమిటి? ఒకవేళ నీకు మనస్సులో అలాంటి వివేకం కలిగినా, సంతుష్టచిత్తులైనవారెప్పుడూ స్వీయకర్మ పరిజ్ఞానంచేత సుఖదుఃఖాలను సమంగా భావించి అనుభవిస్తారు. కనుక వివేకం గలవాడు తనకు తటస్థించే కష్టసుఖాలను దైవకృతాలుగా భావించి సంతుష్టులౌతారు ఇక నీ తల్లి యాదేశానుసారం ఈశ్వరానుగ్రహం పొందడానికి వెళ్తున్నానంటావా? అయితే, విను. అది అంత సులభం కాదు.

యోగీంద్రులు కూడా అనేక జన్మల్లో నిస్సంగమైన మనస్సుతో సమాధి నిష్ఠలో వుండికూడా ఆ సర్వేశ్వరుని జాడ తెలిసికోలేరు. అతడు దురారాధ్యుడు కనుక నీ యత్నం నిష్ఫలం. ఆత్మశ్రేయం కోరదలచినవాడవైతే నీవు నీ తండ్రి యున్నంతవరకు దైవవశంచేత లభించెడి సుఖదుఃఖాలను సమభావంతో గ్రహింపక తప్పదు. అంతేకాదు, తనకంటే గుణాధికుడైనవానిని చూచి సంతోషించాలి తనకంటే గుణహీనుని చూచి కరుణించాలి. తనతో సమానుడైన వానితో స్నేహం పాటించాలి. అలా వర్తించేవానిని తాపత్రయాలు బాధించవు అని ఉపదేశించిన నారద మహర్షికి ధ్రువుడిలా అన్నాడు.

మునీంద్రా సుఖదుఃఖాలచే పరిభూతులైన వారికి మనశ్శాంతి దుర్గమం అని మీరంటున్నారు అయితే పరభయంకరమైన క్షాత్రధర్మాన్ని అవలంబించినవాడను, నేను అవమానాన్ని సహించి అణకువతో ఉండలేను. నా సవతితల్లి వాగ్బాణాలచే విచ్ఛిన్నమైన నాకు మనశ్శాంతి ఎలా ఉంటుంది? ముల్లోకాల్లో మహోత్కృష్టమై అన్యదుర్లభమైన స్థానం పొందాలని అభిలషించే నాకు సాధుమార్గమేదో మీరే ఉపదేశించండి బ్రహ్మ యూరువులనుండి జన్మించిన మహానుభావుడవు నీవు వీణావాదనం చేస్తూ లోకహితార్థం సూర్య భగవానుని లాగా లోకమంతటా వర్తిస్తూ వుంటావు' అని ధ్రువుడనేసరికి నారదమహర్షి యిలా అన్నాడు

కుమారా నిన్ను మోక్షమార్గానికి ప్రేరేపించినవాడు వాసుదేవుడు కనుక నీవు ఆ వాసుదేవునే సేవించు చతుర్విధ పురుషార్థాలనూ పొందాలని కాంక్షించేవానికి శ్రీహరి చరణయుగళ సేవనం తప్ప మరో మార్గంలేదు యమునానదీతీరాన గల మధువనం నీ తపశ్చర్యకు తగిన చోటు నీవు అక్కడకు వెళ్ళి ఆ పుణ్యనదీతోయాల్లో స్నానం చేసి, యమ నియమాదుల పాటిస్తూ శ్రీమన్నారాయణునకు నమస్కరించాలి

నీవు పిన్నవాడవు వేదాధ్యయనాది కర్మలకు అర్హుడవు కావు అయినా, ఉచితములైన దర్భలతోను, లేడి చర్మంతోను ఆసనం కల్పించుకొని రేచక

పూరక, కుంభకాలనెడి ముప్విధాలైన ప్రాణాయామంచేత మనస్సును నిశ్చలం చేసుకొని భగవద్ధ్యానం చెయ్యాలి. నీవు ఆరాధించదగిన ఆ భగవంతుని ఆకృతి యెలా వుంటుందో చెపుతాను విను.

'ఆయన ముఖం ప్రసన్నంగా వుంటుంది. కనులు కరుణారసార్ద్రాలై వుంటాయి. నాసిక మనోహరంగా వుంటుంది కనుబొమలు కమనీయంగా వుంటాయి. చెక్కిళ్ళు చక్కగా వుంటాయి ఆయన శరీరం ఇంద్రనీలమణిలా శ్యామలంగా వుంటుంది ఆయన వక్షస్థలం మీద శ్రీవత్సం ప్రకాశిస్తూ వుంటుంది నానావిధమణి భూషణాలతో నయనానందకరంగా వుంటాడు ఆయన కటిస్థలియందు కాచనమయమైన కాంచి* ముద్దులు కులుకుతూ వుంటుంది. కంఠమందు కౌస్తుభం నిగనిగలాడుతూ ఉంటుంది పాణితలమందు శంఖం, చక్రం, గద, పద్మం ప్రకాశిస్తూ వుంటాయి. నలుగడలా సుగంధాన్ని విరజిమ్మెడి వనమాల ధరిస్తాడు పీతాంబరధారియై, మణికాంచన నూపురాలతో ముచ్చటగా వుంటాడు. మణుల్లాంటి నఖ పంక్తులతో ఆయన చరణ కమలాలు భక్త జనుల హృదయ కమల కర్ణికారంలో నిష్ఠితాలై వుంటాయి అలాంటి భగవద్రూపాన్ని నీవు ఏకాగ్రచిత్తంతో ధ్యానం చెయ్యాలి. అలా కొంతకాలం ధ్యానిస్తే ఆ దివ్యమంగళ స్వరూపం నీ మనస్సులో స్థిరపడి పోతుంది. అపుడు నీవు నారాయణ మంత్రాన్ని జపించాలి.

ఓన్నమో భగవతే వాసుదేవాయ అను ద్వాదశాక్షరాలతో గూడిన ఆ మంత్రాన్ని ఏడురోజులు జపిస్తే దేవతా దర్శనం లభిస్తుంది దేశకాల విభాగం తెలుసుకొని వివిధ ద్రవ్యాలతో ఆ దేవదేవుని అర్చించాలి గఱిక మొనలు, తామర పువ్వులు, తులసీదళాలు వత్రి బూరుగు చెట్టు బెరడు, మాల్యాలు వన్యమూలాలు ఆ దేవేశులకు ప్రీతికరమైన ద్రవ్యాలు మట్టితో గాని, కొయ్యతోగాని శిలతోగాని ఆ వాసుదేవ మూర్తిని విరచించి పరిశుద్ధమైన స్థలంలో ఉంచి పూజించాలి. నియమ నిష్ఠలు పాటించాలి. మనోదార్ఢ్యం ఉండాలి. శాంతంగా ఉండాలి మితభాషియై యుండాలి మితాహారం తీసుకోవాలి. శ్రీహరి వివిధావతార చరిత్రలను హృదయంలో స్మరిస్తూ ధ్యానం చెయ్యాలి. వాసుదేవ మంత్రం జపిస్తూ అలా చేసిన పూజలన్నీ ఆ సర్వేశ్వరునికే సమర్పించాలి అలా త్రికరణ శుద్ధిగా శ్రీహరిని సేవిస్తే ఆ దేవదేవుడు అభిమతార్థాన్ని అనుగ్రహిస్తాడు అని నారదుడు ఉపదేశించే సరికి ధ్రువుడు మహానందంలో ఆ దేవర్షికి ప్రదక్షిణ పూర్వకంగా నమస్కరించి ఋషి జనసేవ్యమై భగవచ్చరణ సరోజాలంకృతమై, సకల సిద్ధి ప్రదాయకమైన మధువనానికి వెళ్ళాడు.

---

* మొలనూలు.

అనంతరం నారద మహర్షి ఉత్తానపాదుని దగ్గఱకు వెళ్ళగా ఆ రాజేంద్రుడా మహర్షిని యథోచితంగా పూజించాడు అపుడు నారదుడు, రాజా! నీవేదో విచారంగా ఉన్నట్లున్నావు ఎందుకు? అని ప్రశ్నించేసరికి, ఉత్తాన పాదుడు 'మునీంద్రా అయిదేళ్ళ వయసుగల నా ప్రియసుతుడు ధ్రువుని నేను అవమానించాను ఆతడు అలిగి తల్లితో అడవికి వెళ్ళాడు. అచట ఆకలిదప్పులతో అలమటిస్తూ పరిశ్రాంతుడై శోక సంసక్తుడైన ఆ బాలునకు ఆ మహారణ్యంలోని క్రూరజంతువుల వలన ఏమైనా హానికలిగి వుంటుందేమో అని నేను తపిస్తున్నాను. ఉత్తమ శ్లోకుడైన ఆ బాలుని అంగనాసక్తుడనై నా అంకమందు కూర్చుండ బెట్టుకోకుండా నిరాకరించి ఆతణ్ణి పరిభవించిన పరమ కిరాతకుణ్ణి నేను' అని పశ్చాత్తప్తుడై అనగా నారదర్షి ఈ రీతిగా అన్నారు :

'రాజా! నీవు నీ కుమారుని కోసం విచారించకు ఏ దేవదేవుని పాద పద్మాలను దేవతలు తమకిరీట రత్నకాంతులతో రంజింప చేస్తారో ఆ రాజీవ నేత్రుడే ఆ బాలుణ్ణి రక్షిస్తాడు అతడు ముల్లోకాల్లో అఖండ కీర్తి నార్జిస్తాడు అతని సచ్చరిత్రను అందఱూ ప్రశంసిస్తారు. అతని ప్రభావం నీకు తెలియదు అతడు తన సత్కర్మలతో త్రిలోకాల్లో ఎవ్వరికి లభ్యంకాని దివ్యపదాన్ని సాధిస్తాడు. అంతేకాదు, ఆతడు నీ కీర్తిని కూడా ఆకల్పాంతం ఉండేలా చేస్తాడు. అచిరకాలంలోనే తిరిగి వస్తాడు అతనికై శోకింపకు' అని నారదుడాడిన మాటలు విని ఉత్తానపాదుడు మనస్స్వాస్థ్యం చెంది, నిరంతరం ఆ ధ్రువ కుమారునే మాటి మాటికి చింతిస్తూ, రాజకార్యాల్లో విరక్తుడై కాలం గడుపుతున్నాడు

నారదుని వీడ్కొని అలా చనిన ధ్రువుడు వెళ్ళి వెళ్ళి మహర్షి జన సేవితమై పరమ పావనమైన మధువనం చేరాడు యమునా నదిలో స్నానమాడి నియతుడై, మనో నిగ్రహంతో శ్రీహరిని ధ్యానించడం మొదలు పెట్టాడు

## ధ్రువుని తపశ్చర్య

మూడేసి రోజులకు ఒక పర్యాయం వెలగపండ్లను రేగుపండ్లను ఆహారంగా తీసుకుంటూ ఒక మాసం శ్రీహరిని ఆరాధించాడు అనంతరం ఆరేసి దినాలకొక పర్యాయం జీర్ణపర్ణాలు భుజిస్తూ, శ్రీ వాసుదేవుని ధ్యానంలో రెండవ మాసం గడిపాడు అపైన తొమ్మిది రాత్రుల కొకసారి జలభక్షణం చేస్తూ మూడో మాసంలో ముకుందుని సేవించాడు. పిమ్మట పన్నెండు రోజుల కొక పర్యాయం వాయుభక్షణం చేస్తూ శ్వాసను జయించి, నాల్గవ

మాసంలో నలినదళాక్షుని అర్చించాడు. అంతటినుంచి ఉచ్ఛ్వాసాన్ని నిరోధించి, ఒంటికాలిపై నిలబడి అచేతనమైన స్థాణువులాగా అయిదో నెల గడిపాడు.

సకల భూతేంద్రియాలకు ఆధారమైన హృదయంలో విషయ వాసనలు చొరనీయకుండా మహత్తు మొదలైన తత్వాలకు ఆశ్రయ భూతమైన శాశ్వత బ్రహ్మమును హృదయ పద్మంలో నిలిపి, శ్రీహరి రూపంతప్ప అన్యమైన మఱో ఏ రూపాన్నీ ఎఱుగక చిత్తాన్ని హరి పరాయత్తం చేసి ధ్రువుడు చేసిన మహోగ్ర తపస్సునకు ముల్లోకాలూ కంపించిపోయాయి ఒంటికాలిపై నిలబడి అతడు తపస్సు చేసేటప్పుడు ఆ కాలి బొటనవ్రేలి ఒత్తిడి సహింపలేక మత్త గజాధిష్ఠితమై మాటిమాటికి అటూనిటూ నొరగెడి సముద్రస్థిత నౌకలాగ భూమి కుడినుండి యెడమకూ, ఎడమనుండి కుడికీ ఉందుండి ఒరిగిపోవడం మొదలు పెట్టింది

ధ్రువుడారీతిగా అన్యదృష్టి లేకుండా తన ప్రాణాన్ని నియమించి శ్రీహరియందు ఏకాగ్ర చిత్తంతో మగ్నుఁ య్యేసరికి ఆ ఈశ్వరుడు కూడా చలించిపోయాడు. ఈశ్వరుడు చలించగానే లోకాలన్నీ చలించిపోయాయి. భయంకరమైన ఆ మహావిపద్దశకు లోకపాలకులందఱు కంపించిపోయి శ్రీహరిని దర్శించి కృతాంజలులై, 'దేవా! నీవు సకలభూత శరీరధారివి ఇలాగా పూర్వం మేమెప్పుడూ ప్రాణనిరోధం ఎఱుగము ఉచ్ఛ్వాస నిశ్వాసాలు నిలిచిపోవడంవలన మేము ఎంతో బాధపడుతున్నాము. దీనికి హేతువేమిటి' అని దీనంగా అర్థించేసరికి శ్రీహరి యిలా అన్నాడు

ఉత్తానపాదుడను రాజు కొడుకు ధ్రువుడు విశ్వరూపుడనైన నా యందు తన చిత్తాన్ని ఐక్యం చేసి మహోగ్రమైన తపస్సు చేస్తున్నాడు ఆ కారణంచేత మీకు ప్రాణనిరోధం కలిగింది దారుణమైన అతని తపస్సును నేను నివర్తింప జేస్తాను. భయపడకండి, వెళ్ళండి' అని శ్రీహరి ఆజ్ఞాపించే సరికి వారందఱూ స్వస్వ నిలయాలకు వెళ్ళిపోయారు.

అనంతరం శ్రీహరి గరుడారూఢుడై తన భృత్యుడైన ధ్రువుని చూడాలనే కోర్కెతో మధువనానికి వెళ్లాడు అపుడు ధ్రువుడు యోగపరిపాకంచే తీవ్రమైన బుద్ధి కలవాడై తన హృదయపద్మంలో ఒక్కమాఱు మెఱుపుదీవ లాగ మెఱసి వెంటనే అంతర్ధానం చెంది తన యెదుట నిలిచియున్న శ్రీమన్నారాయణుని చూచి సంభ్రమపాటులో పులకించిపోయాడు ఆనందాశ్రువులు రాల్చాడు.

తన కనుగవలో ఆ దేవదేవుని మూర్తిని ఆస్వాదిస్తున్నట్లూ ముఖంతో చుంబనం చేస్తున్నట్లూ, భుజాలతో కౌగిలించుకొన్నట్లూ తనలో ఎంతో ఆనందాన్ని అనుభవిస్తూ ఆయనకు సాష్టాంగదండ ప్రణామాలు చేశాడు. కృతాం

జలియై ఆయనను సన్నుతించాలని భావించాడు కాని ఎలా స్తుతించాలో తెలియక విషణ్ణుడై యున్న ఆ పసిబాలుని మనోగతాన్ని గ్రహించి, సమస్త-భూతాంతర్యామియైన శ్రీహరి వేదమయమైన తన శంఖాన్ని ఆ బాలకుని చెక్కిలికి తాకించాడు

వెంటనే ధ్రువునకు భగవత్స్తుతి పాదకములూ వేదాత్మకములూ అయిన వాక్కులు లభించాయి. అపుడు ధ్రువుడు మహానందంతో శ్రీహరిని ఇలా సన్నుతించడం మొదలుపెట్టాడు:

## ధ్రువుడు శ్రీహరిని స్తుతించడం

'దేవా నీవు సకల శక్తివంతుడవు సర్వాంతర్యామివి. నీవు నాలో అడిగియున్న నా వాక్కులకూ కర్మేంద్రియాలకూ, జ్ఞానేంద్రియాలకూ నీ చిచ్ఛక్తిచే జీవం పోశావు నీకు నా నమస్కారాలు నీవు ఒక్కరుడవయ్యుం డిన్నీ మాయయనెడి ఆత్మీయశక్తిచే ఈ అఖిల విశ్వాన్ని సృజించి, దానికి చైతన్యం ఆపాదింప జేయడానికి అందులో ప్రవేశించి నానావిధాలైన దారువులందు అగ్నిలాగా ప్రకాశిస్తూ వుంటావు.

బ్రహ్మదేవుడు మొదట విశ్వాన్ని సృజింపదగిన శక్తిలేక నిన్ను ఆశ్రయించేసరికి నీవాతనికి ఆ పరిజ్ఞానం కల్పించావు. అపుడతడు నిద్రనుండి మేల్కొన్నవాడులాగ ప్రబోధం చెంది సమస్త ప్రపంచాన్ని సృష్టించాడు. అలాంటి నీ చరణ సరోజాలను కృతజ్ఞుడైన వాడెవ్వడు స్మరించకుండా వుంటాడు?

మహానుభావా, నీవు జననమరణ హేతుభూతుడవు కల్పవృక్షంవంటి వాడవు మోక్షప్రదాతవు అయినా నీ మాయామోహితులై ఎవరైనా నిన్ను దేహోపభోగ్యాలైన భౌతిక సుఖాలకోసం అర్థిస్తే, వారికి అలాంటి సుఖాలను నరకంలోకూడా అనుగ్రహిస్తావు పద్మనాభా! నీ చరణకమలధ్యానం వల్లనూ, నీ చరిత్రాకర్ణనం వల్లనూ లభించెడి సుఖాలు వాస్తవంగా మోక్షసుఖం కంటే-కూడా అతిశయమైనవి లిలాంటప్పుడు కర్మానుభవానంతరం యమభటులచే భగ్నములైన విమానములనుండి జారిపడెడి సురలోకవాసుల యాధిక్యత యేముంది?

నిరంతరం నియమనిష్ఠలతో నిన్ను సేవిస్తూ నీతో సమానులైన సత్పురుషుల సాంగత్యంతో వ్యసన దుర్భరమైన ఈ సంసార సాగరాన్ని తరిస్తాను. నీ చరణకమల సుగంధాన్ని తనివిదీరా ఆస్వాదించెడి ధన్యాత్ముల చెలిమి లభించినవారు తమ శరీరాన్నీ, దారసుతాది సుహృద్బంధువర్గాన్నీ విస్మరిస్తారు.

ప్రభూ! సకల చరాచరాత్మకమై మహదాది కారణమైన నీ విరాడ్రూపాన్ని నే నెఱుగున్నాను కాని, మంగళప్రదమూ మహిమైశ్వర్యరూపమూ శబ్దాది వ్యాపారశూన్యమూ అయిన నీ బ్రహ్మస్వరూపాన్ని మాత్రం ఎఱుగను. కల్పాంత సమయంలో ఈ అఖిల ప్రపంచాన్ని హరించి శేషశయ్యపై యోగనిద్రాసక్తుడవై, సముద్రంలాంటి నీ నాభికుహరంనుంచి వెలువడి కాంచనమయమూ, లోకాత్మకమూ అయిన కమల కర్ణికయందు పునస్సృష్టికి బ్రహ్మను పుట్టించిన నీకు నా ప్రణామాలు!

దేవా! నీవలా యోగనిద్రావశుడవై యున్నా జీవులకంటే విలక్షణుడవై వుంటావు బుద్ధి స్థితి భేదంచేత అఖండితమైనది నీ శక్తి అలాంటి నీవు నీ స్వశక్తిచే లోకపాలన నిమిత్తం యజ్ఞాధిష్ఠాత వౌతావు నీవు నిత్యవిముక్తుడవు పరిశుద్ధుడవు సర్వజ్ఞుడవు. ఆదిపూరుషుడవు. భగవంతుడవు గుణత్రయానికి అధిపతివి. భాగ్యహీనుడైన జీవుని యందు నీ యీ దివ్యగుణాలుండవు. విరుద్ధగతులై వివిధ శక్తి సంపన్నాలైన అవిద్యాదులు ఒక క్రమాన్ని అనుసరించి నీయందు లీనమైపోతాయి

'నీవు విశ్వకారణుడవు. అపరిచ్ఛేద్యుడవు1. అద్వితీయుడవు ఆనందమయుడవు అవికారుడవు. బ్రహ్మ స్వరూపుడవు అలాంటి నీకు నా ప్రణామాలు. సకల విధ కర్మలకు ఫలము నీవేయని విశ్వసించెడి నిష్కాములకు రాజ్యాది కామితాల్లో పరమార్థమైన ఫలంకూడా సర్వార్థ స్వరూపుడవైన నీ పాదపద్మాల సేవనమే అది నిశ్చితం నిష్కాములం కాకుండా సకాములమై తుచ్ఛఫలాన్ని ఆశించి నిన్ను సేవించే నావంటి దీనులను కూడా ప్రేమిస్తావు గోవు తన దూడకు స్తన్యమిచ్చి వన్యమృగాలనుండి రక్షించునట్లు నీవు మాకోరికలు తీర్చి సంసార భయంనుండి మమ్మల్ని రక్షిస్తావు'

ధ్రువుడులా స్తుతించేసరికి దాసానురక్తుడైన భగవంతుడు సంతుష్టుడై ఈ విధంగా అన్నాడు:

'రాకుమారా! నీ మనోగతం నాకు తెలుసు అసాధ్యమైనదైనా నేను నీకు అది అనుగ్రహిస్తాను. కట్టుకొయ్యచుట్టూ గోసమూహంలాగా గ్రహనక్షత్ర తారాగణ జ్యోతిశ్చక్రమూ, నక్షత్ర రూపంతో ధర్మాగ్ని కశ్యపశుక్రులూ, సప్తర్షులూ దేనిని ప్రదక్షిణం చేస్తూ వుంటారో అలాంటి మహోన్నతమైన ధ్రువక్షితియనెడి పదంనీకు ఇక ఇఱువది యాఱువేలేండ్లతర్వాత ప్రాప్తిస్తుంది. అలాంటి దివ్యపదం ఇంకెవ్వరికీ లభించదు ప్రళయ సమయంలో కూడా అది నశించదు నీకా పదవి ప్రాప్తించే దాకా నీ తండ్రి వనవాసం చేస్తాడు. నీవు

1. భేదింపనలవి కాని వాడవు.

రాజ్యపాలనం చేస్తావు నీ అనుజుడు ఉత్తముడు వేటకై అడవికి వెళ్ళి మృతుడౌతాడు అతణ్ణి అన్వేషిస్తూ పోయి అతని తల్లి కార్చిచ్చులో దగ్ధమైపోతుంది. నీవు అనేక యాగాలుచేసి యజ్ఞ స్వరూపుడనైన నన్ను అర్చించి, సకల భౌతిక సౌఖ్యాలూ అనుభవిస్తావు. అంత్యకాలంలో నీవు నన్ను నీ ఆత్మలో సంస్మరిస్తూ, సర్వలోక సమున్నతమూ, పునరావృత్తి రహితమూ సప్తర్షి మండలోన్నతమూ అయిన నా పదం పొందుతావు' అని పలికి గరుడారూఢుడై శ్రీహరి నిజలోకానికి వెళ్ళిపోయాడు

కాని శ్రీహరి చరణసేవనం వలన తన మనోరథం సిద్ధించినా ధ్రువునకు మనస్సంతుష్టి కలగలేదు తన పినతల్లి ఆడిన దుర్భాషలు అతని మనస్సులో గాఢంగా నాటుకుపోవడం చేత, వాటినే తలపోస్తూ, 'తుచ్ఛమైన ఐహిక సుఖాన్ని కోరానే మోక్షం కోరనైతినే అని పరితాపం చెంది, తన మనస్సులో ఈ రీతిగా వితర్కించడం మొదలుపెట్టాడు

'అయ్యో నేనెంత తెలివి తక్కువవాడను? అనేక జన్మల్లో ఆర్జించిన సమాధి యోగంచేత జితేంద్రియులైన సనందాదులు ఏ దేవదేవుని చరణారవింద దర్శనానికి నోచుకున్నారో ఆ శ్రీహరి పాదపద్మచ్ఛాయ నాకు కేవలం ఆఱుమాసాల తపఃఫలితంగా లభించింది కాని ఏం ప్రయోజనం? దురదృష్టవంతుడను. భేద దృష్టితో భవనాశకుడైన ఆ మహాభావుని దర్శించీ కూడా నశ్వరాలైన కామ్యాలను అడిగాను ఇంతకంటే దౌరాత్మ్యం ఏముంటుంది'

భగవంతుడు నాకు మహోన్నత పదం అనుగ్రహించాడు నిజమే. కాని తమ కంటే ఉన్నతపదం లభించిందని నన్ను చూచి దేవతలు కన్నెఱ్ఱ చేయవచ్చు. ఆనాడు నారదుడాడిన మాటలు నిజమయ్యాయి. నేనా మహర్షి మాట లంగీకరించకుండా, జ్ఞానహీనుడు స్వప్నావస్థలో దైవికమైన మాయచేత భిన్నదర్శనుడైనట్లు బ్రహ్మాత్మకం కాని మఱోవస్తువు లేకపోయినా నా అనుజుడు నాకు శత్రువని భేద బుద్ధితో దుఃఖపడి జగదాత్మకుడైన ఈశ్వరుణ్ణి ఆరాధించాను. ఆ దేవదేవుని అనుగ్రహానికి పాత్రుడనయ్యాను కాని ఏం ప్రయోజనం? ఆయువులేని వానికి ప్రయోగించిన ఔషధాల్లాగా నిరర్థకాలైన భౌతిక సుఖాలను కోరాను నిరుపేదయైనవాడు నృపేంద్రుని చేరి యోగ్యవస్తువు నేదైనా కోరక చేరెడు నూకలడిగినట్లు మోక్షప్రదాతయైన పరమాత్మను నేను సాంసారికాలైన సుఖాలను అర్థించాను నాకంటే మూర్ఖుడెవడుంటాడు?

# ధ్రువుడు తిరిగి ఇంటికి వచ్చుట

అని ధ్రువుడు నిజపురాభిముఖంగా బయలుదేరాడు ఈ వార్త తెలిసిన కొందఱు రాజేంద్రుడైన ఉత్తానపాదునకు విన్నవించేసరికి అతడు విస్మితుడై 'ఏమీ! నా కుమారుడు తిరిగివస్తున్నాడా? అతిదెన్నడో ఏ వన్యమృగాలపాలో అయివుంటాడు. చచ్చినవాడు ఎన్నడైనా బ్రతికి వస్తాడా? నా కంతటి అదృష్టం కూడానా? అని భావించి ఆ వార్త తెచ్చిన వారిని యథోచితంగా సత్కరించాడు

అనంతరం ఉత్తమాశ్వాలు పూన్చిన రథం అధిరోహించి ధ్రువునకు ఎదురు వెళ్లాడు అతనివెంట సకలభూషణ భూషితులైన సునీతి, సురుచి, ఉత్తముడు కూడా శిబికలెక్కి బయలుదేరారు వారిని బ్రాహ్మణులు, కుల వృద్ధులు, బాంధవులు అమాత్యులు కూడా అనుగమించారు వేదఘోషలు, తూర్యనినాదాలు మిన్ను ముట్టగా ఉత్తానపాదుడు వెళ్ళి నగరోపవన సమీపంలో ధ్రువుణ్ణి చూచాడు

అతని శరీరం పులకించి పోయింది వెంటనే రథం దిగి, శ్రీహరి చరణారవిందాలనర్చించి పాపదూరుడై కామితార్థాన్ని పొందివచ్చిన ధ్రువుణ్ని గాఢంగా కౌగలించుకున్నాడు ఆనంద బాష్పాలు కారుస్తూ అతని శిరస్సు మూర్కొన్నాడు వాత్సల్యంతో చుబుకం[1] నిమిరాడు. ఆశీస్సులు కురిపించాడు

ధ్రువుడున్నూ మహానందంతో తండ్రి పాదాలపై వ్రాలాడు. అనంతరం తల్లులకు మ్రొక్కాడు అలా తనకు మ్రొక్కిన ధ్రువుని సురుచి గుచ్చి యెత్తుకుని ముద్దులాడింది గద్గద కంఠంతో ఆశీర్వదించింది. పల్లానికి నీరు చేరునట్లుగా అందఱూ శ్రీహరి అనుగ్రహానికి పాత్రుడైన వానిని చేరి ఆదరిస్తారు. అందుచేతనే గతంమరచి, సురుచి ధ్రువుణ్ణి ప్రేమార్ద్ర హృదయంతో దగ్గరకు తీసుకొంది ఉత్తముడూ, ధ్రువుడూ ఆనందాశ్రువులు స్రవించగా ఒకరినొకరు గట్టిగా కౌగలించుకొన్నారు.

ఇక సునీతి సంతోషానికి పట్టపగ్గాలు లేవు. సంతోషాతిశయంతో ఆమె శరీరం పులకరించింది అతణ్ణి తన బొమ్మునకు గట్టిగా హత్తుకొన్నది. పుత్రవాత్సల్యంతో ఆమె పాలిండ్లు పొంగి చనుబాలు కురిశాయి.

---

1 చిబుకం, గడ్డం.

పౌరజనం ధ్రువుని దర్శించి పరవశించిపోయారు. సునీతిని గాంచి, తల్లీ నీవు పూర్వజన్మలో ఎంతటి భాగ్యానికి నోచుకున్నావో? ఘోరారణ్యంలో ఘాతుక మృగాల పాలబడి విగత జీవుడయ్యుంటాడని భావించిన నీ బిడ్డ పరమేశ్వరానుగ్రహం పొంది సురక్షితంగా వచ్చాడు. నీ అదృష్టమే అదృష్టం ' అని నన్నుతించారు

అలా అందరూ ఉపలాలిస్తుండగా ఉత్తానపాదుడు తన కొడుకు బిడ్డతని గజారూఢుల్ని చేసి నిజ నగరానికి తిరిగి వచ్చారు నగరం నానా విధాలంకారాలతో కనుల పండువుగా వుంది. ద్వారాలూ గోపురాలూ బురుజులూ బంగారు పూతలతో మిలుమిట్లు గొల్పుతున్నాయి వీధులు సుగంధ జలాల కలయంపిచే గుబాళిస్తున్నాయి నవరత్నాలతో తీర్చిన రంగవల్లికలు నేత్రానందంగా వున్నాయి

రాజమార్గానికి ఇరువైపులా మేడల పైనుండి పౌరకాంతలు కరకంకణ ధ్వనులు అతిశయిస్తుండగా రాజునూ రాణివాసాన్నీ రాకుమారులనూ దీవిస్తూ వారిమీద పూవులూ లాజలూ* కురిపించారు నీరాజనాలు పట్టారు

అలా వెళ్ళి వెళ్ళి సకల వైభవాలతో తులతూగుతూ స్వర్గతుల్యమైన నిజ నగరంలో ప్రవేశించి ఉత్తానపాదుడు అనంతరం అచిరకాలంలోనే ధ్రువునకు రాజ్యాభిషేకం చేసి విరక్తుడై తాను తపశ్చర్యకై అరణ్యాలకు వెళ్ళాడు

అనంతరం ధ్రువుడు ప్రజాను రంజకంగా రాజ్యపాలనం చేస్తూ శింశుమార ప్రజాపతి కూతురు భ్రమియను నామెను వివాహమాడి ఆమె వలన కల్పుడు వత్సరుడు అను ఇద్దరు కొడుకులను పొందాడు అలాగే వాయుపుత్రిక యైన ఇల యను లతాంగిని కూడా పరిణయమాడి ఆమె యందు ఉత్కలుడనే కొడుకునూ, అత్యంత సౌందర్యవతి యైన ఒక కుమార్తెనూ కన్నాడు.

అతని సోదరుడు ఉత్తముడు అవివాహితుడుగానే వుండి ఒకనాడు వేటకై హిమవన్నగానికి వెళ్ళగా అక్కడ అతనినొక యక్షుడు వధించాడు. ఆ ఘోరవార్త విని అతని తల్లి సురుచి శోకాకులయై అడవుల బడి పోతూ దావాగ్నిలో దగుల్కొని మృతి చెందింది

పేలాలు

# ధ్రువుడు యక్షులతో యుద్ధం చెయ్యడం

తమ్ముని మరణవార్త విని ధ్రువుడు తపించి పోయాడు. వెంటనే రథారూఢుడై వెళ్ళి మంచుకొండ కనుమల నడుమనున్న అలకా నగరం చేరాడు. అది యక్షుల నిలయం అక్కడకు వెళ్ళి వెళ్ళగానే ధ్రువుడు దిక్కులు దద్దరిల్లేలా మహోగ్రమైన శంఖం పూరించాడు ఆ భీకరధ్వని విని యక్ష కాంతలు గజగజలాడి పోయారు యక్షులు రణోత్సాహంతో నగరం వెడలివచ్చి ధ్రువుని ఎదిరించారు.

అలా ఒక్కపెట్టున తన నెదిర్చిన పదమూడు వేల యక్ష వీరులపై మహా పరాక్రమశాలియైన ధ్రువుడు మూడేసి నిశిత బాణాలు ప్రయోగించే సరికి వారు జర్జరితాంగులై సోలి తూలి పడిపోయారు వెంటనే తేరుకుని అతని పరాక్రమాన్ని, కరలాఘవాన్ని ప్రస్తుతిస్తూ తొక్కత్రొక్కిన త్రాచుల్లాగా క్రోధోద్ధతులై అతణ్ణి ముట్టుముట్టి, అతని నానావిధ శస్త్రాస్త్రాలతో ముంచెత్తారు.

అప్పుడు ధ్రువుడు నిరంతర వర్షధారలచే కప్పబడిన మహాపర్వతం లాగ గోచరించాడు. ఖేచరులు హాహాకారాలు చేస్తూ 'అయ్యో ధ్రువుడనేడి సూర్యుడు యక్షసైన్యమను సముద్రంలో క్రుంకిపోయాడే ఔరా ఎంత ఘోరం' అని విలపించడం మొదలు పెట్టారు యక్షులు విజయగర్వంతో హర్షధ్వనులు చెయ్యడం మొదలు పెట్టారు ఇంతలో ధ్రువుడు మంచు తెరలను చీల్చుకుని ప్రచండమైన కాంతులను విరజిమ్ముతూ వెల్వడేడి సూర్యునిలాగ తిరిగి గోచరించి, ధనుష్టంకారం చేశాడు. వాడి బాణాలను పుంఖాను పుంఖంగా వారిపై కురిపించాడు సుడిగాలికి మేఘాలు చెల్లా చెదరైనట్లు యక్షవీరులు ధ్రువుని బాణాహతులకు వికలాంగులై ఎందరో నేలపై కొరిగారు.

ఖండిత దేహులై అలా నేలగరచిన యక్షుల కిరీట కుండల విరాజితాలైన శిరస్సులతోనూ, మణి కంకణాంగదాలతో అలంకృతాలైన భుజదండాల తోనూ, రణభూమి ఎంతో రమణీయంగా వుంది. ఇక హతశేషులైన వారు. ధ్రువుని ధాకకు నిల్వలేక, సింహాన్ని చూచి భయక్రాంతులైన మదగజాల్లాగ తలకొక దారిని బట్టి పారిపోయారు. యుద్ధరంగంలో ధ్రువునితో పోరాడడం సాధ్యంకాదని భావించి యక్షులు మాయావులు కనుక, అదృశ్యులై అతణ్ణి మాయాజాలంతో వంచించడానికి పూనుకున్నారు.

అపుడు సముద్ర ఘోషలాంటి మహాధ్వని వినిపించింది. పెనుగాలికి రేగిన ధూళి పటలం దిక్కులను క్రమ్మివేసింది మెఱుపు తీగలతో గూడిన మేఘ సమూహం ఆకాశాన్ని ఆవరించింది. అపుడు ధ్రువునిపై రక్త మాంసాలూ, మూత్ర పురీషాలూ, నానా విధాలైన ఆయుధాలూ వర్షించడం మొదలు పెట్టాయి ఆతని కట్టెదుట మదించిన యేన్గులూ సింహాలూ మొదలైన క్రూర మృగాలూ, ఉత్తుంగ తరంగాలతో భయంకరమైన సముద్రం గోచరించాయి ప్రళయ సమయంలో లాగ ఒక మహాహ్రదం[1] కనబడ్డది.

ఈ రీతిగా యక్షులు అనేక మాయలు కల్పించగా, మునిజనం ధ్రువుని రక్షించు తలపుతో ఆతని దగ్గఱకు వచ్చి రాకుమారా! చింతించకు ఎవని దివ్యనామం స్మరించి మానవులు మృత్యువును సైతం జయించ గలుగుతారో ఆ దేవదేవుడు, శ్రీమన్నారాయణుడు నీ శత్రువర్గాన్ని పరిమార్చ గలడు అనేసరికి ధ్రువుడు ఆచమించి శ్రీహరిని స్మరించి మహోగ్రమైన నారాయణాస్త్రాన్ని వింట సంధించేసరికి, స్వచ్ఛమైన వివేకోదయం చేత రాగాదులు విడిపోవునట్లుగా అసుర మాయ యనెడి చీకట్లు ఇట్టే తొలగిపోయాయి.

ధ్రువుడు అలా నారాయణాస్త్రాన్ని ప్రయోగించేసరికి ఆ అస్త్ర ప్రభావం చేత స్వర్ణపుంఖాలూ[2] కలహంసల్లాంటి తెల్లని పక్షాలూ[3] గల వేలకొలది నిశిత బాణాలు జనించి పెట పెట మని భీకరంగా ధ్వనిస్తూ అడవిని ప్రవేశించెడి దావాగ్ని శిఖల్లాగ అతని శత్రుసైన్యాన్ని తాకాయి.

ఆ బాణా హతులకు వికలాంగులైన యక్షులు క్రుద్ధులై, నానా విధాలైన ఆయుధాలను గహించి, సర్పాలు పడగలెత్తి గరుత్మంతునిపై గవిసినట్లు ధ్రువుని చుట్టుముట్టేసరికి అతడు మహోగ్రుడై, తీక్షణ బాణ పరంపరతో వారి అవయవాలను ఖండించి, రూపుమాపి, ఊర్ధ్వ రేతస్కులైన యోగులకు సూర్యమండలాంతర గమ్యమైన ఉత్తమ లోకానికి పంపించాడు

## మనువు ధ్రువుని యుద్ధ విముఖుని చెయ్యడం

అలా ధ్రువుని చేత నిహతులైన యక్షులను జూచి అతని పితామహుడైన స్వాయంభువ మనువు ఋషిగణంతో అక్కడకు వచ్చి ధ్రువుని చూచి, వత్సా! రోషం నరక హేతువు. ఎవడో ఒక యక్షుడు నీ సోదరుని వధించా

1 మడుగు 2 క్రింది మొనలు. 3 ఈకలు

దని అలుకతో నిరపరాధులైన యింతమంది పుణ్యజనులను[1] వధించడం మను వంశ సంభవుడవైన నీకు తగదు

'అదీగాక, దేహాభిమానంతో ప్రాణహింస చెయ్యడం పశుకృత్యం ఈశ్వరానువర్తులయిన సాధువుల కది కూడనిపని. సర్వభూతాలనూ ఆత్మ భావంతో చూచి శ్రీహరి చరణకమలాలను సేవించి, ఆ దేవదేవుని అనుగ్రహా నికి పాత్రుడవైన ప్రజ్ఞావంతుడవు అలాంటి నీవు పాపకృత్యానికి పాల్పడడం హేయం. మహాత్ములయందు తితిక్ష[2], సములయందు మైత్రి, హీనుల యందు కృప ఇతర సమస్త ప్రాణులయందు సమభావం గలవానికే భగవంతుడు ప్రసన్నుడవుతాడు అతని అనుగ్రహానికి పాత్రుడైనవాడు ప్రకృతి గుణాలను అతిక్రమించి స్థూలశరీరాన్ని త్యజించి బ్రహ్మానందం చెందుతాడు

అయస్కాంతం[3] ముందు లోహం చలించినట్లు కార్యకారణరూపమైన విశ్వం, సమస్తానికి నిమిత్తమాత్రుడైనట్టి పరమేశ్వరుని సాన్నిధ్యంలో పరి భ్రమిస్తూ వుంటుంది ఈశ్వరుని మాయాగుణముల కలయికచే కల్పింపబడిన పంచభూతాల వలన స్త్రీ పురుషాది రూపసృష్టి జరిగి పెరిగి, తుదకు లయం అవుతుంది. భావింప నలవికాని కాలశక్తిచేత గుణక్షోభం జరిగి, అందువలన భగవంతుని వీర్యం[4] విభక్తం కాగా జీవులనుండియే జీవకోటి ఉత్పన్నమవు తుంది. అయినా ఈశ్వరుడు సృష్టి స్థితి లయాలకు కర్త కానివానిలాగ అంతర్యామిగా చూస్తూవుంటాడు

ఈశ్వరునకు స్వపక్ష పరపక్షాలు లేవు కర్మాధీనాలైన భూతసంఘాలు మహావాయువును అనుసరించెడి ధూళికణాల్లాగ జగత్కర్తను అనుసరిస్తూ వుంటాయి అంతేగాని జీవరాశులు స్వతంత్రంగా వ్యవహరించవు. ఆయువును ఇవ్వడానికి గాని, హరించడానికిగాని కర్మయే కారణం కాని జీవునకు అవి స్పష్టములు కావు.

సర్వ జగత్కర్మ సాక్షియైన భగవంతుని కొందఱు కర్మమని కొందఱు నైజమని, కొందఱు కాలమని కొందఱు కామమని అనేక విధాలుగా భావిస్తారు అవ్యక్తుడూ అప్రమేయుడూ, నానావిధ శక్తి సంభవ హేతు భూతుడూ అయిన భగవంతుడు చేసే పనులు బ్రహ్మరుద్రాదులకే తెలియవు అలాంటప్పుడు అతని తత్త్వం ఎవరికి గోచరమవుతుంది?

---

1. యక్షులను 2. ఓర్పు 3 సూదంటుఱాయి. 4 శక్తి

'అతడు సృష్టి స్థితి లయకారకుడైనా అహంకారం లేనివాడు కనుక ఆతనికి గుణకర్మ లంటవు. సర్వభూతాత్మకుడూ సర్వభూత నియంతా, సర్వభూత భావనుడూ అయిన భగవంతుడు నిజమాయతో గూడి భూతకోటిని సృజిస్తూ, పాలిస్తూ, సంహరిస్తూ ఉంటాడు. కనుక, ఉత్పత్తి స్థితి లయాలకు భగవంతుడు కారణం కాగా నీ భ్రాతృహననానికి యక్షులు కారకులెలా అవుతారు?

'విశ్వ సష్టలనే పేరుతో నియంత్రితులై ప్రజాపతులు సైతం ముక్కు త్రాళ్ళు పెట్టిన వృషభాది పశుగణంలాగా పరమేశ్వరుని అజ్ఞానువర్తులై వుంటారు కనుక, దుష్టుల పాలిటి మృత్యుతుల్యుడూ, సజ్జనుల పాలిటి అమృత స్వరూపుడూ, సర్వాత్మకుడూ అయిన ఈశ్వరుని ఆశ్రయించు.

ఇంతకూ, నీ వయసు అయిదేండ్లు పినతల్లి పలుకులకు వికల మనస్కుడవై, తల్లిని విడిచి అరణ్యాల్లో ఘోరతపస్సు చేశావు. భగవదనుగ్రహానికి పాత్రుడవై త్రిలోకోత్తరమైన పదం పొందావు అవిద్యాగ్రంధి*ని త్రెంచివైచికొన్నావు కనుక నీకు రోషం పనికిరాదు. రోషం వలన లోకం నశిస్తుంది నీ భ్రాతృహంతలని ఎందరో యక్షులను వధించావు యక్షాధిపతియైన కుబేరుడు శివునకు సహోదరుడు. నీ వాతని యెడల అపరాధం చెయ్యడం మంచిదికాదు. కనుక, నీవిప్పుడతణ్ణి స్తుతించి, ప్రసన్నునిగా చేసుకో' అని పలికి మనువు ఋషీంద్రులతో గూడి తిరిగి వెళ్ళిపోయాడు.

అనంతరం మనువు హితోపదేశంతో రోషం విడిచి శాంతుడై యున్న ధ్రువుని దగ్గఱకు కుబేరుడే యక్షులూ, చారణులూ, సిద్ధులూ, విద్యాధరాదులూ పరివేష్టించి సన్నుతిస్తుండగా వచ్చి, కృతాంజలియై యిలా అన్నారు :

రాకుమారా! నీ పితామహుని యాదేశానుసారం నీవు దుస్త్యజమైన వైరాన్ని త్యజించావు కనుక, నేను ప్రసన్నుడనయ్యాను. ప్రాణికోటి యొక్క జనన లయాలకు కర్త కాలమేకాని, అన్యమేదీ కాదు. కనుక, నీ సోదరుని వధించినది యక్షులూ కాదు. ఈ యక్షగణాన్ని వధించినది నీవూ కాదు. శరీరం ఆత్మకంటే విలక్షణమైనది. ఆ తత్త్వజ్ఞానం లేకపోవడం చేతనే అజ్ఞుడు ఏదైనా తానే చేశాననుకుంటాడు అది అహంకారం. అలాంటి అపార్థజ్ఞానం మానవునకు స్వప్నగతమైన బుద్ధిలాగా తోస్తూ వుంటుంది కనుక, సర్వభూతాత్మ విగ్రహుడైన ఈశ్వరుని సేవించు నీకు శుభం

---

* ముడి

కలుగుతుంది. నీవేదైనా వరం అడుగు, ఇస్తాను. నీవు శ్రీహరి పాదారవింద ధ్యానం నిశ్చలమైన భక్తితో చేయగలవాడవని నేనెఱుగుదును' అని యక్షేశ్వరుడనేనరికి—

భాగవతోత్తముడైన ధ్రువుడు సంతోషించి, అనఘా! ఏ హరిస్మరణ చేత అప్రయత్నంగా మానవుడు దురత్యయమైన అజ్ఞానాన్ని తరిస్తాడో ఆ శ్రీహరి సంస్మృతిని నాకు అనుగ్రహించు అని అర్థించాడు

అపుడు కుబేరుడు 'అలాగే అని ధ్రువునకు శ్రీహరి స్మరణం ఉపదేశించి, సంతుష్టాంతరంగుడై అంతర్హితుడయ్యాడు. అనంతరం ధ్రువుడున్నూ ఆత్మీయ నగరానికి తిరిగి వచ్చాడు.

అలా నిజనగరానికి తిరిగివచ్చిన ధ్రువుడు అనేక యజ్ఞాలు చేసి సకల ఫలప్రదాత అయిన పురుషోత్తముని పూజించాడు. నిశ్చలమైన భక్తితో ఆ రాజేంద్రుడు తన యందూ సకల భూతకోటియందూ అంతరాత్మయై వున్న ఆ భగవంతుని సాక్షాత్కరింపజేసుకున్నాడు ప్రజలు తనను పితృతుల్యునిగా భావించి సేవిస్తుండగా ధ్రువుడు భోగాలచేత పుణ్యక్షయమూ, అభోగాలైన యాగాదుల చేత అశుభక్షయమూ కాగా ఫదియారు వేల సంవత్సరాలు ధర్మార్థకామాలు పాటిస్తూ రాజ్యపాలనం చేశాడు

అనంతరం కొడుకునకు పట్టంగట్టి జితేంద్రియుడై స్వప్నమందు మాయావిరచితమైన గంధర్వనగరం లాగా దేహాదికమైన ఈ విశ్వం అంతా భగవన్మాయా విరచితమైనదిగా గ్రహించి విరక్తుడై రాజ్యాన్ని రాజ్య సంపదలనూ ఆత్మీయులనూ విడిచిపెట్టి బదరికాశ్రమానికి తపశ్చర్యకై వెళ్ళాడు. అచటి పవిత్రజలాల్లో క్రుంకులిడి పద్మాసనస్థుడై, ఇంద్రియాలను నియమించి, యోగాసనాలతో వాయువును బంధించాడు ముకుళిత నేత్రుడై శ్రీహరిరూప వైభవాన్ని ధ్యానిస్తూ ఆనంద బాష్పాలు రాల్చాడు పులకించి పోయాడు. అతని క్లేశాలన్నీ విడిపోయాయి స్త్రీ పుం భేదం నశించింది పారవశ్యంతో తనను తాను మఱచిపోయాడు

ఆ సమయంలో దశదిశలయందునూ పూర్ణిమ నాటి నిండు చందురుని లాగా కాంతులు జిమ్ముతూ ఆకాశంనుండి యొక విమానం వచ్చింది. అందులో కౌమార వయస్సులో వున్న ఇద్దఱు దేవతా శ్రేష్ఠులున్నారు వారు చతుర్భుజులు వారి నేత్రాలు ఎఱ్ఱగా వున్నాయి శరీరం శ్యామలంగా వుంది కిరీటాలు అంగదాలు హారకుండలాలు ధరించి వున్నారు చేతుల్లో గదలున్నాయి వారిని చూడగానే ధ్రువుడు తొట్రుపాటుతో లేచాడు మధుసూదనుని నామ

స్మరణంచేశాడు వారిని భగవత్కింకరులుగా గ్రహించి వారికి దండప్రణామం చేశాడు

వారు శ్రీహరి భక్తులైన సునందనందులు వారికి నమస్కరించి వినయ వినమితగాత్రుడై యున్న ధ్రువునితో వారు సంప్రీతితో మందహాసం చేస్తూ ఇలా అన్నారు: 'రాజా విను అయిదవయేటనే మేధానిధివై తపోనిష్ఠతో శ్రీహరి అనుగ్రహానికి పాత్రుడవయ్యావు. ఆ దేవదేవుని ఆజ్ఞానుసారం నిన్ను సర్వోత్కృష్టమైన హరిపదానికి తీసుకొని వెళ్ళడానికి వచ్చాం ఆ దివ్యపదం పొందడానికి సర్వజ్ఞులైన వారికే అర్హత వుంటుంది. ఆ మహాస్థానం చుట్టూ చంద్ర సూర్యనక్షత్ర తారాగణాలు ప్రదక్షిణంగా తిరుగుతూ వుంటాయి. అచటనే నీ పితరులు కూడా ఉన్నారు కనుక, భక్తకోటికి కూడా సాధింప నలవి కాని ఆ విష్ణుపదాన్ని నీవు పొందెదవు ఇదిగో విమానం శ్రీహరి దీన్ని నీకై పంపాడు దీన్ని అధిరోహించిరా।' అని ఆ దివ్య పురుషులనేసరికి—

ధ్రువుడు స్నానంచేసి అచటి మునిగణానికి నమస్కరించి, వారి ఆశీర్వాదాలు పొందాడు అనంతరం విమానానికి ప్రదక్షిణం చేసి దాన్ని పూజించాడు. హరిపార్షదులైన సునందనందులను అభినందించాడు. భగవంతుని యందు కన్నులు మనస్సు నిలిపి విమానాన్ని అధిరోహించడానికి తేజోమయ రూపం ధరించాడు అపుడు దివ్య దుందుభులు మ్రోగాయి. పుష్పవర్షం కురి సింది కిన్నరులూ, గంధర్వులూ మధుర స్వనంతో గానం చేశారు

కాని అపుడు ఖిన్నమనస్కుడై తల్లిని విడిచి యెలా వెళ్ళడమా అని దుఃఖోద్వేగంతో కనులనీరు నింపిన ధ్రువునకు సునంద నందులు తమ విమానానికి అగ్రభాగాన మరో విమానాన్ని అధిరోహించి వెళ్ళుతూన్న తన తల్లిని చూపించేసరికి అతడు మహానందం చెంది అపుడు విమానం యెక్కి విష్ణు పదానికి పయనమయ్యాడు క్రమక్రమంగా గ్రహమండలాన్నీ లోకత్రయాన్నీ సప్తర్షిమండలాన్నీ దాటి ఆవల హరి పదం చేరాడు.

ఆ విష్ణుపదం తనకాంతి పుంజం చేత ముల్లోకాలనూ ప్రకాశింపజేస్తూ వుంటుంది దయా శూన్యులక్కడ అడుగు పెట్టలేరు శాంతమూర్తులకు, సకల జీవులయందు సమదృష్టికలవారికి సచ్ఛీలురకు మాత్రమే అది సుగమమం. కట్టుగుంజ చుట్టూ గోగణం తిరుగుతూన్నట్లు ఆ అచ్యుత పదం చుట్టూ మహా వేగంతో తెప్పపాటు లేకుండా జ్యోతిశ్చక్రం తిరుగుతూ వుంటుంది. ధ్రువుడు అలాంటి దివ్యపదం చేరి ముల్లోకాలకూ శిరోమణి అయ్యాడు. అపుడు ధ్రువుని మహిమను చూచి నారదర్షి సంతోషంలో ప్రచేతసులను దేవర్షులు చేస్తున్న యజ్ఞంలో ఈరీతి గానం చేశాడు

'పతియే దైవంగా భావంలో తలచిన సునీతి కొడుకు ధ్రువుడు. అతని తపఃప్రభావం, ధర్మనిష్ఠ అనన్యసాధ్యాలు బ్రహ్మర్షులకే అవిసాధ్యంకాదంటే క్షత్రియులనంగతి చెప్పేదేముంది? పంచవర్ష ప్రాయంలో పినతల్లి దురుక్తులనెడి వాడి బాణాలచే భిన్నహృదయుడైన యాతడు నా ఉపదేశాన్ని పాటించి అరణ్యాల్లో మహోగ్రతపం చేశాడు శ్రీహరిని వశంగతుని చేసుకున్నాడు. తుదకు మహోన్నతమైన విష్ణుపదం పొందాడు ఆది సామాన్యమా?' అని మైత్రేయుడు ధ్రువుని పుణ్యచరిత చెప్పియింకా ఇలా అన్నాడు:

విదురా సజ్జన సమ్మతమూ స్వర్గప్రదమూ, మంగళకరమూ, పాపహరమూ, ధ్రువపద సంప్రాపకమూ అయిన ఈఉపాఖ్యానాన్ని నీకుచెప్పాను ఈ పుణ్యగాథను ఉభయసంధ్యల్లోనూ పూర్ణిమా అమావాస్యలయందు ద్వాదశి నాడు, ఆదివారాల్లోనూ, ఈన్య తిథియందు శ్రవణా నక్షత్రమునను, సంక్రమణ దినాల్లోను వ్యతీపాతమనబడు యోగమందు పఠించు వారికి వినువారికి సకల శ్రేయాలు లభిస్తాయి-'

అని మైత్రేయుడనేసరికి విదురుడు కృతాంజలియై, మునీంద్రా! నారదుడు ధ్రువచరిత్రను ప్రచేతసుల సత్త్రయాగంలో కీర్తించాడన్నారు ఆ ప్రచేతసులెవరు? ఎవరి కొడుకులు? వారి వంశం ఎలాంటిది? వారు యజ్ఞం ఎందుకు చేశారు? యజ్ఞ పురుషుని ఎలా అర్చించారు? మహాభాగవతుడూ విష్ణుభక్తుడూ దేవర్షి అయినా నారదుడా యోగంలో శ్రీహరి కథలు ఎలా కీర్తించాడో వినాలని కుతూహలంగా వుంది నారాయణుని కథామృతాన్ని కర్ణములనెడి దోసిళ్ళతో ఎంతగా త్రావినా తనివి తీరదు గదా ' అనేసరికి మైత్రేయుడిలా చెప్పడం మొదలు పెట్టాడు:

'ధ్రువుడు తపోనిష్ఠతో అరణ్యానికి వెళ్ళేముందు అతడు తన కుమారుడైన ఉత్కళునకు రాజ్యాభిషేకం చేశాడని చెప్పాను కదా కాని, శాంతుడూ నిస్సంగుడూ, సమదర్శనుడూ, మహాయోగీ అయిన నాతడు జడుడులాగా ఉన్మత్తుడు లాగా, నివురు గప్పిన నిప్పురీతిగా నుండి నిరంతరం ఆత్మలో జ్ఞానమయమైన బ్రహ్మను స్మరిస్తూ తనకంటే అన్యమైన దానివేదీ యెఱుగక మహావిరక్తుడై యుండడం వలన కులవృద్ధులూ మంత్రులూ ఆతడు రాజ్యపాలనకి అర్హుడు కాడని భావించి అతని తమ్ముడు వత్సరునికి పట్టం గట్టారు

ఆ వత్సరునకు సర్వర్థియను భార్యయందు పుష్పార్ణుడు చంద్రకేతుడు, ఇషుడు, ఊర్జుడు వసువు జయుడు అను ఆర్గురు కొడుకులు పుట్టారు వారిలో పుష్పార్ణునకు ఇద్దరు భార్యలు వారిలోప్రభయను నామెకు ప్రాతఃకాలము, మధ్యాహ్నం సాయం సమయం అను ముగ్గురు కొడుకులు పుట్టారు

వారిలో వృష్ణి యనువానికి పుష్కరిణి యను భార్యయందు సర్వ తేజుడను సుతుడు ఉదయించాడు. ఆ సర్వతేజునకు ఆకూతియను మహిషి వలన చక్షువను కొడుకు జన్మించాడు. అతడే చాక్షుషమనువు అతనికి అర్వల యను భార్యవలన పురువు, కుత్సుడు త్రితుడు, ద్యుమ్నుడు, సత్యవంతుడు, ఋతుడు వ్రతుడు, అగ్నిష్టోముడు, అతిరాత్రుడు, సుదుమ్నుడు, శిబి, ఉల్ముకుడు అను పన్నెండు మంది కొడుకులు పుట్టారు.

వారిలో ఉల్ముకునకు పుష్కరిణి యను పత్నివలన అంగుడు సుమన సుడు, ఖ్యాతి, క్రతువు అంగిరసుడు గయుడు అను ఆర్గురు సుతులుదయిం చారు అంత అంగునకు సునీధ యను ధర్మపత్నివలన వేనుడను కొడుకు జన్మించాడు. కాని అతడు మహాక్రూరుడు.

అంగరాజు అతని దుశ్చరిత్రకు విసివి దుఃఖంతో ఎవరికీ చెప్పకుండా నగరం విడిచి వెళ్ళిపోయాడు. ఆ దుస్థితి చూచి మునీంద్రులు క్రుద్ధులై వజ్రం లాంటి వాక్సంతతితో వేనుని శపింపగా అతడు చనిపోయాడు. అపుడులోకం అరాజకమైంది. చోరులు విజృంభించారు ప్రజలు తల్లడిల్లి పోయారు. అపుడు మునులు పశ్చాత్తాపం చెంది విగతప్రాణుడై నేల కూలిన వేనుని కుడి భుజాన్ని మథించేసరికి అందుండి నారాయణాంశంలో పృథుచక్రవర్తి జన్మిం చాడు. అతడే ఈ భూమికి తొలిప్రభువు' అని మైత్రేయుడనగా విదురుడు విని—

మునీంద్రా! మహాసాధువూ, సచ్ఛీలుడూ అయిన అంగనరేంద్రునకు ఏ కారణంచేత దుష్టసంతానం కలిగింది? విమనస్కుడై, అతడు నగరం విడిచి యెందుకు వెళ్ళాడు? ధర్మకోవిదులైన ఋషులు వేనరాజునందు ఏ దోషాన్ని ఆరోపించి అతణ్ణి శపించారు? రాజులు లోకపాలుర తేజస్సు గల వారై రాజ్యపాలన యందు ఆసక్తి కలిగి వుంటారు కదా! అలాంటి వారిలో ఏదైనా కల్మషం వుంటే ప్రజలే వారిని అవమానించరూ? కనుక, ఆ వేనుని చరిత్ర పరావరా లెఱిగిన నీ వలన వినాలని కుతూహలంగా వుంది' అనగా మైత్రేయు డీరీతిగా చెప్పడం మొదలుపెట్టాడు.

## వేనుని చరిత్ర

'విదురా! విను రాజర్షియైన అంగరాజు అశ్వమేధయాగం సంకల్పించి, ఋత్విగ్గణం చేత దేవతలకు ఆహ్వానం పంపాడు. కాని దేవతలు స్వీయ హవిర్భాగం తీసుకొనడానికి రాలేదు. అపుడు ఋత్విక్కులు విస్మితులై,

యజమానుడైన అంగ మహీపతిని జూచి రాజా! ఆహ్వానించినా దేవతలు ఆత్మభాగం పొందడానికి ఎందుచేతనో రాలేదు హోమం దుష్టమా అంటే అదీకాదు. ఇక ఛందస్సులా దృఢవ్రతులైన బ్రహ్మవాదులచేత సంప్రయుక్తాలు మహావీర్యవంతాలు పోనీ దేవతాపరాధం ఏమైనా జరిగిందా అంటే అదీ లేదే! ఇక దేవతలు స్వీయభాగాలు అంగీకరింపక పోవడానికి కారణ మేమైయ్యుంటుందో? అనేసరికి—

అంగనరేంద్రుడు దుఃఖాంతరంగుడై సదస్యుల నుద్దేశించి, మహాత్ములారా - ఆహ్వానించినా హవిర్భాగం కోసం దేవగణం రాకపోవడానికి హేతువేమిటో? చెప్పండి అని అర్థించాడు.

అపుడు వారిలా అన్నారు: 'రాజేంద్రా ఇది ఈనాటి దుష్కృతం కాదు పూర్వజన్మంలో జరిగిన దురితం చెపుతాను విను. నీవు ఇంతటి మహనీయుడవైనా నీకు సంతానం లేకపోవడంచేత దేవతలు యాగభాగం కోసం రాకున్నారు. కనుక నీవు సంతానార్థం పుత్రకామేష్టి చెయ్యి అపుడు దేవతలు హవిర్భాగం గ్రహిస్తారు. యజ్ఞపురుషుడు కూడా అనుగ్రహిస్తాడు.' అనేసరికి అతడు సంతానం కోసం శిపివిష్టుడను విష్ణువును ఆహ్వానించి పురోడాశమును* హోమంలో సమర్పించాడు. అపుడు హోమకుండం నుండి స్వర్ణమాల్యాంబరాలు ధరించిన పురుషుడొకడు హిరణ్మయపాత్రంలో పాయసాన్ని గ్రహించి ఉద్భవించాడు అపుడు విప్రజనానుమతంతో ఆ పాయసపాత్రను గ్రహించి రాజు తన భార్యకిచ్చాడు

ఆమె ఆ పాయసాన్ని గ్రహించి కుతూహలంతో భుజించి భర్తతో సంగమించేసరికి వెంటనే గర్భం ధరించి, కుమారుని కన్నది. అతనికి వేనుడని నామకరణం చేశారు కాని, అతడు పుట్టుకతోనే అధర్మపథంలో చరించడం మొదలుపెట్టాడు తనతో ఆటలకు వచ్చిన తన యీడు బాలురను నిర్దాక్షిణ్యంగా పశువులను వధించినట్లు వధించటం అతనికి వినోదం ఇక విల్లమ్ములు దాల్చి అసాధుమార్గంలో మృగాలను వధించడం విశేషమేముంది?

అతని మాతామహుడు మృత్యువు కిరాతకుడు వేనునకు ఆ పాతే అబ్బింది అతని దౌష్ట్యం చూచి అంగుడు అతణ్ణి ఎన్నోవిధాల దండించాడు. అయినా, అతడు తనకు దుశ్చేష్టితాలు మానలేదు. అపుడు ఆ రాజేంద్రుడు తన మనస్సులో ఇలా చింతించాడు

* యజ్ఞార్థమైన ఒక భక్ష్యవిశేషం

'దుష్టుడైన కొడుకును గని దుఃఖపడడంకంటే సంతానహీనుడుగా వుంటే ఎంతో మేలు హాయిగా శ్రీహరిని ధ్యానిస్తూ జీవయాత్ర చెయ్యవచ్చు. కుపుత్రుని వలన మానవులకు అపకీర్తి, సర్వజన విరోధం మహావ్యధ ప్రాప్తించడం తథ్యం. అలాంటి దుష్పుత్రునిపై మోహం పెంచుకున్నవాని యిల్లు దుఃఖాలకు నిలయం కాగలదు ఒక విధంగా కొడుకు దుష్టుడవడం కూడా మంచిదే ఎంచేతనంటే అతని దౌష్ట్యం భరించలేక మానవుడు ఇల్లు విడిచిపోయి ఎక్కడైనా సుఖిస్తాడు' అని భావించి అంగమహీపతి తన కడుపున పుట్టిన దుర్మార్గుడైన వేనుని ఒక విధంగా తన పాలిటి సుపుత్రుని గానే తలచి ఒక అర్ధరాత్రి నిద్రిస్తున్న భార్యను ప్రజలను ఇంటిని విడిచి ఏ దూరతీరాలకో వెళ్ళిపోయాడు

ఆ విషయం తెలిసి బంధువులు అమాత్యులు పౌరులు కలవరపడ్డారు భూమి నలుమూలలా అన్వేషించారు కాని, నిగూఢుడైన పరమ పురుషుని గానలేని కుయోగి లాగా ఆ రాజేంద్రుని గానక విఫల ప్రయత్నులై తిరిగి వచ్చారు రాజులేకపోవడం చేత ప్రజలు పశుప్రాయులై, స్వేచ్ఛగా సంచరించడం మొదలు పెట్టారు అపుడు బ్రహ్మనిష్ఠాగరిష్ఠులైన భృగువు మొదలగు మహర్షులు లోక సంరక్షణ కాంక్షతో వేనుని తల్లి సునీధ అనుమతిని ప్రజలకు ఇష్టం లేకపోయినా వేనునకు పట్టం కట్టారు మహోగ్రశాసనుడైన వేనుని అభిషేకవార్త విని సర్పభీతిచే ఎలుకలు పారిపోయినట్లు చోరులు కంటికి కనబడకుండా అడవులు పట్టిపోయారు

వేనుడు సింహాసనా రూఢుడయ్యాక లోకపాలకు లనుభవించెడి అష్టైశ్వర్యాలతో తులతూగుతూ కన్నూ మిన్నూ కానక సహజసిద్ధమైన గర్వంతో మాననీయులైన సజ్జనులను పరిభవించడం మొదలు పెట్టాడు అతని ధాటికి అడ్డులేదు భూగగన మార్గాల్లో రథారూఢుడై ఒంటరిగా తిరిగేవాడు మదపుటేనుగులాగా నిరంకుశంగా విహరించేవాడు. సజ్జనులను బాధించడమే అతని ఏకైక లక్ష్యం.

అంతటితో ఆగక అతడు బ్రాహ్మణు లెవ్వరూ యజ్ఞాలూ దానాలూ, హోమాలూ, చెయ్యరా'దని భూమ్యాకాశాలు బద్దలయ్యేలాగా భేరీన్ని మోగించి చాటించాడు అలా అతడు సమస్త ధర్మాలను వారించేసరికి మునులు కంపించి పోయారు ప్రజావితతికి రక్షణలేకుండా పోయింది అటు రాజువలన, యిటు చోరాదులవలన ప్రజలు ఇరువైపులా మండెడి కట్టెవలని వలె బాధ పడడం మొదలు పెట్టారు.

అపుడు మహర్షులు ఇలా చింతించారు. 'అరాజకాన్ని తొలగించగోరి అనర్హుడైన ఇతనికి పట్టం కట్టి ఆ దోషఫలం అనుభవిస్తున్నాం. పామునకుపాలు పోసి పెంచితే మాత్రం అది ఊరుకుంటుందా? అది ఎప్పటో ఆ పోషకుని కూడా కాటు వేస్తుంది. అయ్యో సునీథ కడుపున బుట్టిన ఈతడు ప్రజాపాలన భారం వహించి కూడా సహజ దుర్జనత్వంతో ప్రజల ప్రాణాలు హరిస్తున్నాడే అయినా పూర్వం ఇతణ్ణి రాజ్యాభిషిక్తుని చేసినవారు జ్ఞానసంపన్నులైన మహర్షులు కనుక మనం తొందర పడరాదు. ఇతణ్ణి అనునయించి చూద్దాం. ఒక వేళ అతడు వినకపోతే వీనిని అపుడు మనం మన తేజోగ్నిచేత భస్మీభూతం చేద్దాం' అని వారు వేనుని దగ్గఱకు పోయి, 'రాజా! నీకు ఆయువు, సిరి బలం, యశం, సిద్ధించుగాక!' అని ఆశీర్వదించి వినయంగా ఇలా అన్నారు:

'నరేంద్రా! మావిన్నపం విను. త్రికరణ శుద్ధిగా చేసే ధర్మం సమస్త లోకాలకూ సుఖాపాదక మవుతుంది. నిస్సంగులకు మోక్షం ఇస్తుంది. ప్రజా క్షేమ కారణమైన అటువంటి ధర్మం నీయందు చెడకుండుగాక! ధర్మానికే హాని జరిగితే రాజు ఐశ్వర్యదూరుడౌతాడు. దుష్టులైన అమాత్యుల వలనను, చోరుల వలనను నశించకుండా ప్రజలను రక్షిస్తూ యథాన్యాయంగా వారి వలన కప్పం గ్రహించెడి రాజునకు ఇహపర సౌఖ్యాలు లభిస్తాయి.

అదీగాక, ఎవరి రాజ్యంలో యజ్ఞేశ్వరుడైన పురుషోత్తముడు నిజ వర్ణాశ్రమ ధర్మపరులైన వారిచేత యజింపబడతాడో ఆ రాజ్యానికి అధిపతి అయిన వానివలన భగవంతుడు సంతుష్టుడవుతాడు. జగదీశ్వరుడైన భగవంతుడు సంతోషిస్తే రాజ్యాధిపతికి సర్వసౌఖ్యాలూ ప్రాప్తిస్తాయి. లోకపాలకులు సర్వేశ్వరుని కొఱకు బలిప్రదానం చేస్తారు. యజ్ఞపురుషుడు వేదమయుడు, ద్రవ్యమయుడు తపోమయుడు అయిన నారాయణుని వివిధ యజ్ఞాలతో యజనం చేస్తే నీకు అభయమూ మోక్షమూ ప్రాప్తిస్తాయి. కనుక, నీవు నీ రాజ్యంలో యజ్ఞాచరణానికి ఆజ్ఞాపించు. యజ్ఞాచరణం వలన దేవతలు సంతుష్టులై నీ కోర్కెలు తీరుస్తారు. <u>నీకు దేవతా తిరస్కారం తగదు.</u> వేద చోదితాలైన కర్మలయందు ఆసక్తి వహించు,' అని హితోపదేశం చేసేసరికి వేనుడిలా అన్నారు :

'మునీంద్రులారా! మీరేదే కుఱ్ఱతనంతో ఇలా అంటున్నారు. ధర్మమా? అదెక్కడుంది? వ్యభిచరించెడి వనిత తన పతిని వంచించి తన ఉపపతినే కర్తగా భావిస్తుంది. అలాగే మీరు నరపాలాకృతిలో నున్న నారాయణుడనైన నన్ను కాదని ఎవరినో మీరు సేవిస్తున్నారు. మీకు ఇహపర సౌఖ్యాలు

వుండవు. యజ్ఞపురుషుడంటారు. ఎవరా యజ్ఞపురుషుడు? ఎవ్వనియందు మీకు భక్తి? భర్తృస్నేహానికి తిలోదకాలిచ్చి పరపురుషుని మరగిన జారకాంత ఆ జారుని యందు కనబరచెడి భక్తిలాంటిది మీ భక్తి

'హరిహర బ్రహ్మలూ, ఇంద్రాది దేవతలూ, సూర్యచంద్రులూ నృపుని శరీరంలో అంతర్భూతంగా ఉంటారు కనుక, రాజంటే సర్వదేవతామయుడన్నమాట। కనుక మీరు మాత్సర్యం విడిచి నన్ను ఆరాధించండి నా కంటే అగ్రపూజార్హుడెవ్వడూ లేడు ఆ చేసే బలిదానాలేవో నాకే చెయ్యండి,' అని క్రూరుడూ, విపరీతబుద్ధీ అయిన వేనుడు మునుల మాటలను తిరస్కరించాడు అపుడు మునులు ఆత్మగతంగా ఇలా అనుకున్నారు:

దారుణ కర్ముడైన ఈతడు హతుడగుగాక। వీడు బ్రతికి వుంటే లోకాలన్నీ భస్మీభూతం కావడం నిశ్చితం. వీడు రాజసింహాసనానికి అర్హుడు కాడు. ఏ సర్వేశ్వరుని అనుగ్రహాతిశయంచేత ఇంతటి వైభవో పేతుడయ్యాడో ఆ శ్రీహరినే ఈతడు నిందిస్తున్నాడు కనుక ఇతనిని ఉపేక్షించరాదు. ఇతనిని అంతం చెయ్యడమే కర్తవ్యం,' అని మునులు క్రుద్ధులై హుంకరించారు. దానితో వేనుడు విగతజీవుడై నేల కొరిగాడు.

వేనుని మృతికి సునీధ శోకాతురయై సుత వ్యామోహంతో అతని మృతదేహాన్ని నిజయోగశక్తిచే చెడిపోకుండా కాపాడింది

అనంతరం మునులు సరస్వతీ నదీసలిలాల్లో స్నానమాడి ఆ నదీతీరాన అగ్నిహోత్రాలు నెలకొల్పి సత్కథా వినోదాలలో నిమగ్నులై వుండగా హఠాత్తుగా భయంకరమైన ఉత్పాతాలు తోచాయి. లోకాలకు అమంగళం కలుగకుండుగాక।' అని వారు తమ బుద్ధితో అనుకుంటుండగానే అన్ని దిక్కులా రజోవర్షం కురిసింది. చోరులు చెలరేగి చేతికందినదల్లా అపహరించుకునిపోయారు

అపుడు మునులు కళ్ళు తెరిచారు రాజు మృతుడవడంచేత జనపదాలు అరాజకాలై పరస్పరం హింసించుకుంటూ చోరబాధలకు లోనయ్యాయని గ్రహించారు ఆ దురంతాన్ని వారించడానికి సమర్థులయ్యుండిన్నీ మౌనం వహించారు. కాని, సమదర్శనుడూ, శాంతుడూ అయిన బ్రాహ్మణుడు దీనులను ఉపేక్షిస్తే అతని తపస్సు పగిలిన కుండలోని క్షీరంలాగా క్రమంగా క్షీణించిపోతుంది. అంచేత వారు, హరిపదాశ్రయులూ అమోఘ సత్యసంప

న్నాలూ అయిన అంగవసుధాధీశుని వంశం విచ్ఛిత్తికాకుండా ఎలాగైనా నిల బెట్టాలని నిశ్చయించి, మృతుడైన వేనుని కళేబరం దగ్గఱకు వచ్చి అత ఊరువు[1]ను మధించారు

అపుడా తొడనుండి ఒక వికృతాకారుడు పుట్టాడు అతడు కాకిలాగా కాలమేఘంలాగా నల్లగా వున్నాడు. కరచరణాలు పొట్టిగా వున్నాయి దౌడలు పెద్దవిగా వున్నాయి. నాసాగ్రం క్రిందికి వంపు తిరిగి వుంది. కళ్ళు ఎఱ్ఱగా వున్నాయి. వెంట్రుకలు రాగి రంగు కలిగి వున్నాయి. ముఖం దీనంగా వుంది. అతడు పుట్టీ పుట్టగానే 'నేనేం చెయ్యాలి?' అని మునులను ప్రశ్నిం చాడు. అపుడు వారాతనిని చూచి 'నిషీద[2]' అన్నారు. అంచేత అతడు నిషాద నామకుడయ్యాడు. అతని వంశజులు అడవుల్లోనూ, కొండల్లోనూ నివ సిస్తూ, వేనుని దుశ్చరిత్రను చాటుతూ కాలం గడుపుతున్నారు

అనంతరం మునులు మళ్ళీ వేనుని బాహువులను మధించేసరికి అందాల చక్కని మిధునం జన్మించింది అందఱూ ఎంతో ఆనందించారు.

## పృథుచక్రవర్తి జననం

ఆ జంటలో ఒకడు లోక రక్షణార్థం నారాయణాంశంలో జన్మించిన పురుషుడు ఒకరై శ్రీహరిని ఎన్నడూ విడువకుండా వుండే లక్ష్మీదేవి అంశంలో సంభవించిన శ్రీమూర్తి తన సుగుణాలచే భూషణాలంకారాలకు కూడా అలంకారం కల్పించగల సౌందర్యరాశి ఆమె ఆ పురుషుని చెవులు పెద్దవి. అతని యశస్సు దొడ్డది అందుచేత అతనికి పృధుచక్రవర్తియని పేరు ప్రసిద్ధమైంది ఆ అంగన పేరు అర్చి. ఆమె పృథువును కామించింది ఆ శుభవేళ సురలు విరివాన కురిపించారు. స్వర్గంలో దుందుభులు మ్రోగిం చారు మునులు స్తుతించారు అగ్నులు జ్వలించాయి. అపుడచటి బ్రహ్మ గరుడ, గంధర్వ కిన్నర గణంతో ఎచ్చి ఆ మిధునాన్ని చూచి విస్మితు లయ్యారు.

పృథుచక్రవర్తి కుడిచేతియందు శ్రీహరి ఆయుధ చిహ్నాలువున్నాయి. పాదములందు హలరేఖ, అంకుశరేఖ, వజ్రరేఖ ధనూరేఖ, పద్మరేఖ, శంఖ రేఖ విస్పష్టంగా గోచరిస్తున్నాయి. ఆ చిహ్నాలు చూచి చతుర్ముఖాదులు, 'ఇతడు నారాయణ సంభూతుడూ, ఇతని యంగన రమాంగ సంభూతురాలూ కాబోలు'నని భావించారు. అపుడు బ్రహ్మవాదులైన విప్రులు పృథునకు విధి

---

1. తొడ. 2. 'కూర్చో'

చోదితంగా రాజ్యాభిషేకం చేశారు సకల చరాచర జీవరాసులు ఆ చక్రవర్తికి యథోచితంగా కానుకలు పెట్టారు

లోక విఖ్యాతి గాంచిన ఆ పృథుచక్రవర్తి తన భార్య అయిన అర్చితో గూడి దివ్యవస్త్రాభరణాలూ, గంధమాల్యాలూ ధరించి, అగ్నిహోత్రుడులాగా భూమి నల్గడలా కాంతులను విరజిమ్మాడు ఆ రాజేంద్రునకు కుబేరుడు వీరాసనం, వరుణుడు సితాతపత్రం వాయువు సితచామరాలు ధర్ముడు కీర్తిమయమైన పుష్పమాలిక ఇంద్రుడు కిరీటం, యముడు రాజ దండం, బ్రహ్మ వేదమయమైన కవచం, వాణి స్వచ్ఛమైన నవ్యహారం ఇచ్చి ఆదరించారు.

అలాగే విష్ణువు సుదర్శన చక్రాన్నీ, సకల సంపదలూ ప్రసాదించాడు శివుడు అర్ధ చంద్రరేఖ చిహ్నంగాగల ఖడ్గాన్నీ అంబిక శతచంద్రమనే డాలూ, చంద్రుడు అమృత మయాలైన శ్వేతాశ్వాలనూ, విశ్వకర్మ ఉదాత్తమైన రథాన్నీ, సూర్యుడు కిరణ మయాలైన బాణాలనూ అగ్నిదేవుడు అజగవమను విల్లునూ భూదేవి యోగమయమైన పాదుకాద్వయాన్నీ ఆ రాజేంద్రునకు కానుక పెట్టారు

అంతేకాక ఆకాశం నిత్యమూ ఆ నరేంద్రునిపై సుమవర్షం కురియిస్తోంది. ఋషులు ఆశీర్వదిస్తున్నారు సముద్రుడు శంఖాన్ని ఇచ్చాడు నదీనదాలూ, పర్వతాలూ ఆతని రథానికి దారి నిచ్చాయి అపుడు పృథు చక్రవర్తిని వంది మాగధజనం కైవారాలు చెయ్యడం మొదలు పెట్టేసరికి ఆ నరేంద్రుడు మందస్మితం చేస్తూ మేఘ గంభీర వాక్కులతో ఇలా అన్నాడు :

ఓ వందిమాగధులారా నా యందు సుగుణాలుంటే మీరు నన్ను స్తుతించడంలో తప్పులేదు. కాని నాలో ఎలాంటి సుగుణమున్నూ లేదు కనుక, మీ పొగడ్తలు వ్యర్థం 'అలాకాదు, మీ యందు మాకు సుగుణాలు గోచరించడం వల్లనే నన్నుతించాం' అంటారా? ఆ వాదనకూడా సరికాదు ఎందుకంటే, ఆ సుగుణాలు నేను నేనై గడించినవి కావు అవి నాలో అంతర్యామిగా వున్న శ్రీహరివి కనుక మీరు స్తుతింపగోరితే ఆ శ్రీ మహావిష్ణుని గుణగణాలను స్తుతించండి పోనీ మహాత్ములైన వారిని చూచి వారి గుణసంపదను మీరు స్వాయత్తం చేసుకోవచ్చును గదా అంటే ఆ మహాత్ముల గుణాలు ప్రసిద్ధాలు. వానిని అలవరచుకొనిన వారిని స్తుతించడంలో విశేషం లేదు. అలాగే శాస్త్రాభ్యాసం వలన తనకు విద్యా తపో యోగసుఖాలు కలిగాయని కనుక తాను నన్నుతికి అర్హుడనని ఎవడైనా భావిస్తే సభ్యులు పరిహసిస్తారు కాని వానిని మెచ్చుకోరు బుద్ధిహీనులకు ఈ రహస్యం తెలియదు. పండితులు ఆత్మస్తుతినీ, పరనిందను ఏవగించుకుంటారు రాజులు ఉత్తమ

కర్మ లాచరించినా ఆచరించకపోయినా వారిని పొగడడం వంది మాగధులకు సముదాచారమేనుకుంటే మఱి పసిపిల్లల్లాగా పరవశించిపొగడడం తగదు,' అని పృథుచక్రవర్తి హెచ్చరించేసరికి ఆ సూత వందిమాగధులు మునిచోదితులై అనురాగముట్టిపడగా అమృతోపమానాలైన మధురవాక్కులతో ఇలా అన్నారు.

రాజేంద్రా నీవు వేనుని అంగమందు జన్మించావు శ్రీనాథకళాంశ సంభవుడవు కనుక నీలో పొగడదగిన సుగుణాలు లేకపోవడమేమిటి? వాస్తవంగా నీ మహిమ తర్కానికి అందనిది నిన్ను పొగడడం మాకు అలవి కాదు అయినా మునుల సంప్రేరణంతో నీ సచ్చరిత్రను కీర్తిస్తాం

ఈ వైన్యుడు[1] తాను ధర్మమార్గాన చరిస్తూ లోకాల్లో ధర్మాన్ని ప్రవర్తింపజేస్తాడు ప్రజారంజకంగా పాలిస్తాడు శత్రువులను దండిస్తాడు యజ్ఞయాగాదులు చేసి ఐహికాముష్మిక సుఖాలనుభవిస్తాడు. సూర్యుడులాగా[2] ఈ నరేంద్రుడు ప్రజాధనాన్ని గ్రహించి తిరిగి ప్రజాహితం కొఱకే వినియోగిస్తాడు సర్వభూతములందునూ సమభావం చూపిస్తాడు ఒకవేళ లోకులు అపరాధం చేసినా శిక్షించే శక్తి వున్నా సహనం వహిస్తాడు మానవాకృతి ధరించిన శ్రీహరి యితడు ఇంద్రుడు వర్షించి ప్రజాళిని రక్షించునట్లు ఈతడు ప్రజల కామితాలు తీర్చి వారిని కాపాడతాడు నగుమొగంతో అందఱినీ రంజింపచేస్తాడు అతని పరాక్రమం ఆప్తులకే తెలియదు ఇక శత్రువులేం పసిగట్టగలరు?

ఈతని రాకపోకలు ఎవ్వరికీ తెలియవు ఎప్పుడే రాజకార్యం నిర్వహిస్తాడో తెలియదు ఇతని మహిమ అపారం సముద్రంలాగా గంభీరంగా ఉంటాడు ఈతని కోశం గుప్తంగా వుంటుంది సముద్రాలచే ఆవరింపబడిన వరుణుడు లాగ ఇతడు సంవృతాత్ముడై వుంటాడు ఇతని ప్రతాపం శత్రు సమూహానికి దుస్సహంగా వుంటుంది దగ్గఱలో వున్నా దూరస్థుడుగా గోచరిస్తాడు. వేనుడను అరణియందు ధరించిన అగ్నిహోత్రుడు గనుక ఇతణ్ణి ఎవ్వరూ స్పృశింపలేరు చారులవలన సమస్త భూతకోటియొక్క వర్తనం చూస్తుంటాడు. అందఱకు ఆత్మభూతుడై వుంటాడు నిందాస్తుతుల యందు ఉదాసీనుడై యుంటాడు నిరంతరం ధర్మమార్గాన వర్తిస్తూ తప్పు చేసినవాడు ఎంతటి ఆత్మీయుడైనా విడిచిపెట్టడు శత్రువైనా అదండ్యుడైతే దండించడు. మానసపర్వత పర్యంతం ఈతని ఆజ్ఞకు అడ్డులేదు. సూర్యుడు నిజకిరణాల చేత ఎంతదూరం భూమిని ప్రకాశింపచేస్తాడో ఈతడంత పర్యంతం నిజగుణాలచే లోకాలను రంజింపచేస్తాడు.

---

1 వేనుని కొడుకు. 2 సూర్యుడు నీటిని గ్రహించి మరల వర్ష రూపంలో ఇస్తాడు.

ఇతడు సత్యసంధుడు. దృఢవ్రతుడు. పరకాంతలను మాతృసమానంగా భావిస్తాడు తన భార్యను అర్ధశరీరంగా పరిగణిస్తాడు ప్రజలను కన్నతండ్రి లాగా రక్షిస్తాడు బ్రహ్మనిష్ఠాగరిష్ఠులను సేవిస్తాడు ఆప్తులకు సుహృజ్జనులకు ఆనందం కలిగిస్తాడు. భవబంధాలకు దూరంగా వుండేవారిని ఆదరిస్తాడు దుష్టులపాలిట యముడితడు ఇతడు ప్రకృతి పురుషుల యందంతర్యామియై యుంటాడు కనుక ఈతడు కేవలం భగవదవతారం.

'త్రిగుణాలు ఇతని అధీనాలు. ఇతడు బ్రహ్మకళాస్వరూపుడు. కనుక ఇతని యందు అవిద్యారచితమైన భిన్నదృష్టి నిరర్థకం. ఉదయాచల పర్యంతం భూమండలాన్ని సాటిలేని వీరుడుగా రక్షిస్తూ ధనుష్పాణియై మణిస్యందనం అధిరోహించి సూర్యుడులాగా శత్రురాజులను చీకట్లను చీల్చుకుంటూ భూప్రదక్షిణం చేస్తాడు అపుడు దిక్పాలకులు, ఇతర పార్థివులు ఇతడు శ్రీహరి సముడైన ఆదిరాజేంద్రుడని నుతిస్తూ కానుకలర్పిస్తారు

ఈ నరేంద్రుడు భూమిని గోవుగా చేసి, ప్రజలకు వలసిన సమస్త పదార్థాలనుపిదికిఇస్తాడు ఇతడు దేవేంద్రుడులాగా పర్వతాలను ఇట్టేభేదిస్తాడు. అజగవమను తన వింటినారిని మ్రోగిస్తూ, క్షాత్రవానీకాన్ని దద్దరిల్లజేస్తాడు సింహవిక్రమంతో ఎలెదలా సంచరిస్తాడు ఇతడు సరస్వతీ నదీతీరాన నూఱు యాగాలు చేస్తాడు. తుది యాగంలో ఇతని యాగాశ్వాన్ని ఇంద్రుడు అపహరిస్తాడు

'ఒకనాడీతడు తన భవనమునకు సమీపంగా వున్న వనంలో సద్గుణాకరుడైన సనత్కుమారుని దర్శిస్తాడు ఆ మునీంద్రుడు బ్రహ్మతనూజుడని తెలిసికొని ఆ మహనీయుని పూజించి, జ్ఞానసముపార్జనం చేస్తాడు అక్కడ ఆ మునీంద్రుని వలన బ్రహ్మవేత్తలెందఱో తత్త్వోపదేశం పొందుతారు. ఆ పార్థివోత్తముడు ప్రజలు తన విక్రమగాథలను కీర్తిస్తుండగా వింటూ దిగ్విజయయాత్ర చేస్తాడు అని వివిధాల సన్నుతించిన వందిమాగధ సూతులను బ్రాహ్మణామాత్య పురోహితులను, పౌరజానపదులను పృథుచక్రవర్తి యథోచితంగా పూజించా' రని మైత్రేయుడు చెప్పగా విదురుడిలా అన్నాడు

మునీంద్రా! భూమి గోరూపం ఎందుకు ధరించింది? దానికి దూడ ఏది? దానికి పిదకడానికి అర్హమైన పాత్ర యేది? దోగ్ధయైన పృథువు ఏయే వస్తువులు పిదికాడు? ఎగుడు దిగుడులుగా [illegible] సమగతి ఎలా ప్రాప్తించింది? ఇంద్రుడు యజ్ఞాశ్వాన్ని [illegible] కారణమేమిటి? పృథుచక్రవర్తి సనత్కుమారునివలన జ్ఞానోపదేశం పొంది [illegible] ఏమయ్యాడు? పరబ్రహ్మమూ భగవంతుడూ సర్వసాక్షియూ [illegible]కుడూ [illegible] శ్రీకృష్ణుని అవతారాంతరాలైన దివ్యకథలనూ, పుండరీకాక్షుడు పృథువుగా [illegible]



తరించి భూమిని పదకడం మొదలుగా కథనూ నాకు తెలియజెప్పు నేను స్త్రీకూ ఆ పుండరీకాక్షునకూ కూడా దాసుడనేగదా!' అనేసరికి మైత్రేయుడు వాసుదేవ కథా సంప్రీతచిత్తుడైన విదురుని ప్రశంసించి యిలా అన్నాడు :

'విదురా! విను. విప్రులచే అలా అభిషిక్తుడైన పృథువు రాజ్యపాలన చేస్తూండగా రసహీనమైన భూమివలన ఆహారం లభించక క్షుద్బాధచే క్షీణ దేహులైన ప్రజలు ఆ నరేంద్రుని చూచి, 'ప్రభూ! మేము ఆకలిబాధ భరించ లేకుండా ఉన్నాం చెట్టుతొఱ్ఱలో రగుల్కొల్పబడిన అగ్ని ఆ చెట్టును దహింపజేయునట్లు మమ్మల్ని ఆకలిచిచ్చు దహించివేస్తోంది నీవే మాకు దిక్కు మేము నిన్ను శరణువేడుతున్నాం మాకింత అన్నం కల్పించి మమ్మల్ని రక్షించు' అని అర్థించారు

పృథుచక్రవర్తి ప్రజల దైన్యం చూచి దానిని నివారించడానికి తగిన ఉపాయం ఆలోచించాడు. క్రోధంతో వింట బాణం సంధించాడు ఆ సమయంలో అతడు త్రిపురదహనం నాటి రుద్రుడు లాగా గోచరించాడు ఆ రౌద్రాకారం చూచి భూమి కంపించిపోయింది. గోరూపం ధరించి వేటగాణ్ణి చూచి భీతితో అడవిని బడి పరువులెత్తెడి లేడిలాగా పారిపోవడం మొదలు పెట్టింది అలా భూదేవి పాఱిపోతుంటే పృథువు విల్లెక్కుపెట్టి దాని వెంట పడ్డాడు. దిక్కులయందు, విదిక్కులయందు భూమ్యాకాశాలయందు అది యెక్కడకు వెళ్తే అక్కడికి తానుకూడా వెనుతగిలి వెళ్లాడు అపుడు భూదేవి భయక్రాంతయై ఆ నరేంద్రునితో—

ప్రభూ నీవు ధర్మవత్సలువడవు ఆపన్నరక్షకుడవు మహాత్ముడవు. నేను దీనురాలను. ఏ పాపము ఎఱుగను అందులో స్త్రీని నీవిలా నా వెంట బడి నన్ను వధించడానికి ఎందుకు తలపెట్టినట్లు? ఒకవేళ స్త్రీలు అపరాధం చేసినా ధర్మజ్ఞులైన వారు వారిని వధింపరే! నేను ప్రాణికోటికి ఆధారభూతను. నౌక లాంటిదాన్ని. దృఢ శరీరను. నీవు నన్ను వధించాలని చూస్తున్నావే! ఇక ప్రజలను నీటబడి మునిగిపోకుండా ఎలా రక్షిస్తావు!— అని దీనంగా అన్నది.

అపుడు పృథుచక్రవర్తి యిలా అన్నాడు- ధాత్రీ! నీవు యజ్ఞాల్లో హవిర్భాగం తీసుకుంటున్నావు కాని ప్రజాహితం కోరి నీవు ధాన్యాదికం పండించకుండా గోరూపం ధరించి తృణభక్షణం చేస్తూ పాలను నీలోనే యణచిపెట్టుకొని యున్నావు. ఇలా ప్రజలకు జీవనాధారం లేకుండా చేసిన నీవు అపరాధివి. నిన్ను ఖండఖండాలుగా చీల్చి నీ మాంసంతో దీనుల ఆకలి తీరుస్తాను

స్త్రీని అన్నావు స్త్రీ వధ తగదన్నావు. కాని భూతదయ లేకుండా స్వార్థచింతతో స్వపుత్రమాత్ర పోషకులై పరాతు స్త్రీలైనా, పురుషులైనా, నపుంసకు

లైనా వధార్హులే. అలాంటివారిని వధించడంవల్ల రాజులకు హత్యాదోషం అంటదు. నీవు స్త్రీవైనా నీ స్వభావం జడం. పైపెచ్చు భూతకోటి జలమగ్నం కాకుండా రక్షిస్తున్నాననే గర్వం కూడా వుంది నీకు. నిన్ను వధించి నా యోగమహిమలో జీవరాశిని ఉద్ధరిస్తాను. చూడు- అని రోషభీషణాకారుడై దండధరుడులాగా కనబడేసరికి, భూమి గజగజ వణుకుతూ చేతులు జోడించి పృథునరేంద్రుని ఇలా స్తుతించడం మొదలు పెట్టింది

'దేవా! నీవు పరమపురుషుడవు గుణాత్మకుడవై నానావిధదేహధారణం చేస్తావు నీవే పూర్వం నన్ను సమస్త జీవకోటికి ఆధారభూతనుగా నిర్మించావు నాలో నాల్గువిధాలైన భూతసముదాయం*వుంది. దాన్ని నీవు గ్రహించవలసి వుంది అంతేగాని, ఆయుధ్ధం ధరించి నన్ను అంతం చెయ్యడానికి యత్నించ డం తగదు. నీ కంటే నాకు అన్యశరణ్యం లేదు.

అదీగాక, నీవు మహామహిమాన్వితుడవు. నీ మహిమ తర్కానికి అందదు. స్వీయ మాయచే సకల చరాచర సృష్టిచేశావు. ధర్మార్థ పరుడవు. నీపరాక్రమం దుర్జయమైనది నీవు స్వతంత్రుడవు కనుక, బ్రహ్మనుసృజించి, ఆయన చేత సకల జగత్సృష్టిని చేయిస్తున్నావు నీవు ఒకడవే అయినా, అనేక విధాల ప్రకాశిస్తూ వుంటావు

'పంచభూతాలూ ఇంద్రియాలూ, కారక చైతన్యాహంకారాలూ అనే శక్తులతో లోకాలకు ఉత్పత్తి స్థితి లయాలు కల్పిస్తూ వుంటావు. అలాంటి విరుద్ధశక్తులుగల పరమ పురుషుడవైన నీవు నా నమస్కారం. నీవు నిజ కల్పితమూ భూతేంద్రియాంతఃకరణాత్మకమూ అయిన ఈ విశ్వాన్ని సంస్థా పింపదలచి ఆదివరాహావతారంతో రసాతలం నుండి నన్ను ఉద్ధరించావు జల రాశిపై నేను నావరూపంలో వుండగా నీకు నా యందు సకల జీవరాసులను సృజించి రక్షించదలచి పృథు చక్రవర్తివిగా అవతరించావు. భూభారం వహిం చిన అలాంటి నీవు క్షీరనిమిత్తం నన్ను వధించాలను కుంటున్నావు-ఇది విచి త్రం కాదూ?

'మాయామోహితులమైన మాకు హరి భక్తుల చేష్టితాలే తెలియవు. ఇక శ్రీహరి చేష్టితాలెలా తెలుస్తాయి? మహాత్మా! క్రోధాన్ని విడిచి నాకు అభయ ప్రదానం చెయ్యి. నా విన్నపం విను. పూవు కందకుండా సరసంగా పూదేనియను గ్రహించెడి తుమ్మెదజేని లాగా సజ్జనుడూ రసజ్ఞుడూ అయిన పురుషుడు సారం గ్రహిస్తాడు. తత్వదర్శనులైన మునులవలన ఐహికా ముష్మికఫలం పొందడానికి కృషి మొదలైన పనులూ, అగ్నిహోత్రాలూ

* ఖనిజాలు, ఓషధులు, పశుపక్ష్యాదులు, మానవులు.

ఎవ్వడాచరిస్తాడో వానికే ఆయా ఫలప్రాప్తి కలుగుతుంది అలాకాక విద్వాంసుడైనా అహంకరించి తనంతట తాను అనాదరణ భావంతో ఆచరిస్తే వృథా యాసమే కాని ప్రయోజనమేమిన్నీ వుండదు

'పూర్వం బ్రహ్మదేవుడు నాయందు నిక్షేపించిన ఔషధులను దుర్జనులు అనుభవిస్తూ ఉండడం చూచి రాజేంద్రులెవరూ వారింపరైరి. అందులో చోర బాధయొకటి అంచేత నన్నుపాలించి రక్షించే వారెవ్వరూ లేక నేను కృశించి పోయాను. లోకంలో యజ్ఞకర్మలు చేసే వారెవ్వరూ లేరు నేనంటే ఎవరికీ ఆదరంలేదు లోకమంతా చోరగ్రస్తమే పోయింది. అపుడు నేను ఎప్పటికైనా యజ్ఞాదులు ప్రారంభం కావాలంటే దుష్టుల పాలబడకుండా ఓషధులను నేనే గ్రసించి జీర్ణం చేసుకున్నాను.

'అయినా వాటిని తిరిగి పొందడానికి ఒక ఉపాయం వుంది చెపుతాను. విను. నీకున్నూ నాపై వాత్సల్యం ఉంది కదా నీవు నా కొక దూడను, పాలు పిదికేపాత్రను, పాలు పిదికేవాన్నీ కల్పించు. అపుడు నేను ప్రాణికోటికి కావలసిన కామితాలను స్రవిస్తాను. అదీగాక, నేనిపుడు ఎగుడు దిగుడులుగా వున్నాను. నన్ను సమస్థలంగా చేస్తే వర్షర్తువులో పడినసీరు అనంతరం ఇంకి పోకుండా ఎప్పుడూ వుంటుంది '

—అని భూదేవి మధురవాక్కులతో అనేసరికి పృథు చక్రవర్తి ఆనందించి, మనువును దూడగానూ, తన పాణి తలాన్ని దోహనపాత్రగానూ చేశాడు. అనంతరం తానే దోగ్ధగా సకలౌషధులు పిదికి అందఱికి కోర్కెలు తీర్చాడు. ఋషులు బృహస్పతిని వత్సంగాచేసి తమ యింద్రియాల్లో ఛందోమయిమైన క్షీరాన్ని పిండారు దేవతలు ఇంద్రుని దూడగా తెచ్చి స్వర్ణపాత్రికలో ఓజస్సు, బలం, వీర్యం అనబడే అమృతరూపమైన పాలను పిండారు. దైత్యదానవులు ప్రహ్లాదుని దూడగా చేసి మద్యరూపకమైన దుగ్ధం పిండారు

అలాగే అప్సరసలూ గంధర్వులూ కలిసి విశ్వావసువును దూడగాగొని తెచ్చి పద్మమయ పాత్రంలో మాధుర్యం సౌందర్యంతో గూడిన గాంధర్వ క్షీరాన్నీ, పితృదేవతలు సూర్యవత్సకంగా ఆమపాత్రం[1]లో గవ్యాన్నీ[2] సిద్ధులు కపిలుని దూడగా కల్పించి ఆకాశం అనే పాత్రంలో అణిమాది సిద్ధులనేడి దుగ్ధాన్నీ విద్యాధరాదులు తామే దూడలుగా తామే దోహన పాత్రాలుగానై ఆకాశగమనాది రూపకమైన క్షీరాన్నీ పిండారు

అనంతరం క్రమంగా కింపురుషాదులు మయుని దూడగాచేసి ఆత్మ పాత్రలో సంకల్ప మాత్రం చేతనే పుట్టడం అంతర్ధానం కావడం వంటి

---

1 పచ్చికుండ. 2 గోక్షీరం

మాయారూపకమైన పయస్సునూ, యక్షరక్షోపిశాచాలు భూతేశుడైన కుబేరుని వత్సంగా జేసి కపాలపాత్రంలో రక్తాసవం అనే క్షీరాన్ని, సర్పాలు తక్షకుని వత్సంగా కల్పించి బిల[1] పాత్రంలో విషరూప క్షీరాన్ని, పశువులు గోవృషభాన్ని దూడగానిలిపి అరణ్యమనెడి పాత్రంలో తృణమను పాలనూ, క్రవ్యాద మృగాలు[2] సింహాన్ని దూడగాచేసి ఆత్మకళేబర పాత్రంలో మాంసమనెడి క్షీరాన్ని పక్షులు గరుడుడు వత్సంగా నిజదేహం పాత్రంగా కీటక ఫలాదికమైన దుగ్ధాన్ని వనస్పతులు వటవృక్షాన్ని వత్సకంగా చేసి నేలను చీల్చుకొని వచ్చేది మొక్కలనెడిపాలనూ పర్వతాలు హిమవంతందూడగాసామ ప్రదేశాలు పాత్రలుగా నానావిధ ధాతువులనే దుగ్ధాన్ని—ఈ విధంగా సమస్త చరాచరవర్గం వేర్వేరు దూడలతో వేర్వేరు పాత్రలయందు వేర్వేరు క్షీరాలను పిదికి తమ కామితాలు తీర్చుకున్నారు

పృధు చక్రవర్తి అపుడు మహానందం చెంది సకల కామితాలను పిండెడి భూమిని తన పుత్రికగా గ్రహించి తన వింటికొన చేత పర్వత కూటాలను చూర్ణంగాచేసి భూమండలాన్ని సమస్థలంగా చేశాడు. అలా ఆ నరేంద్రుడు ప్రజాళికి తండ్రీ జీవనదాతా అయ్యాడు అక్కడక్కడా అదివరకు లేని నగరాలు గ్రామాలు నిర్మించాడు అటవికులకు పల్లెలు కట్టించాడు. అందరూ ఎవరి నివాసాల్లో వారు సుఖంగా వుండటం మొదలుపెట్టారు అని మైత్రేయుడు అనంతరగాథను ఇలా చెప్పడం మొదలు పెట్టాడు

రాజర్షియైన పృధుచక్రవర్తి బ్రహ్మావర్తదేశంలో సరస్వతీనదీ సమీపమునగల మనుక్షేత్రంలో దీక్షతో నూఱుఅశ్వమేధాలు చేయాలని సంకల్పించి వరుసగా చెయ్యడం మొదలు పెట్టాడు ఆ యజ్ఞక్రియల వలన విశేషఫలం పొంది ఆతడు తనను ఎక్కడ మించిపోతాడో అనే దురూహతో ఇంద్రుడు సహించలేక పోయాడు సాక్షాత్తూ భగవంతుడైన ఆ పృధుచక్రవర్తికి భూదేవి ఆ యజ్ఞక్రియలకు కావలసినంత హవిస్సునే కాక సమస్తకామితాలను పిదుకుతోంది

చెట్లు ఏపుగాపెరిగి మకరందాన్ని స్రవిస్తూ చెఱకు రసం - ద్రాక్షారసం, దధి క్షీరం, ఆజ్యం పానకం మొదలైన పదార్థాలను వర్షిస్తూ వుంటే అవి నదులుగా ప్రవహిస్తున్నాయి. సముద్రాలు రత్నాలు సమకూరుస్తున్నాయి. పర్వతాలు భక్ష్యం భోజ్యం, చోష్యం[4], లేహ్యం[5] అనెడి చతుర్విధాన్నాలను కురుస్తున్నాయి. దిక్పాలకులు కానుకలు తెచ్చి సమర్పిస్తున్నారు అలా శ్రీహరి పరాయణుడైన పృధుచక్రవర్తి తొంబది తొమ్మిది క్రతువులు పూర్తిచేసి,

1 పుట్ట. 2 మాంసంతినేవి 3 శవం 4 పీల్చదగినది. 5 నాక దగ్గది

నూత్తోయజ్ఞంలో యజ్ఞపతియైన పుండరీకాక్షుని పూజిస్తుండగా ఆ పరమోత్సాహాన్ని చూచి సహించలేక ఇంద్రుడు రోషంతో పాషండ వేషం దాల్చి, మఖాశ్వాన్ని అపహరించి ఎవరికీ కనబడకుండా మాయమయ్యాడు

ఇంద్రుడలా వంచించి వెళ్ళడం గ్రహించిన అత్రిమహర్షి ప్రేరేపణతో పృధుచక్రవర్తి కుమారుడు ధనుర్బాణాలు తీసుకొని మహాదర్పంతో సురేంద్రుని వెంటబడ్డాడు యజ్ఞసాధనమైన పశువును హరించిన వానిని వధించడం ధర్మమని భావించి ఆ రాకుమారుడు ఇంద్రుని ఎదుటనిలిచి, నిలు నిలు' మని వారించాడు. కాని, అది అధర్మం అనే భావం కలుగచెయ్యడానికి ఇంద్రుడు తన మాయాబలంతో జడలు, భస్మం, ఎముకలు ధరించి, ధర్మమూర్తిగా గోచరించాడు పృధుచక్రవర్తి కొడుకు అతని ఆకారం చూచి అతడెవడో ధర్మదేవతయని భ్రమించి బాణప్రయోగం చెయ్యకుండా నిలబడిపోయాడు.

అపుడు అత్రి మహర్షి క్రుద్ధుడై ఇతడు యజ్ఞహంత, సురాధముడు, ఇంద్రుడు. నీవు శంకించకుండా అతని జయించు అని ముమ్మారు హెచ్చరించేసరికి ఆ రాకుమారుడు గగన మార్గ గతుడైన దేవేంద్రుని మీద సింహకిశోరం మదగజంపై లంఘించునట్లు లంఘించాడు అపుడింద్రుడు అశ్వాన్ని అపహరించడానికి ధరించిన పాషండ రూపమునూ, అశ్వాన్నీ వదిచి అంతర్ధానమయ్యాడు.

పృథు నరేంద్రుని కొడుకు మఖాశ్వాన్ని తీసుకొని యజ్ఞశాలకు తిరిగి వచ్చేసరికి ఆ యాగశాలలో ఉన్న మహర్షులందఱు అతని అద్భుత పటిమకు విస్మయపడి అతనికి జితాశ్వ దను వేరుపెట్టారు కాని, ఇంద్రుడంతటితో ఊరుకోలేదు. తిరిగి దట్టమైన దుమ్ముతో చీకట్లు కల్పించి ఎవరికీ కనబడకుండా స్వర్ణమయమైన యూప స్తంభానికి స్వర్ణమయాలైన త్రాళ్ళతో బంధించిన మేధీయాశ్వాన్ని అపహరించుకొని ఆకాశమార్గాన వెళ్లాడు

అత్రి మహర్షి తన యోగదృష్టితో ఆ ఉదంతాన్ని గ్రహించి జితాశ్వుని తిరిగి హెచ్చరించేసరికి అతడు ధనుర్బాణాలు గ్రహించి వెంటబడ్డాడు కాని ఇంద్రుడు పుఱ్ఱెను ఖట్వాంగాన్ని[1] ధరించి వుండడంచేత అతడెవ్వడోయని భావించి అతనిపై బాణ ప్రయోగం చేయడానికి వెనకాడాడు ఆసమయంలో అత్రి మహర్షి తిరిగి ప్రేరేపించగా జితాశ్వుడు మహా రోషంతో విల్లెక్కుపెట్టేసరికి సురేంద్రుడు వెనకటి వలెనే తన మాయా వేషాన్నీ, క్రతుహయాన్నీ విడిచిపెట్టి అంతర్హితుడయ్యాడు.

---

1. మంచపు కోడువంటి ఆయుధం లేక శివుని విల్లు.

అపుడా వీరాగ్రణి యజ్ఞవాజిని తీసికొని తిరిగి క్రతుశాలకు వచ్చాడు. ఇందుదలా యజ్ఞాశ్వాన్ని హరించడానికి ధరించి విడిచిన అమంగళ మాయా రూపాలను కొందఱు కావాలని ధరించారు. అలా పాషండ చిహ్నాలు కలిగి నగ్నంగా తిరిగే జైనులు[1], కాషాయాంబరాలు ధరించే బౌద్ధులూ[2], ఎముకలు భస్మం దాల్చేటి కాపాలికులు[3]గా లోకంలో ప్రచలితులయ్యారు. ధర్మమను భ్రాంతితో అజ్ఞానమందు చరించెడి అజ్ఞానులు వారు.

హయహరణ వృత్తాంతం విని పృధుచక్రవర్తి కుపితుడై ఇంద్రుని వధించడానికి ఉద్యమించేసరికి ఋత్విక్కులు ఆ మహావీరునకిలా అన్నారు— జననాథా! యజ్ఞ దీక్షితునకు పశుబంధనం పశుహింస కర్తవ్యములుకాని ఇతరులను వధించడం తగదు కనుక నీవు ఇపుడు ఇంద్రవధోద్యోగం మాను. వీర్యవంతాలైన మంత్రాలచేత మేం ఇంద్రుణ్ణి ఇక్కడకు వచ్చేలాగా చేస్తాం. అపుడాతని ధైర్యసారాన్ని చెదరగొట్టి అతనిని అగ్నికి ఆహుతిగా వ్రేలుస్తాం. అపుడాతడు నీ మహిమచేత వీర్యాన్ని కోల్పోయి అతడు నిస్తేజుడై పోతాడు,

అని పృధుచక్రవర్తిని వారించి ఋత్విక్కులు క్రుద్ధులై స్రుక్స్రువాలు చేదాల్చి అగ్నిని వ్రేల్చబోతుండగా అక్కడికి బ్రహ్మదేవుడు వచ్చి ఇలా అన్నాడు—ఋత్విక్కులారా యజ్ఞాల్లో యజింపబడే దేవతలందఱు ఇంద్రుని అంశలే ఇంద్రుడు యజ్ఞపతియైన భగవంతుని అంశంలో జన్మించినవాడు. కనుక అతడు వధార్హుడుకాడు ఒకవేళ అతడు యజ్ఞకర్మను విధ్వంసం చెయ్యాలనే సంకల్పంతో ధర్మ విరుద్ధాలైన పనులేమైనా చేస్తే మీరు చూస్తూ ఊరుకోవలసినదే కాని ప్రతీకారం తలపెట్టడం తగదు ఈ చక్రవర్తి నూఱవ యజ్ఞం ఫలిస్తుంది—అని పలికి పృధుచక్రవర్తి నుద్దేశించి యిలా అన్నాడు—

రాజేంద్రా నీవు మోక్ష ధర్మం ఎఱిగిన వాడవు కనుక ఇక నీవు యజ్ఞాలు చెయ్యనక్కరలేదు ఇంద్రుడూ నీవూ ఇద్దఱూ సుశ్లోకులే. నీవు ఇంద్రుని చేష్టితాన్ని మనస్సులో బెట్టుకొని అతనిపై కోపించడం తగదు. కనుక రోషం విడిచిపెట్టు నీ మనస్సు రోష కలుషితమైతే నిన్ను అజ్ఞానం ఆవహిస్తుంది నీ యజ్ఞం భంగ చెయ్యడానికి అశ్వాన్ని హరించిన ఇంద్రుడు దేవతలందఱిలో దురాగ్రహుడు అంచేత అతడి పాషండ ధర్మాలను కల్పించాడు. ఇవి చిత్తాకర్షకంగా ఉండి ధర్మసాంకర్యం కలుగజేస్తాయి. కనుక ఈ యజ్ఞం చాలించు మఱో విషయం విను నీ తండ్రి వేనుని అపచారం వలన అనేక ధర్మాలూ ఆచారాలూ చెడిపోయాయి ఆ ధర్మాలను తిరిగి

1, 2, 3 అనాడు జైనులు, బౌద్ధులు కాపాలికులు వేఱు.

పాలించడానికే నీవు జన్మించావు. నీవు నారాయణాంశ సంభూతుడవు. కనుక నీవు ఈ నరలోకంలో జనించిన విధానం గుర్తుంచుకో. నీవు బ్రహ్మ చేత ధర్మోద్ధరణం కోసం సృజింపబడ్డావు కనుక ఆ బ్రహ్మ సంకల్పాన్ని అతిక్రమించకుండా ధర్మగతిని పాలించు. ఇంద్రుడు కల్పించిన మాయ అప్రధానాలైన ధర్మాలను కల్పిస్తుంది వేదబాహ్యమైన పాషండ మార్గాన్ని పట్టిస్తుంది. కనుక నీవు ఆ మాయను జయించాలి అందుకోసం నీవు రోషం విడిచి ఇంద్రునితో సఖ్యం చెయ్యడం మంచిది—అని బ్రహ్మ ఉపదేశించేసరికి పృథుచక్రవర్తి 'అలాగే' యని ఇంద్రునితో వైరంమాని యజ్ఞదీక్ష విడిచి అవభృథ స్నానం (దీక్షాంతమందు చేసెడి స్నానం) చేశాడు

అపుడా వైన్యునకు (వేనుని కొడుకు పృథువునకు) బ్రాహ్మణులు దీవనలూ, దేవతలు వరాలూ ఇచ్చి అనుగ్రహించారు. పౌరులు అభినందించారు. యజ్ఞభోక్తా యజ్ఞవిభుడూ సర్వేశ్వరుడూ అయిన శ్రీహరి ఇంద్ర సమేతుడై యచటికి వచ్చి యిలా అన్నాడు—

రాజేంద్రా నీ నూఱవ అశ్వమేధ యాగానికి భంగం కలిగించినందుకు సంతప్తుడై సురేంద్రుడు నిన్ను క్షమాభిక్ష పెట్టమని అర్థించడానికి వచ్చాడు. కనుక ఇతనిని క్షమించు సత్పురుషులకు దేహాభిమానం ఉండదు అందుచేత ప్రాణికోటి యెడల ద్రోహం తలపెట్టరు. ఇక నీలాంటి మహాత్ములు దేవ మాయా మోహితులై ఇతరులకు బాధ కల్పిస్తే వృద్ధ జన సేవనం వ్యర్థం కాదా? అదీకాక ఈ శరీరం అవిద్యా కామకర్మములచేత ఏర్పడినదని తెలిసిన జ్ఞానికి దానియందు (శరీరమందు) ఆసక్తి ఉండదు. దేహాసక్తియే లేనప్పుడు దైహికాలైన గృహదారాదులయందు మమకారం ఎలా ఉంటుందీ?

దేహగతమైన ఆత్మ ఏకం. నిర్గుణం గుణాశ్రయం, స్వయంజ్యోతి, సాక్షిభూతం అది దేహం కంటే భిన్నమైనదని తెలిసికొనినవాడు నన్ను తెలిసికొన గలడు. అతడు దేహధారియైనా అతనిని దైహిక గుణాలు అంటవు. స్వధర్మాన్ని ఆచరిస్తూ నిష్కామంగా నన్ను సేవించే వాని మనస్సు నిర్మలంగా ఉంటుంది అతడు త్రిగుణాలకు అతీతంగా ఉంటాడు. అతనికి కైవల్యం (ఏకాంతస్థితి) సులభ సాధ్యం శరీరగతమైన ఆత్మ నిర్లిప్తమైనదైనా శరీరమందలి ద్రవ్యం జ్ఞానం క్రియా మనస్సు- వీటికి అదే ఈశ్వరుడని తెలుసుకొన్నవానికి పునర్జన్మ ఉండదు

ఈ సంసారం ద్రవ్యం, క్రియ, సంకల్పం, చైతన్యం అనువానితో కూడి యున్నది వేర్వేఱు దేహాలు ఉపాధిగాగలది కనుక సంపదలలోగాని ఆపదల్లోగాని నన్నెఱిగిన వారు వికారం చెందరు. కనుక నీవు జితేంద్రియుడవై సుఖదుఃఖాల్లో సమభావంతో ఉండు మంత్రులను విశిష్టంగా తీర్చి

దిద్ది లోకాన్ని రక్షించు. ప్రజారక్షణం రాజుల పరమ ధర్మం. ప్రజాహితం కోరి రాజ్యపాలనం చేసే నరేంద్రులకు ప్రజలు చేసే పుణ్యంలో ఆఱవపాలు లభిస్తుంది అలా చెయ్యనివాడు ప్రజలుచేసే పాప ఫలాన్ని తాను అనుభవిస్తాడు. అంతేకాదు తాను చేసిన పుణ్యం ఆ ప్రజలకు సంక్రమిస్తుంది

కనుక నీవు బ్రాహ్మణాను మతంలో సాంప్రదాయకమైన ధర్మాన్ని పాటించు ధర్మం నిమిత్తమే అర్థకామాలు సాధించాలి. అయినా ఆ మూటియందు (ధర్మార్థకామాలయందు) నీవు నిర్లిప్తంగా ఉండి జనరంజకంగా సమ చిత్తంలో రాజ్యపాలనం చేస్తే సనకాదులు నీ సదనానికే వస్తారు. రాజేంద్రా యోగంచేతగాని తపస్సుచేతకాని, యజ్ఞాలచేతగాని నేను సులభుడను కాను. నేను సమభావనగల సజ్జనుల హృదయాల్లో వర్తిస్తూ ఉంటాను. నీ శాంత స్వభావం, నీ మాత్సర్య రహితబుద్ధీ, నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. అంచేతనే నేను నీకు వశుడనయ్యాను. నేను నీకొక వరం ఇస్తాను. అడుగు— అని పుండరీకాక్షుడనే సరికి—

పృథుచక్రవర్తి శ్రీహరి ఆ మధురోక్తులను శిరసావహించాడు. అపుడు ఇంద్రుడు తాను చేసిన పనికి సిగ్గుపడి పృథునరేంద్రుని పాదాలపై వ్రాలాడు. పృథుచక్రవర్తి అతని ప్రేమభావంతో గాఢంగా కౌగిలించుకున్నాడు. అనంతరం పృథుచక్రవర్తి శ్రీహరి పూజించి ఆయన పాదాంభోజాలకు నమస్కరించాడు అపుడు ఆ దేవదేవుడు తిరిగి వెళ్ళిపోవడానికి సంసిద్ధుడైయుండిన్నీ ఆ రాజేంద్రునిపైగల వాత్సల్యంచేత కొంత విలంబం చేసేసరికి ఆ ఆది రాజన్యుడైన పృథువు కన్నులు ఆనంద బాష్పాలతో నిండిపోయాయి. అంచేత తన యెదుటనే ఉన్న ఆ పరంధాముని చూస్తూకూడా చూడలేకుండా ఉన్నాడు కంఠం గద్గద మవడంచేత ఏదో పలుకరించాలని అనుకొనికూడా పలుకరించలేకుండా ఉన్నాడు. తుదకెలాగో ఆ దేవుని తన హృదయంలోనే కౌగిలించుకున్నాడు ఆయనలో తాదాత్మ్యం చెందాడు. కనులనుండి స్రవించెడి ఆనందాశ్రువులను తుడుచుకొన్నాడు నేలపై పాదాలు మోపి* గరుడునిపై చేతినుంచి తనయెదుట నున్న శ్రీహరిని గని యిలా అన్నాడు—

ఈశ్వరా! సత్పురుషుడు ఐహిక భోగాలను ఆశించి నిన్ను వరం అడగడు. ఎందుకంటే మానవుడనుభవించెడి దైహిక సుఖాలన్నీ కృపానము

---

* దేవతలు నేలను స్పృశించరు కాని దేవేశుడైన శ్రీహరి నేలపై పాదాలు మోపి పృథువు నెదుట నిలబడ్డాడంటే మహాభక్తుడైన పృథువుపైగల ప్రేమాతిశయం చేత మైమఱచి అలా చేశాడని భావించాలి

ద్రుడవైన నీ ప్రసాదాలే అవి ఎక్కడున్నా, తుదకు నరలోకంలో ఉన్నా లభిస్తాయి. అయితే మోక్షం అడగరాదా అంటే నాకు అదీ అక్కరలేదు ఎందుచేతనందువా? అక్కడ మహాత్ముల రసనాంచలం నుండి వెల్వడు నీ పాదకుల మరందాన్ని తనివితీర గ్రోలి నిన్ను కీర్తించెడి అదృష్టం లభించదు. కనుక నేను అలాంటి కైవల్యపదాన్ని కూడా కోరను ఇక నీ యశోగానం వినేందుకు నాకు పదివేల చెవులు అనుగ్రహించు నాకదిచాలు

అనఘా! మహాత్ముల వాక్కులనుండి స్రవించెడి నీ చరణామృతకణాల మీదుగా వీచెడి గాలి సోకితే చాలు తత్త్వమార్గాన్ని మరిచిన దుష్టయోగులకు కూడ తిరిగి పూర్వస్మృతి కలిగి తత్వజ్ఞానం బోధపడుతుంది. కనుక నీ పాదాంబుజసేవనం తప్ప నాకు ఇతర వరాలు అక్కరలేదు.

సర్వేశ్వరా! నీవు సుగుణాకరుడవు. నీ సుగుణాలను కాంక్షించి లక్ష్మి దేవి నిన్ను వరించింది. అట్టి అదృష్టం సజ్జనసాంగత్యం వల్ల లభిస్తుంది ఎవ డైనా యాదృచ్ఛికంగానైనా నీ గుణసంకీర్తనం చెవులారా వింటే వాడు నిన్ను విడువడు అలా విడిస్తే అతడు పశుతుల్యుడౌతాడు కనుక నేనున్నూ లక్ష్మీదేవిలాగా కుతూహలంతో నిన్ను సేవిస్తాను. అయితే ఒకే విషయమందు ఆసక్తిగల మా యిరువురకును పరస్పర స్పర్థ కలుగవచ్చును అపుడు మేమి ద్దరమూ ఒకరి తర్వాత నొకరు నిన్ను సేవించేలా అనుగ్రహించి మాకు కలహం లేకుండా చూడు. అది సాధ్యం కాదంటావా! నేను ఆమెతో కలహాని కైనా సిద్ధపడతాను కాని నీ చరణసేవ మాత్రం విడువను. ఎందుచేతనంటే నీవు దీన వత్సలుడవు. దీనుని యందు ఏ స్వల్పగుణం ఉన్నా దాన్ని పెద్దగా చేసీ అనుగ్రహిస్తావు ఇంద్రునితో నాకు కలహం వచ్చినపుడు నీవు నా యందు పక్షపాతం చూపలేదూ అలాగే ఒకవేళ నాకూ లక్ష్మీదేవికి కలహమే అనివార్యమైతే నీవు దీనుడనైన నా పక్షమే వహిస్తావు. నన్ను ఆదరించినట్లు నీవు ఆమెను ఆదరించవు

ఆ కారణంచేతనే విజ్ఞులు మాయాగుణాతీతుడవైన నిన్ను యజిస్తారు. నిరంతరం నీ చరణ కమలాలను స్మరించడం తప్ప ఇతర ప్రయోజనం కోరరు అలాంటి నీ భక్తులను వరాలు వేడుదని అనడం నీవు వారికి వ్యామోహం కల్పించి వారిని పరీక్షించడానికే నీ తీయని మాటలనెడి తీవ లచే బద్ధులై మానవులు ఫలాపేక్షతో ప్రవృత్తి కర్మలు చేస్తారు నీ మాయకు వశంవదులై నీకంటె ఇతరమైన దాని నేకారణంచేత కాంక్షిస్తారో తెలియదు. కనుక తండ్రి బిడ్డకు తనంతట తాను హితం ఆచరించునట్లు నీయంత నీవే నాకు హితం చెయ్యి- అని పృథుచక్రవర్తి అర్థవంతంగా పలికేసరికి నారాయ ణుడు సంతోషించి యిలా అన్నాడు-

రాజేంద్రా! దైవప్రేరణచే నీకు నాయందు ఇలాంటి బుద్ధి పుట్టింది. దానివలన నీకు నిశ్చలమైన భక్తిభావం ఏర్పడుతుంది దానితో నీవు దుస్తరమైన నా మాయను తరిస్తావు నేను ఆదేశించినట్లు నీవు చేస్తే నీకు సకల శుభాలూ కలుగుతాయి. నా భక్తులు స్వర్గాన్నీ, మోక్షాన్నీ, నరకాన్నీ కూడా సమంగానే పరిగణిస్తారు. నీ నిశ్చయం కూడా అలాంటిదే నీవు నామాట విని రోషం త్యజించావు. నాయందు భక్తిని అలవరచుకున్నావు. నాకు ఎంతో ఆనందం కలిగింది- అని అతణ్ణి అభినందించి అతని పూజలందుకుని వెళ్ళడానికి సిద్ధమయ్యాడు. అపుడు ఆ నరేంద్రుడు అక్కడ సమావిష్టులైన సుర ముని గంధర్వ కిన్నరాదులను, శ్రీహరి పార్శ్వచరులను, ఇతర పౌర జానపదులను యథోచితంగా సత్కరించాడు. అలా శ్రీహరి చింతనుడైన పృధు రాజేంద్రునిచే సత్కృతులై వారు నిజ నివాసాలకు వెళ్ళిపోయారు శ్రీమన్నారాయణుడున్నూ దేవతలు జయధ్వానాలు చేస్తూండగా వైకుంఠానికి వెళ్ళిపోయాడు.

అనంతరం పృధుచక్రవర్తి తనయెదుట అలా సాక్షాత్కరించి తనను అనుగ్రహించిన వాసుదేవునకు నమస్కరించి నిజనగరానికి వెళ్ళాడు. రాజేంద్రుని రాకను పురస్కరించుకొని పౌరులు నగరాన్ని నేత్రానందకరంగా అలంకరించారు ముత్తెపుసరులతోను పుష్పమాలికలతోను కాంచన తోరణాల తోను రాచబాటలు మనోహరంగా వున్నాయి సుగంధధూపాల పరిమళం గుబాళిస్తోంది రథ్యల్లో రంగవల్లికలు (ముగ్గులు) నయనపర్వంగా ఉన్నాయి ప్రతీగృహప్రాంగణం ఫలపుష్పాక్షతలతోను దీపమాలికలతోను అరటి బోదెలతోను పోకచెట్లతోను మనోహరంగా ఉంది వీథుల్లో కస్తురి పచ్చ కప్పురం పన్నీరు మొదలైన పరిమళద్రవ్యాలు ఘ్రాణతర్పణం చేస్తూన్నాయి

చక్రవర్తి సర్వాలంకారశోభితంగా ఉన్న నగరంలో అడుగు పెట్టేసరికి పురకాంతలు రత్నకుండల మణికాంతులు చెక్కిళ్ళకు క్రొత్త శోభనాన్ని కల్పించగా ఎదురు వచ్చి స్వర్ణపాత్రికలతో మంగళ నీరాజనాలు ఇచ్చారు ఋత్విక్కులు ఆశీస్సులందించారు వంది మాగధులు కైవారాలు చేశారు పౌరులు కానుకలువెట్టి ఆనందించారు. పృధు చక్రవర్తి వారందరినీ యథోచితంగా సత్కరించి గర్వరహితుడై అంతఃపురంలో ప్రవేశించాడు అనంతరం ఆ నరేంద్రుడు అనింద్యములైన హత్తరకర్మలెన్నో ఆచరించాడు. జనరంజకంగా భూమండలాన్ని పాలించాడు స్వచ్ఛమైన తనకీర్తి చంద్రికలను భూమండలం నలుమూలలా వ్యాపింపజేశాడు తుదకు ఏ విధమైన చింతా లేకుండా పరమపదం చెందాడు'

అని మైత్రేయుడనేసరికి విదురుడు ఆ మహర్షిని పూజించి- మునీంద్రా! పృథుచక్రవర్తి అవనీసురులచేత రాజ్యాభిషిక్తుడై దేవగణంచేత సద్గుణాలు

పొంది, వైష్ణవతేజం ధరించి రాజ్యపాలనం చేశాడని అన్నారు కదా ఆతడా చరించిన మహత్తర కార్యాలేవి? అతని పరాక్రమం వలన భూమి గోరూపంలో సకలసంపదలను పిండి ప్రశస్తి గాంచింది అతని మార్గాన్ని అనుసరిస్తూ రాజులందరు ఇప్పటివరకు సుఖంగా జీవితాలు గడుపుతున్నారు అటువంటి మహానుభావుడైన పృథుచక్రవర్తి చరిత్ర సాకల్యంగా వినాలని కుతూహల పడనివాడెవడుంటాడు?' —అనేసరికి మైత్రేయుడు విదురునితో ఇలాఅన్నాడు—

'విదురుడా! ఔను ఆ చక్రవర్తి చరిత్ర పవిత్రమైనది అతడు మహా కీర్తిశాలి. రాజన్యులందరు ఆ తొలిసార్వభౌముని వేనోళ్ళ నుతిస్తారు. ఉత్తుంగ తరంగాలతో ఎంతో మనోజ్ఞంగా ప్రవహించెడి గంగా యమునల మధ్యప్రదేశం ఆ రాజన్యుని నివాసభూమి. ఫలాపేక్షతో అతడు నూతన కర్మ లేవీ అనుష్ఠించక పూర్వకర్మాయత్తములైన భోగాలను మాత్రమే అనుభవిస్తూ ఏడుదీవులను ఏకాతపత్రంగా పాలించాడు ఆతని యాజ్ఞకు ఎదురులేదు విష్ణుభక్తులనూ, విప్రగణాన్నీ విడిచి తక్కిన ప్రజలయెడ దండధరుడులాగా వర్తించేవాడు

అలా కొంతకాలం రాజ్యపాలనం చేశాక ఆ రాజేంద్రుడు దీర్ఘసత్ర యాగం చెయ్యడానికి దీక్షవహించాడు ఆ యాగానికి రాజర్షులు, దేవర్షులు బ్రహ్మర్షులు పితృదేవతలు అందరు వచ్చారు పృథుచక్రవర్తి వారందరిని యథావిధిగా పూజించాడు యజ్ఞదీక్షితుడు కనుక అతడు మణికాంచ నాభరణాలు ధరించక పోవడంచేత అతని అవయవాల సహజశోభ స్పష్టంగా గోచరిస్తోంది

అతని భుజాలు ఎత్తుగా ఉన్నాయి ముఖం శోభావహంగా ఉంది కనులు వికసించిన ఎఱ్ఱదామరలులాగా ఉన్నాయి నాసికా పుటాలు చక్కగా ఉన్నాయి. పెదవులపై మందహాసం తొణికిసలాడుతోంది. అతని నల్లనిజుట్టు వంపులు తిరిగి ముచ్చటగా ఉంది కంఠం శంఖంలాగా ఉంది. వక్షస్థలం విశాలంగా ఉంది పొట్టమీద మూడు ముడుతలున్నాయి. విశాలమైన జఘన భాగంతో, సుడిగుండంలాంటి నాభితో కాంచన స్తంభాల్లాంటి ఊరువులతో, ఎఱ్ఱని పాదాలతో ఆ రాజేంద్రుడెంతో మనోజ్ఞంగా ఉన్నాడు

అతడు కృష్ణాజినం ధరించి చేతిలో దర్భలు పట్టుకొని చల్లని చూపులతో అంతటినీ తనియిస్తూ సభామధ్యంలో నిలబడి నక్షత్రాల నడుమ చంద్రుడులాగా ప్రకాశిస్తూ అర్థవంతములూ, చమత్కార భరితములూ అయిన వాక్కులతో ఇలా అన్నాడు—

సదస్యులారా! వినండి ధర్మం తెలుసుకోవాలనుకున్నవాడు తన మనోభావాన్ని ధీరులైన వారియెదుట వెల్లడించాలి. ఈ లోకాలను శాసిస్తూ

ప్రజలకు తగిన వృత్తులు కల్పించి, వర్ణాశ్రమ ధర్మాలను రక్షించడానికి నేను బ్రహ్మచేత నియోగింపబడ్డాను. ప్రజారంజకంగా రాజ్యపాలనం చెయ్యడం నా విహితధర్మం నేను నా విధిని ఎలా అనుష్ఠించినదీ కర్మసాక్షియైన ఈశ్వరుడు చూస్తూవుంటాడు. కనుక అతనికి పరితోషం కలగడం ముఖ్యం. అలా అతని సంతుష్టికి పాత్రుడైనవానికి ఏ లోకాలు లభిస్తాయని బుధులంటారో, అన్ని కోర్కెలను దీర్చేటి ఆ లోకాలు నాకు లభిస్తాయి. ఎందుకంటే నేను నా విధిని ధర్మబద్ధంగా అనుష్ఠించాననే విశ్వాసం నాకుంది.

ప్రజలను ధర్మమార్గంలో అనుశాసించక కేవలం అర్థకామాలను దృష్టిలో ఉంచుకొని వారినుండి కప్పములు గ్రహిస్తే వారు చేసెడి పాపాలు రాజుకు సంక్రమిస్తాయి అపుడాతడు తేజోహీనుడై చెడిపోతాడు కనుక ప్రజలు ధర్మమార్గంలో చరిస్తూ అసూయారహితులై వాసుదేవార్పణంగా స్వీయ కర్మాచరణం చేస్తే వారికేకాక వారిని పాలించెడి రాజుకు కూడా శ్రేయస్సు లభిస్తుంది. మీరలా చేస్తే మీకు నాయందు అనుగ్రహం కలదని నేను భావిస్తాను మీరందరు నాకు పితృదేవతలతోను, దేవర్షులతోను సమానులు కనుక మీరందరు అనుమోదించి మిమ్మల్ని అనుశాసిస్తున్న నాకు పరలోకంలో ఎటువంటి ఫలం లభింపదగినదో దానికి అనుగుణమైన కర్మాచరణం చెయ్యండి అపుడు నేను సంతోషిస్తాను— అని రాజేంద్రుడైన పృథువు అనేసరికి సదస్యులు—జననాయకా! ప్రజలు వాసుదేవార్పణంగా ధర్మాలు చెయ్యాలన్నావే భూమండలంలో నీవుగాక వాసుదేవుడెవరు?— అన్నారు

ఆ మాటవిని పృథుచక్రవర్తి యిలా అన్నాడు—మీరందరు యోగ్యులు ధీమంతులు నేచెప్పేది సావధానంగా వినండి. యజ్ఞాలకు అధిపతియైన అఖిలేశ్వరుడున్నాడని కొందరు లేదని కొందరు అంటారు కాని ఉన్నాడనెడి వారి మతమే సమంజసం. ఎందుకంటే మన కనులయెదుట కాంతివంతమైన జగత్తు కనబడుతోంది. ఈ సృష్టిని చెయ్యడానికి నిత్య సత్తాకుడైన ఈశ్వరు డొకడుండాలి అని అనుమాన ప్రమాణంచేత మనం భావించాలి అంతేకాని ఈ జగద్వైచిత్ర్యం కర్తతో నిమిత్తం లేకుండా కర్మ వశంచేత సహజంగానే విరచితమైనదని భావించడం హేతుబద్ధంకాదు కర్మ అచేతనం. జీవుల సుకృత దుష్కృతాలనుబట్టి మోక్షంగాని నరకంగాని ఇచ్చేశక్తి దానికిలేదు.

ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు, ధ్రువుడు నా పితామహుడైన అంగరాజు, నారదుడు, ప్రహ్లాదుడు, బలి మొదలైన భాగవతుల ఆప్తవాక్యరూపమైన వేదప్రమాణాన్ని బట్టి కూడా జీవకోటికి యోగ్యతా యోగ్యతల ననుసరించి మోక్షంగాని నరకంగాని ఇచ్చెడి ఈశ్వరుడొకడున్నాడని విశ్వసించి తీరాలి.

కనుక వాసుదేవుని అస్తిత్వాన్ని గూర్చి శంకించక ఆ దేవదేవుని పాద పద్మాలను సేవిస్తే పూర్వజన్మార్జితాలైన సంసార తాపాలు నశిస్తాయి. శ్రీహరి పాదసేవారతి హరిపాదోద్భవియైన గంగిలాగా సమస్త మనస్తాపాలనూ శమింపజేస్తుంది వైరాగ్యం కరతలామలకం అవుతుంది సర్వశక్తి సమన్వితు డైన నారాయణుడే ఈ జగత్తునకు ఆధారభూతుడు. అతడు అద్వితీయుడు

కనుక మీరు మీమీ అధికారాన్నిబట్టి కపటం లేకుండా.మనోవాక్క్రియ లతో నతులు వినతులూచేస్తూ ఈశ్వరుని పాదకమలాలను యజించండి. ఆయన చరణ కమలసేవనం అన్ని కోర్కెలు తీరుస్తుంది. ఈశ్వరుడు స్వరూపంచేత విశుద్ధ విజ్ఞానఖని. అతడు నిర్గుణుడు అయత్నంగానే అతని యందు కర్మమార్గం ప్రవృత్తమౌతుంది దానివలన నతడు నానావిధ గుణ శిష్టుడై వ్రీహి (ధాన్యం) మొదలైన ద్రవ్యాలూ, తెలుపు మొదలగు గుణాలు, అవఘాతాది (దంచుట మున్నగు) క్రియలూ, మంత్రాలూ, యాగసాధ్యమైన ఫలమూ, సంకల్పమూ పదార్థశక్తి మొదలగు విభిన్న పరికరాలచేత జ్యోతి ష్టోమాదినామాలతో యజ్ఞ స్వరూపమై ప్రఖ్యాతి చెందుతాడు.

దారువు (కొయ్య) నందు రగుల్కొనిన అగ్ని ఆ దారువుయొక్క గుణాలైన దైర్ఘ్యం, వక్రత్వం మొదలగు వానిని అనుసరిస్తుంది అంటే అది దీర్ఘంగా ఉన్నప్పుడు దీర్ఘంగా, వక్రంగా ఉన్నపుడు వక్రంగా కన్పబడుతుంది అంతేకాని వాస్తవంగా అగ్నికి దారుగతాలైన గుణాలు ఏమాత్రమూ చెందవు. అలాగే శరీర సంబంధం కలిగినంత మాత్రాన ఈశ్వరునకు శరీరగత దోషాలు అంటవు అతడు ఆనందమయుడు. నిరంతరం నా ప్రజలు స్వ ధర్మాన్ని పాటిస్తూ యజ్ఞ స్వరూపుడూ యజ్ఞభోక్తా అయిన సర్వేశ్వరుని సేవిస్తూ నన్ననుగ్రహిస్తున్నారు—అని హరిభక్తి నిరతులైన మహాత్ములను ప్రశంసించి ప్రథుచక్రవర్తి ఇంకా ఇలా అన్నారు—

రాజులు తమ క్షాత్ర తేజాన్ని తపోనిరతులైన బ్రాహ్మణులయందు, హరిభక్తులయందు ప్రకటింపరాదు శ్రీహరికూడా బ్రాహ్మణుల పాదాంబుజ రేణువులను తలదాల్చి తననెప్పుడునూ విడువని లక్ష్మిని, కీర్తిని పొంది యున్నాడు. కనుక బ్రాహ్మణులను అందఱు ఉదాత్త బుద్ధితో సేవించాలి. అలాచేసే వారికి అశేషగుణాలు లభిస్తాయి. సర్వేశ్వరుడు సంతుష్టుడౌతాడు జ్ఞాన సంపత్తి లేకపోయినా ధరాదేవతలను సేవించడం వలన అంతరంగం పరిశుద్ధమౌతుంది. కైవల్యపదం కరతలామలక మౌతుంది.

ఈశ్వరుడు, తత్వజ్ఞాన సంపన్నులైన బ్రాహ్మణుల ముఖమున హంత ముతైన హవిస్సులతో సంతుష్టుడైనట్లు అచేతనమైన అగ్నిముఖమున వ్రేల్చిన హవిస్సులతో తృప్తుడు కాడు. ఎంచేతనంటే అగ్ని ముఖంకంటే భూసురుల

ముఖం పవిత్రమైనది. కనుక అందరు భూసురార్చనం చెయ్యాలి. అద్దంలో ప్రతిబింబించేది వస్తుసమూహంలాగా సమస్త విశ్వమూ వేదంలో ప్రకాశిస్తుంది. వేదం రజోవిరహితమైనది. అవ్యయమైనది. సనాతనమైనది. అలాంటి వేదాన్ని ధరా దేవతలు అనుదినమూ శ్రద్ధతో అధ్యయనం చేస్తూ ఉంటారు. సదసద్వినిర్ణయం చేయగల అధికారం వారికే ఉంటుంది. అటువంటి వారి పాదధూళిని శిరస్సున దాల్చేది అల్పులకున్నూ పాపక్షయం అవడమే కాక సకల సద్గుణాలూ ప్రాప్తిస్తాయి. అంచేతనే నేను బ్రాహ్మణ పాద కమల రేణువులను నా కిరీటమందు ధరిస్తాను. కనుక గోబ్రాహ్మణ కులమున్నూ, జనార్దనుడున్నూ నా యెడ ప్రసన్నులయ్యెదరుగాక—అని పృథు పనగా, అచటనున్న దేవతలు పితృదేవతలు, భూదేవతలు, సంతుష్టాంతరంగులై సాధు వాదాలతో ఆ రాజేంద్రుని అభినందించి యీ రీతిగా అన్నారు—

మనుజేంద్రా! 'పుత్రేణలోకాన్‌జయతి'* అను వేదవచనాన్ని అనుసరించి, పాపవర్తనుడై బ్రహ్మదండహతుడైన వేనుడు నీమూలాన నరకకూపం నుండి బయటపడ్డాడు. అలాగే హిరణ్యకశిపుడు శ్రీహరిని నిందించడం వలన నరకగతుడు కావలసియున్నా, భాగవతోత్తముడైన అతని కుమారుని ప్రభావంచేత పాపవిముక్తుడై నిర్మలకీర్తి వహించాడు- అని పలికి వారు పృథువును చిరకాలం జీవించుమని ఆశీర్వదించి యింకా ఇలా అన్నారు-

దేవా శ్రీహరియందు నీకు అపారమైన భక్తి ఉంది. బ్రహ్మణ్య దేవుడూ, ఉత్తమశ్లోకుడూ అయిన ఆ దేవదేవుని కథలను నీవు వ్యక్తం చేస్తుంటావు. అలాంటి నీవు మాకు ప్రభుడవు కావడంవల్ల మేమున్నూ హరి భక్తులమైనాం. కారుణ్యమూర్తులైన మహాత్ములకు ప్రజానురంజకంగా రాజ్య పాలనం చెయ్యడం స్వభావం. అందులో ఆశ్చర్యమేమిన్నీ లేదు. మేము వివిధ దేవతలను అధికరించి వివిధకర్మలు ఆచరిస్తూ జ్ఞానదూరులమై చీకటిలో పరిభ్రమిస్తూన్నట్లుంటాము. ఇప్పుడు మాకు కనువిప్పుకలిగింది. సర్వేశ్వరుడు బ్రాహ్మణ జాతియందుండి క్షత్రియులనూ, క్షత్రియజాతియందు మూర్తీభవించి బ్రాహ్మణులనూ, ఈ ఉభయాన్ని అధిష్ఠించి లోకాన్ని భరిస్తాడు. నీవు సాక్షాత్తూ అలాంటి సత్వశక్తి స్వరూపుడవు. కనుక మేము నిన్ను ఈశ్వర బుద్ధితో సేవిస్తాం. -అని వారు పృథువునకు నమస్కరిస్తూండగా ఆకాశం నుండి బాలసూర్యునివంటి తేజంతో మహాసిద్ధులూ మహాజ్ఞానులూ అయిన సనకాదులు మెల్లగా దిగివచ్చారు.

---

* (గుణవంతుడైన) పుత్త్రునివలన తండ్రి లోకాలను జయిస్తాడు.

# పృథువు దగ్గఱకు సనకాదులు•రావడం

పుణ్యాత్ములైన సనకాదులలా అతిథి రూపంలో రాగా యజమానియైన పృథు చక్రవర్తి ప్రాణాలు ఆనందోత్సాహంతో పైకి లేచాయి అలా లేచిన ప్రాణాలు ప్రత్యుద్గమన (లేచి యెదురు వెళ్ళుట) వందనాదికంతో తిరిగి యథాస్థానంలో ప్రతిష్ఠితమ్ము లౌతాయనెడి ఆర్యోక్తి ననుసరించి ఉద్గతాలైన ప్రాణాలను తిరిగి పొందగోరిన వానివలె పృథుచక్రవర్తి తన అనుచరులను, ఋత్విక్కులను, సదస్యులను వెంటబెట్టుకొని, ఇంద్రియాధిపతియైన జీవుడు గంధాదిక గుణములచే ఆకృష్టుడై శరీరమునుండి లేచి వచ్చునట్లు తొట్రుపాటుతో వారికి ఎదురువెళ్ళి వినయభావంతో వారి మనస్సులను చూఱగొన్నారు. అనంతరం వారిని సుఖాసీనులను చేశాడు విధిచోదితంగా వారిని పూజించాడు. వారి పాదాంబుజాలను కడిగి ఆ నీటిని తన తలపై చల్లుకొన్నాడు.

స్వర్ణసింహాసనాల మీద కూర్చుండి శివుని అగ్రజన్ములైన సనకాదులు అగ్నుల్లాగా వెలుగుతున్నారు. అపుడు రాజు సంతుష్టాంతరంగుడై వారిని జూచి యిలా అన్నారు-

సకలశుభాలకు స్థానభూతులైన మహాత్ములారా! నేను పూర్వజన్మలో ఏ శుభకర్మ చేశానో ఈనాడు మిమ్మల్ని చూడగలిగాను. బ్రాహ్మణులు, హరిహరులు, వారి భక్తులు ఎవని యెడల ప్రసన్నులౌతారో వారికి ఇహ పర లోకాల్లో అసాధ్యమైనది ఏదీ ఉండదు. పుణ్యాత్ములారా! మీరు నిరంతరం సర్వలోకసంచారం చేస్తూ ఉంటారు. అయినా లోకులు మిమ్మల్ని చూడలేరు అంతటి మహాత్ములైన మీ దర్శనం లభించడం వలన నేను ధన్యుడనయ్యాను. తనకుగల సర్వసంపదలనూ అర్హులైన అతిథులకు వినియోగించడం వలన గృహమేధి ఒకవేళ పేదయైనా అతడు ధన్యుడే. అలాకాక భక్తజనులకు ఉపభోజ్యాలు కాని ఎన్ని సంపదలున్నా ఆ యిళ్ళు సర్పాలతో నిండిన చందన వృక్షాలతో సమానాలు.

పరమపావనులారా! బాల్యంనుండి మీరు శ్రద్ధా సమన్వితులు, గుణ నిధులు, మోక్షకాంక్షులు. మీరు ఆచరించని వ్రతంలేదు. మీకు నా స్వాగతాంజలి. వ్యసన సముద్రమైన సంసారంలో బుద్ధివిహీనములైన స్వీయ కర్మములు కారణంగా మునిగి ఇంద్రియార్థాలనే పురుషార్థాలుగా భావించెడి మాకు క్షేమమెక్కడిది?

---

•సనకాదులు— సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు (నల్గురు)

మీరు లోకైక కుశలురు. ఆత్మారాములు మీయందు కుశలా కుశల రూపములైన చిత్తవృత్తులు సంభవించవు. అంచేతనే మిమ్ములను కుశల ప్రశ్నంచెయ్యడం అనుచితం. సంతప్తులైన వారికి మీరు సుహృత్తులు (మిత్రులు) కనుక మీయందు నాకు గల సంపూర్ణ విశ్వాసంతో ప్రశ్నిస్తున్నాను. చెప్పండి. ఈ సంసార సాగరంలో మునిగి తేలుతూన్న నాకు దేని వలన శీఘ్రంగా క్షేమం కలుగుతుంది? ఈశ్వరుడు భక్తానుగ్రహంకోసం మీ వంటి సిద్ధజనుల స్వరూపంతో తిరుగుతూ ఉంటాడు- అని పలికేసరికి, గభీరార్థ గౌరవములు, శుభంకరములు, న్యాయ సమ్మతములు, పరిమితాక్షరములు, శ్రుతి మధురములు అయిన ఆ రాజేంద్రుని భాషణములు విని సంప్రీతుడై సనత్కుమారుడు మందస్మితం చేస్తూ ఇలా అన్నాడు-

రాజేంద్రా! సర్వభూతహితం కాంక్షించి ధర్మనిరతుడవైన నీవు చక్కని ప్రశ్న వేశావు. ముల్లోకాల్లో సాధుజనులచరిత్ర ఇలాగే ఉంటుంది. సజ్జన సాంగత్యం ఉభయ సమ్మతం. వారి సంభాషణమూ, ప్రశ్న సరణీ సమస్త జనులకు సుఖకరంగా ఉంటాయి- అని సనత్కుమారుడు పృథునరేంద్రుని అభినందించి మోక్షసాధనం ఉపదేశించమని అర్థించిన అతనికి ఇంకా ఇలా అన్నాడు-

నరేంద్రా! నిరంతర నారాయణ పదధ్యానంచేత నీ బుద్ధి పరిణతమై ఆత్మదోషాలను నిర్మూలించెడి భక్తివైరాగ్యాలు నీకు కలిగాయి. నీవు లోకోత్తరుడవు. ఆత్మవ్యతిరిక్త వస్తువుల దు అనాసక్తి, నిర్గుణబ్రహ్మయైన ఆత్మయందు ఆసక్తి, ప్రజాసంక్షేమానికి హేతువులు. శాస్త్రాల్లో కూడా ఇదే నిశ్చయింపబడ్డది. మోక్షప్రాప్తికి ఇంకా ఉండవలసిన లక్షణాలూ, పాటింపవలసిన విధులూ, చెపుతాను విను.

అన్నిటి కంటె ముఖ్యమైనది శ్రద్ధ. సాధకుడు నిరంతరం భగవత్సంబంధమైన ధర్మాచరణం చెయ్యాలి జిజ్ఞాస ఉండాలి ఆధ్యాత్మిక యోగనిష్ఠ కలిగి నిరంతరం యోగీశ్వరులను సేవించాలి. నిత్యమూ శ్రీహరి కథాగానం చెయ్యాలి. ఇంద్రియ సుఖలోలురతో చెలిమి చేయకూడదు. అర్థకామములందు ఆసక్తి తగదు. ఆత్మారాముడవై ఏకాంత వాసముందు ప్రీతికలిగి ఉండాలి. అహింసను పాటించాలి. శమదమాది గుణాలు కలిగి యమ నియమాలు పాటించాలి. ఇతరుల భక్తి మార్గాలను నిరసించరాదు. శీతోష్ణాది ద్వంద్వాలను లెక్కచేయకుండా సహించాలి. భగవద్భక్తుల చెవులకు ఇంపుగా ఉండేలాగా భగవంతుని గుణాలను అభివర్ణించాలి. భక్తి యోగమందు అభిరుచిని పెంచుకొని ఆత్మేతర వస్తువులందు సంగం విడనాడాలి నిర్గుణ బ్రహ్మమందు నిరతి కలిగి ఉండాలి. బ్రహ్మనిష్ఠులతో సాంగత్యం చెయ్యాలి. దారసుతాదులందు

గాని ధనాదికమందు కాని కోర్కెలు అణచివేసుకోవాలి. అపుడు జ్ఞాన వైరాగ్యాలు కలిగి మోక్షం సులభ సాధ్యమౌతుంది - అని సనత్కుమారుడింకా ఇలా చెప్పడం మొదలు పెట్టాడు.

మనుజేంద్రా! అరణి యందు జనించిన అగ్ని ఆ అరణికూడా దహించి వేస్తుంది. అలాగే దేహ సాధనచేసి సాక్షాత్కరింపజేసికొన్న భక్తియోగాగ్ని పంచభూతాత్మికమైన దేహాన్ని దగ్ధం చేస్తుంది. అపుడు దేహగుణాలైన రాగాది చిత్త వృత్తులు నశిస్తాయి ఆత్మ ధర్మం మాత్రం మిగులుతుంది కలలో ఏవేవో కనిపించి సుఖదుఃఖాలు కల్పిస్తాయి. కాని మెలకువ వచ్చినంతనే అదంతా మిథ్య అని తెలుస్తుంది. అదే విధంగా బాహ్యాంతరగుణ భేదాలన్నీ ఆత్మజ్ఞానోదయం కావడంతో మాయమైపోతాయి.

ఆత్మ ద్రష్ట. ఇంద్రియార్థం దృశ్యం. ఈ రెంటికి సంబంధాన్ని కల్పించేది అహంకారం. అది అంతఃకరణంతో ముడివడి ఉంటుంది. జాగ్రదవస్థలోను, స్వప్నావస్థలోను తాను వేఱు, తాను చూచెడిది వేఱు అను భ్రాంతి కలుగుతుంది. కాని నిద్రావస్థలో ఈ భేదభావం గోచరించదు. ఎందుకంటే నిద్రలో అంతఃకరణం (మనస్సు) ఉండదు.

నీటిలోగాని అద్దంలోగాని చూచినపుడు తన ప్రతిబింబం కనబడుతుంది. అపుడు తాను తన కన్న వేఱనెడి భ్రాంతికలుగుతుంది. నీరు లేనప్పుడూ, అద్దాన్ని తొలగించినపుడూ ప్రతిబింబం మాయమవుతుంది. అలాగే మనోలయం చేసినపుడు బాహ్యాంతర భేదం గోచరించదు.

మడుగులో మొలిచిన బెల్లుదుబ్బులు, దర్భలు ఆ మడుగులోని నీటిని క్రమంగా హరిస్తాయి. అలాగే విషయాసక్తమైన మనస్సు అంతరమైన భావనా సామర్థ్యాన్ని హరిస్తుంది. భావనాసామర్థ్యం ఎప్పుడైతే తరిగిపోతుందో పూర్వాపరాలను అనుసంధానంచేసెడి శక్తిగల స్మృతి నశిస్తుంది. స్మృతి నశిస్తే జ్ఞానం నశిస్తుంది. ఈ జ్ఞాన నాశనాన్నే ఆత్మతిరోధానం (ఆత్మ మరుగుపడుట) అంటారు.

'ఆత్మనస్తు కామాయసర్వం ప్రియంభవతి'*- అని వేదోక్తి, ఆత్మ, స్వస్వరూపాన్ని విడిచి విషయ వాసనలకు లోనైతే అంతకంటె మహానర్థం ఇంకోటి ఉండదు. ఇంద్రియసుఖాల యందలి ప్రీతివలననూ, వాటి నిరంతర చింతనం వలననూ, మానవుని చిత్తం శాస్త్రజన్యమైన జ్ఞానం నుండీ ఉపాసనాత్మకమైన జ్ఞానం నుండీ భ్రష్టమై జడత్వం పొందుతుంది.

ఈ మహానర్థం నుండి బయటపడాలనుకొనేవాడు పురుషార్థాలను భంగించే దేనితోనూ సంబంధం పెట్టుకోరాదు. ఆ పురుషార్థాల్లో ధర్మార్థ

---

* కోరిక కోసం ఆత్మకు (తనకు) సమస్తం ప్రియమగుచున్నది.

కామాలు మృత్యుభయం నుండి తప్పించలేవు. కనుక మోక్షమే ముఖ్యం. గుణవ్యతికరం వలన పుట్టిన బ్రహ్మాదులకూ, మావంటి వారికి కూడ మృత్యువు తప్పదు. కనుక మోక్షమే పరమపురుషార్థం.

దేహం, ఇంద్రియాలు, ప్రాణం, బుద్ధి, అహంకారం- వీటిచే పరివృత మైన స్థావర జంగమాలన్నింటి హృదయాల్లో ఈశ్వరుడు సర్వాంతర్యామి రూపంలో ప్రకాశిస్తూ ఉంటాడు. అతడొక్కడే సత్యస్వరూపుడు. అతడు మహా పురుషులకు అలంకారప్రాయుడు. సమస్త సృష్టిజాలం అతనిలో లీలా వినోదంగా ఉండీ ఉండనట్లు భావన కల్పిస్తుంది. అతడే తన మాయావిభవం చేత సృష్టియందుండి వివేకాన్ని నిరోధిస్తూ చీకటిలో పూలదండయందు సర్ప భ్రాంతిలాగా భ్రాంతిని కల్పిస్తాడు. కాని వాస్తవంగా అతడు నిత్యముక్తుడు. అతనికి జీవశరీర గుణాలేవీ అంటవు. అతడు కృపాసముద్రుడు. అతనిని నీవెప్పుడు నీ మనస్సులో స్మరించు.

భూమీధవా! సమస్తమూ భగవదాత్మకమని భావించి జితేంద్రియులై యెవని పాదకమల ధ్యానంచే సజ్జనులు కర్మసంచయంచేత గ్రథితమైన (ముడివేయబడిన) అహంకారమనెడి హృదయ గ్రంథిని విప్పుకోగలుగుతారో ఆ పరమాత్మయే ప్రాపకుడని విశ్వసించి భక్తిభావంతో అతని పాదపద్మాలను సేవించు. ఈ సంసారం మహాసముద్రం. అందులో అరిషడ్వర్గం, ఊర్మలు అనెడి మొసళ్ళు భయంకరంగా తిరుగుతూ ఉంటాయి. దాన్ని దాటటానికి హరినామకీర్తనే నావ. ఆ నావను విడిచిపెట్టి యోగాభ్యాసాది క్రియ లెన్ని చేసినా ఆ సాగరాన్ని తరించడం అసాధ్యం. కనుక నీవు కేవల భక్తి యోగంతో శ్రీహరి చరణ యుగళమను నావను సంధించుకొని వ్యసనాకరమూ మహాభయంకరమూ అయిన సంసార సముద్రాన్ని తరించు- అని సనత్కుమా రుడు ఉపదేశించేసరికి పృథుచక్రవర్తి ఆయన్ను సన్నుతించి యిలా అన్నాడు-

అనఘా! నేను పూర్వజన్మలో నిజంగా దీనరక్షకుడైన ఈశ్వరుని అనుగ్రహానికి పాత్రుడనయ్యాను. ఆ అనుగ్రహాన్ని సాధించి దాని ఫలాన్ని నాకు అందించడానికే మీరు నా యింటికి వచ్చారు. మీరు అనఘులు. భాగవ లోత్తములు. శరీర సమేతంగా నా సమస్త భౌతిక సంపదలనూ బ్రాహ్మణు ఉలకు దత్తం చేశాను. నా రాజ్యం, బలం, కోశం, పరివారం, వైభవం సమస్తమూ వారికి భక్తిభావంతో నివేదింపబడ్డాయి. కనుక నేను మీకు ఏమి ఉపచారం చెయ్యగలనూ?

అలా సర్వస్వం బ్రాహ్మణాధీనం చెయ్యడమేమిటంటే సకల లోకాలపై అధిపత్యం వేదశాస్త్రజ్ఞుడైన విప్రునకే కాని అన్యులకు తగదు. వేదవిదుడైన విప్రునకే లోకపాలన సామర్థ్యం ఉంటుంది. కావున బ్రాహ్మణులకు భోజన, వసనాదులు స్వకీయాలు. వారి అనుగ్రహంచేతనే క్షత్రియాదులకు అన్న

మాత్రం తప్ప అన్య వస్తువులందు స్వాతంత్ర్యం లేదు. కనుక మీకు గురు దక్షిణ యేమి సమర్పించగలను? అదీగాక మీరు సర్వస్వతంత్రులు. ఆధ్యాత్మ చింతనులు. వేదాంతోపదేశికులు. అలాంటి మీకు మీరు చేసిన తత్త్వోపదేశానికి తగిన ప్రత్యుపకారం చెయ్యాలని భావించడం హాస్యాస్పదంగా ఉంటుంది. ఇక గురుదక్షిణగా మీకు నమస్కారం మాత్రం సమర్పిస్తాను. మీరు చేసిన దానికి ప్రతిఫలంగా ఈయదగినది ఒక నమస్కారం తప్ప మరేదీ లేదు- అని పృథుచక్రవర్తి వారిని యథోచితంగా పూజించాడు. అపుడు ఆత్మయోగ నిష్ఠులైన ఆ మహాత్ములు అందరు చూస్తుండగా ఆకాశమార్గాన వెళ్ళిపోయారు.

## పృథుచక్రవర్తి జ్ఞానవైరాగ్యవంతుడై ముక్తిపొందడం

అపుడు ఏకాగ్రచిత్తుడూ, ఆత్మనిష్ఠుడూ నై పృథుచక్రవర్తి తన కోర్కెలన్నీ తీరినట్లు భావించి ఆనందంలో పరవశించిపోయాడు. తగినచోట తగిన కాలంలో తన బలానికి, విత్తానికి అనుగుణంగా బ్రహ్మార్పణ బుద్ధితో ధర్మ కర్మలెన్నో ఆచరించాడు. ప్రకృతికంటె తనను- తనకంటె ఆత్మను అతీతునిగా దర్శించాడు. అనసక్తితో తాను చేసే కర్మలన్నింటికి పరమాత్మయే సాక్షియని విశ్వసించాడు. రాజ్యంలో అన్నిటా అంతటా తన అధికారానికి ప్రతిహతి లేకపోయినా అతనికి అణుమాత్రం కూడా అహంకారం లేదు. ఇంద్రియార్థాలకు అతడెన్నడూ వశంగతుడు కాలేదు.

అతనికి అర్చి యను భార్యయందు విజితాశ్వుడు. ధూమ్రకేశుడు, హర్యశ్వుడు, ద్రవిణుడు, వృకుడు అను ఆత్మసములైన అయిదుగురు కొడుకులు గలిగారు. భూమిపైగల జలాన్ని ఆవిరిగా గ్రహించి తిరిగి దానినే వర్షారూపంలో లోకానికి ఇచ్చి ప్రజలకు అన్న పానీయాదులను చేకూర్చెడి సూర్యుడు లాగా పృథుచక్రవర్తి ప్రజలనుండి కప్పం గ్రహించి దానిని మరల వారి శ్రేయస్సుకే వినియోగించెడివాడు.

సకలలోక పాలకులలో విడివిడిగా ఉన్న గుణాలన్నీ ఆ రాజేంద్రుని యందున్నాయి. అతడు అగ్నిలాగా తేజశ్శాలి. మహేంద్రుని వలె అజేయుడు. భూదేవిలాగా సహనశీలి. స్వర్గంలాగా అభీష్టప్రదాత. మేఘుడు లాగా కోర్కెలను వర్షిస్తాడు. సముద్రుని రీతిగా గభీరుడు. మేరువు వలె సత్వ సంపన్నుడు. ధర్మరాజువలె అనుశాసకుడు ఇంద్రునివలె మహైశ్వర్య వంతుడు. కుబేరునివలె ధనాఢ్యుడు. వరుణునివలె గుప్తమైన అర్థసంపత్తి కలవాడు. సర్వాత్మకుడైన వాయువువలె బలము, ఓజస్సు, తేజస్సు కలవాడు. రుద్రునివలె దుస్సహమైన తేజం కలవాడు. మన్మథుని వంటి అందగాడు. సింహవిక్రముడు. మనువు నందలి వాత్సల్యగుణం, బ్రహ్మయందలి ప్రభు

త్వం ఆ రాజేంద్రునిలో ఉన్నాయి. అతడు బృహస్పతి వంటి బ్రహ్మవాది. విష్ణుభక్తుల యందును గో గురుబ్రాహ్మణుల యందును అతనికి అపారభక్తి. లజ్జ, వినయం, శీలం అతనికి అలంకారాలు. పరోపకారంలో అతనికి అతడే సాటి.

ముల్లోకాల్లో ఆ రాజేంద్రుని చరిత్రను వీనులవిందుగా విని ఆనందించని వారు లేరు. శ్రీరామచంద్రునిలాగా అతడు మహా యశస్సు నార్జించి జనవినుతుడయ్యాడు. సరసములైన వాక్కులలో సజ్జనులు అతని నిరంతరం స్తుతిస్తూ ఉంటారు. సౌమ్య భాషణాలతో అతడు ప్రజానురంజకంగా రాజ్యం పాలించాడు. అతని కీర్తిచంద్రికలు దిగంతాలకు వ్యాపించాయి. రాజ* నామం అతనియందు సార్థకమవడంచేత అతడు రెండవచంద్రుడని విఖ్యాతి చెందాడు.

విజ్ఞానం అతని సొత్తు. అశేషమైన తన సృష్టిని వృద్ధిచేశాడు. స్థావరములకు, జంగములకు కూడా వృత్తులను కల్పించాడు. సజ్జన ధర్మాలను అనుసరించి వర్తించాడు. తానేది చేసినా ఈశ్వరాదేశంతోనే చేసినట్లు భావించాడు.

ఇలా ఆ రాజేంద్రుడు ప్రజానురక్తితో ధర్మమార్గాన పరిపాలనం చేస్తుండగా తనకు వార్థక్యం పైకొన్నదని గ్రహించాడు. నిజాత్మజమైన పృథివిని నిజాత్మజులైన విజితాశ్వాదులకు అప్పగించి ప్రజలు చింతాక్రాంతులై చూస్తుండగా వైఖానస సమ్మతమైన దారుణతపస్సు చెయ్యడానికి భార్యను వెంటబెట్టుకొని తపోవనానికి వెళ్లాడు. యౌవనదశలో అతడు దిగ్విజయయాత్రను ఎంత శ్రద్ధానక్తులతో నియమబద్ధంగా నిర్వహించాడో ఈ వార్థక్యంలో అతడు తపోవనానికి అంతటి దీక్షతో వెళ్లాడు.

కొంతకాలం కందమూలాలు, తర్వాత కొంతకాలం తృణపర్ణాలూ, ఆపైన కేవల జలం, అటుమీదట వాయుమాత్రం భక్షిస్తూ ఉగ్రతపస్సుచేశాడు. మిటమిట మండే వేసవిలో తప్త పంచాగ్ని మధ్యంలోనూ, వర్షర్తువులో ముసురుపట్టినపుడు పైన బట్టలేకుండా ఆరుబయటనూ, ఆందులూ హూ హూ అని వణకెడి చలివేళ మెడలోతు నీళ్ళల్లోనూ నిలబడి, నలుదిక్కులా మంచు కురిసే రోజుల్లో భూశయానుడయ్యేన్నీ అతడు ఈశ్వరార్పణబుద్ధిలో, దీక్షతో, తితీక్షతో (తరించాలనే కోరికతో) ప్రాణవాయువును బిగబట్టి మితభాషియై బ్రహ్మచర్యారతుడై ఘోరమైన తపస్సు చేశాడు.

ఇలా క్రమానుసిద్ధమైన తపస్సుతో ఆ రాజేంద్రుడు వివిధ కర్మాచరణమువలన ప్రాప్తించిన దోషాలను పరిహరింపజేశాడు. ప్రాణాయామంలో అరిషడ్వర్గాన్ని జయించాడు. సంసారబంధాలను త్రుంచివేశాడు. సనత్కుమా

* రాజు = ధరాపాలకుడు, చంద్రుడు.

రుతుపదేశించిన మార్గంలో శ్రీహరిని యజించారు. భగవద్దర్శనలాలసుడూ, సాధువర్తనుడూ, శ్రద్ధాన్వితుడూ అయిన పృథునకు నారాయణునందు భక్తి పరమలక్షమై ప్రవృద్ధమైంది.

ఈ విధంగా భగవంతుని లోకోత్తరమైన రీతిలో ఆరాధించడం చేతను, భగవత్కథలను నిరంతరం స్మరించడం వలనను, అతని అంతఃకరణం పరిశుద్ధమైంది. పరిపూర్ణమైన భక్తి అలవడింది. ఫలితంగా సంశయాత్మకమైన అహంకారమనెడి ముడి విడివడి వైరాగ్యంతో గూడిన ప్రజ్ఞ జనించింది. దేహమే తాననెడి భావం తొలగిపోయింది. ఆత్మ స్వరూపం అవగతమైంది. శ్రీకృష్ణుని కథలయందు ఆసక్తి ప్రవృద్ధం కావడంవల్ల యోగసిద్ధులందు కోరిక అణగిపోయింది. హృదయ గ్రంథిని ఛేదించెడి జ్ఞానయోగాన్ని కూడ విడిచి ఆత్మయందు ఆత్మయోగాన్ని కావించి బ్రహ్మభూతుడయ్యారు అనగా తానే బ్రహ్మమని తెలుసుకొన్నారు. అప్పుడు శరీరత్యాగం చెయ్యడానికి నిశ్చయించుకున్నారు.

మడమలచే మలద్వారాన్ని నొక్కిపట్టి సిద్ధాసనం మీద కూర్చున్నారు. మూలాధారం నుండి ప్రాణవాయువును ఊర్ధ్వంగా ప్రసరింపజేసి నాభిగతం చేశారు. అక్కడనుండి క్రమక్రమంగా హృదయాన్ని, వక్షస్థలాన్ని, కంఠాన్ని, శిరస్సును దాటించి బ్రహ్మరంధ్రం ద్వారా ప్రాణత్యాగం చేసి వాయువును మహావాయువులోను, ఆకాశాన్ని ఆకాశంలోను, తేజాన్ని తేజంలోను, నీటిని నీటిలోను శరీరాన్ని భూమియందును కలిపారు.

అలా దేహస్థాలైన భూతాంశాలను మహాభూతాలతో అనుసంధానంచేసి అనంతరం పృథివ్యాది తత్త్వాల ఉత్పత్తిక్రమాన్ని అనుసరించి లయానుసంధానంచేశారు. ఎలా అంటే పృథ్విని జలంలోను, జలాన్ని తేజస్సులోను, తేజస్సును వాయువులోను, వాయువును ఆకాశంలోను, కలిపారు. ఆ మీదట ఆకాశాన్ని మనస్సులోను, మనస్సును ఇంద్రియాల్లోను, ఇంద్రియాలను తన్మాత్రలందును, తన్మాత్రలను భూతాదియైన అహంకారంలోను, అహంకారాన్ని మహత్తత్వంలోను అనుసంధించి సర్వకార్యహేతుభూతమైన మహత్తత్వాన్ని జీవోపాధి భూతయైన ప్రకృతిలో కలిపారు. అపుడు జీవభూతుడైన పృథువు జ్ఞానవైరాగ్యాలచేత ప్రకృతి బంధాన్ని వదలించుకొని బ్రహ్మనిష్ఠుడై మాయోపాధిని విడిచి ముక్తుడయ్యారు.

అపుడు అతని భార్య అర్చి అక్కడే ఉంది. నేలపై అడుగుపెడితే కందిపోయేటంతటి సుకుమారురాలు ఆమె. అయినా మహా పతివ్రత కనుక ఆయనతో అడవులకు వచ్చి తపోమగ్నుడైన ఆయనకు శుశ్రూష చేస్తూ తాను కూడా ఆర్షమార్గంలో జీవయాత్ర చెయ్యడం వలన కృశించిపోయింది. అయినా తన పతి ఆమెను కరుణార్ద్రదృక్కులతో చూస్తూ చేతిలో ఆమెను

ఆప్యాయంగా స్పృశించడం వలన ఆమె దుఃఖాన్ని మఱిచి ఆ అడవుల్లో ఎంతో సుఖం అనుభవిస్తున్నట్లుండేది.

అలా ఏ దుఃఖమూ ఎఱుగని అర్చి తనపతి యొక్క ప్రాణరహిత దేహాన్ని చూచి విలవిలలాడి పోయింది. మందరగిరి సానువులో చితిని పేర్చి పతి మృతదేహానికి దాహక్రియ చేసింది. అనంతరం నదీ జలాల్లో క్రుంకిడి చితాగ్నికి మూడుమార్లు ప్రదక్షిణంచేసి పతి పాదపద్మాలను చిత్తంలోనిలిపి దేవతలకు నమస్కరించి ఆ నరేంద్రునితో సహగమనం చెయ్యడానికి ఉద్యుక్తురాలైంది. అపుడా మహాసాధ్వి పతిభక్తికి చకితలై దేవాంగనలు దేవతలతో గూడి ఆ మందరనగ సానువుల్లో సవసుగంధాన్ని విరజిమ్మేడి-మందార సుమవర్షాన్ని కురిపించారు. అప్సరలు ఆనందంతో నాట్యం చేశారు. దేవతలు శంఖతూర్యాలు కావించారు. కిన్నరులు మధుమధురంగా గానంచేశారు. దేవాంగనలు అపుడు అర్చిని అభినందిస్తూ ఇలా అన్నారు—

ఔరా! ఇంతటి ఆశ్చర్యం ఎక్కడైనా ఉందా? అర్చి ఎంతటి ధన్యాత్మురాలో! లక్ష్మీదేవి శ్రీవిష్ణువును విడిచిపెట్టకుండా వెన్నంటి అనుగమించునట్లు ఈమె తన పతియైన వైన్యుని అనుగమించింది ఈమెకు ఊర్ధ్వలోకం ప్రాప్తిస్తుంది. తప్పదు. పతివ్రతలకు అసాధ్యమేముంటుంది! పృథుడు మాత్రం సామాన్యుడా? మహా వివేకశాలి. అతనికి పొందరాని పదం ఏదిన్నీ ఉండదు. మోక్షసాధనమైన మానవజన్మ పొందికూడా విషయ వాసనలలో చిక్కుకొని వర్తించేవాడు వాస్తవానికి ఆత్మవంచనకు పాల్పడిన వాడు కాగలడు — అని దేవగణం సన్నుతిస్తుండగా అర్చి తన పతి పృథు చక్రవర్తి పొందిన విష్ణులోకాన్ని పొందింది.

విదురా! చూచావా! పృథువెంతటి మహానుభావుడో! నేను నీకు చెప్పిన ఈ పుణ్యకథను ఎవరైనా సావధానంగా విన్నా, పఠించినా, వ్రాసినా, వినిపించినా అతనికి పృథుడు పొందిన హరిపదం తప్పక లభిస్తుంది. బ్రాహ్మణుడు పఠిస్తే బ్రహ్మ వర్చసం ప్రాప్తిస్తుంది. క్షత్రియుడు చదివినా, విన్నా ధాత్రీవిభుత్వం లభిస్తుంది. అలాగే ఈ పుణ్యచరిత్ర వింటే వైశ్యుడు ధనవంతుడౌతాడు. శూద్రుడు సుశ్లోకుడౌతాడు.

సంతాన హీనునకు సంతానం, ధనహీనునకు ధనం లభిస్తాయి. మూర్ఖుడు మహాజ్ఞాని అవుతాడు. సకల శ్రేయోదాయకమైన ఈ కథ పురుషార్థాలను కాంక్షించేవారికి పురుషార్థాలనిస్తుంది. కనుక ఈ కథ అందఱు తప్పక వినదగ్గది. శ్రద్ధాశక్తులతో అనుదినం ఈ పుణ్యచరిత్రను పఠించేవాడు భవసాగరాన్ని దాటి విష్ణు పదం పొందగలడు.

పృథువు అనంతరం అతని జ్యేష్ఠసుతుడు విజితాశ్వుడు చక్రవర్తి

అయ్యాడు. అతడు మహాశౌర్యవంతుడు. అతనికి అంతర్ధానుడనే మరో పేరు ఉంది. పూర్వం తనతండ్రి అశ్వమేధం చేస్తుండగా మేధ్యాశ్వాన్ని అపహరించిన యింద్రుని పట్టుకొని కూడ అతణ్ణి వధింపకుండా విడిచిపెట్టడంచేత అతడు సంప్రీతుడై విజితాశ్వునకు అంతర్ధాన గమనశక్తిని ఇచ్చాడు. అంచేత అతనిక్కి అంతర్ధానుడనే పేరు వచ్చింది. అతడు సార్వభౌముడైన తర్వాత తమ్ములమీద్ధి వాత్సల్యంతో హర్యశ్వుని తూర్పు దిక్కునకు, ధూమ్రకేశుని దక్షిణ దిశకు, వృకుని ప్రాగ్దిశకు, ద్రవిణుని ఉదీచికి పట్టంగట్టి తాను రాజాధిరాజపదం అలంకరించాడు.

విజితాశ్వునకు శిఖండిని అను భార్యయందు త్రేతాగ్నులు వశిష్ఠుని శాప వశంచేత జనించి పావకుడు, పవమానుడు, శుచి అను నామాలతో ప్రసిద్ధికెక్కారు. వారు శాపవిమోచనానంతరం తిరిగి నిజప్రభావంచేత అగ్నిత్వం పొందారు. అనంతరం విజితాశ్వునకు నభస్వతి యను మరొక పత్ని వలన హవిర్ధానుడను పుత్త్రుడు కలిగాడు.

హవిర్ధానుడు మృదుహృదయుడు. అతనికి రాజవృత్తి నచ్చలేదు. ప్రజలనుండి కప్పం తీసికొనడం, ప్రజాదండనం దారుణకృత్యాలుగా భావించి అతడు రాజభోగాలు విడిచి ఆత్మదర్శనుడై యజ్ఞాలుచేస్తూ పరమాత్మను ఆరాధించి ముక్తి పొందాడు.

ఆ హవిర్ధానునకు హవిర్ధానియను పత్నియందు బర్హిషదుడు, గయుడు, శుక్లుడు, కృష్ణుడు, సత్యుడు, జితవ్రతుడు అను ఆరుగురు కొడుకులు పుట్టారు. వారిలో బర్హిషదుడు కర్మతంత్రంలోను, ప్రాణాయామాది యోగాల్లోను, నిష్ణాతుడయ్యాడు. అతడు చేసిన యజ్ఞాలకు అంతులేదు. ఒక యజ్ఞంచేసి అనంతరం దాని ప్రక్కనే ఎడతెగకుండా మరో యజ్ఞంచేస్తూ భూమండలం అంతటినీ తన యజ్ఞశాలగా చేసుకొని ప్రాచీనాగ్రాలైన దర్భలతో కప్పడంచేత అతడు ప్రాచీన బర్హి అను పేరులో విఖ్యాతి కాంచాడు.

అతడు సముద్ర కన్యకయైన శతధృతిని బ్రహ్మదేవుని ఆదేశాన్ని అనుసరించి వివాహమాడాడు. లేవయసు నందామె రవికిరణ రేఖలాగా మెరిసిపోతూ కాలి యందియల రవళితో ఆడుతూ నడయాడుతూ ఉంటే చూచి దేవతలు, కిన్నరులు, సిద్ధులు, సాధ్యులు, మునులు, పన్నగులు మొదలైన ఖేచరులు ముగ్ధులయ్యేవారు. వివాహ సమయంలో ఆమె అగ్నికి ప్రదక్షిణం చేస్తుంటే ఆమె సౌందర్యానికి విస్మితుడై అగ్నిదేవుడు కూడా మోహపరవశుడయ్యాడు.

అంతటి సౌందర్య ఖనియైన ఆ శతధృతియందు ప్రాచీన బర్హికి తుల్యనామాలతో సమానవ్రతులు, ధర్మపారగులు, అయిన ప్రచేతసులను పదిమంది పుత్రులు జనించారు. తండ్రి యానతిని వారు ప్రజాసృష్టి నిమిత్తం తపశ్చ

ర్యక్తై అరణ్యాభిముఖంగా వెళ్ళుతూండగా దారిలో వారికి రుద్రుడెదురై తత్త్వోపదేశం చేశాడు. వారు రుద్రోపదేశాన్ని అనుసరించి పదివేల దివ్య సంవత్సరాలు తపఃపతియైన నారాయణునిగూర్చి వస్తుధ్యాన పూజానియమంతో తపమాచరించారు'—అని మైత్రేయుడనేసరికి విదురుడిలా అన్నాడు.

'తాపసోత్తమా! ప్రచేతసులకు మార్గమధ్యంలో రుద్ర సమాగమం ఎలా జరిగింది? రుద్రుడు వారికి చేసిన ఉపదేశమేమిటి? మహామునీంద్రులకు కూడా శివుడు ధ్యానగోచరుడౌతాడే కాని ప్రత్యక్షంగా కనబడదు. అలాంటప్పుడు జీవకోటికి అతని తోడి సంగమం దుర్లభంకదా! అతడు ఆత్మారాముడు. లోక రక్షణార్థం ఆత్మశక్తితో భూమిమీద సంచరిస్తూ ఉంటాడు. ప్రచేతసులకు ఆ దేవదేవుని చెలిమి ఎలా లభించింది? సాకల్యంగా వినాలని ఉంది' అని వచించేసరికి మైత్రేయుడిలా చెప్పడం మొదలుపెట్టారు.

'విదురుడా! విను. సాధువులైన ప్రచేతసులు తండ్రి యాజ్ఞను తల దాల్చి తపశ్చర్యక్తై, తూర్పుదిక్కుకు వెళుతూ ఉండగా వారికి ఎదురుగా మహా సముద్రంలాంటి విశాలమైన ఒక సరస్సు కనబడ్డది. ఆ సరోవరంలోని నీరు నిర్మలంగా మనోహరంగా ఉంది. నానావిధాలైన కలువ పువ్వులతోను, వికసించిన కమలములతోను ఆ సరస్సు కనువిందు చేస్తోంది. మందమారుతం పద్మపరాగ సుగంధాన్ని వెదజల్లుతూ ఘ్రాణ తర్పణం చేస్తోంది. హంసలు, చక్రవాకాలు, బెగ్గురులు మొదలైన జల పక్షులతో ఆ కమలాకరం నేత్ర పర్వంగా ఉంది. మదించిన తుమ్మెదల మధుర ఝంకృతులకు ఆ సరస్తీర మందల్లి సుమించిన లతలు తరువులు పరవశించి పోతూన్నట్లున్నాయి. సిద్ధులు చారణులు గంధర్వులు ఆ సరః ప్రాంతంలో స్వేచ్ఛగా విహరిస్తూ ఉంటారు.

ఆ సరోవరంలో వారికొక దివ్యపురుషుడు కనబడ్డాడు. అతడు మృదంగ వేణు నాదాలతో మేళవింపబడి మనోరంజకంగా ఉన్న గాంధర్వ గానంవింటూ ఆ సరోవరంనుండి బయటకు వచ్చాడు. ప్రచేతసులు ఆ దివ్య పురుషుని చూచి ఆశ్చర్య చకితులయ్యారు అతడు సాక్షాచ్ఛంకరుడు.

నీలకంఠంతో మేలిమి బంగారు మై చాయతో ఫాలనయనంతో సన కాదియోగీంద్రులు పరివేష్టించి కీర్తిస్తుండగా అలా రుద్రుడు తమ కట్టెదుట సాక్షాత్కరించేసరికి ప్రచేతసులు సంభ్రమపాటుతో ఆ దేవదేవుని పాదాలపై వ్రాలారు. అపుడు ధర్మవత్సలుడైన శివుడు సంప్రీతుడై ధర్మజ్ఞులు, శీల సంపన్నులు అయిన వారితో ఇలా అన్నాడు—

రాకుమారులారా! వినండి. మీ మనోగతం నేను గ్రహించాను. మీకు శుభం కలుగుతుంది. మీయెడ నాకుగల అనుగ్రహ బుద్ధిచేత మీకు నేను కన బడ్డాను. సూక్ష్మమూ, త్రిగుణాత్మకమూ అయిన ప్రకృతికంటెను, జీవుని

కంటెను పరుడైన వాసుదేవుని చరణాంబుజాలను సేవించేవారు నాకు ప్రియులు. వారికి నేను ప్రియుడను.

స్వధర్మరతుడైన పురుషుడు జన్మాంతర సుకృత విశేషంచేత బ్రహ్మ లోకాన్నీ, అనంతరం నాలోకాన్నీ పొంది, అధికారాంతంలో నేనూ దేవ గణాలు ఏ హరి పదం పొందుతామో ఆ పదాన్ని తనకై తానే పొందుతాడు. కనుక మీరున్నూ భాగవతత్వం పొంది నాకు ప్రియం చెయ్యండి. భాగవతు లకు నాకంటె అధిక ప్రియుడు లేడు. సర్గాదిని బ్రహ్మ నిజ నందనులకు ఎఱిగించిన శ్రీహరి స్తోత్రం మీకు తెలియజెపుతాను. నిర్వికార బుద్ధితో దాన్ని జపించండి— అని వారికి ఉపదేశించడానికి ముందు రుద్రుడు వారు వింటూం డగా శ్రీహరి నుద్దేశించి యిలా అన్నాడు—

## శ్రీరుద్ర గీతాస్తోత్రం

పరమేశ్వరా! ఆత్మ విదులైన వారికి నీ సర్వోత్కృష్ట ఆత్మానందం కలిగిస్తుంది. అలాంటి స్వానందలాభం మీకు కలుగుగాక! పరిపూర్ణానంద స్వరూపుడవూ, సర్వాత్మకుడవూ అయిన నీకిదే నా ప్రణామాలు.

నీవు పద్మనాభుడవు. సంకర్షణుడవు. శాంతుడవు. విశ్వప్రబోధకుడవు భూతసూక్ష్మేంద్రియ స్వరూపుడవు. వాసుదేవుడవు. నిర్వికారుడవు, కర్మ నిస్తారకుడవు, స్వయంజ్యోతివి, పూర్వపురుషుడవు, విరాట్శరీరుడవు. అఖిల ధర్మదేవతవు, నిభృతాత్ముడవు. నీకు నా నమస్కారములు.

దేవా! నీవు సర్వసత్త్వ సంపన్నుడవు. నిర్గుణుడవు. సర్వానుశాస కుడవు. అంతకుడవు. సర్వజ్ఞుడవు. జ్ఞానక్రియాస్వరూపుడవు. అంతఃకరణ వాసివి. ప్రద్యుమ్నుడవు. నీకివే నాకై మోడ్పులు.

అనఘా! నీ పాదపద్మ సందర్శనం కాంక్షించెడి మాకు వైష్ణవ సత్కృ తమైన నీ దర్శనాన్ని అనుగ్రహించు. నీ స్వరూపం భక్తకోటికి ప్రియమైనది. అది అనుపమానం. సకల శుభావహం. సౌందర్య సమగ్రం. నీ మేఘశ్యామల శరీరం నయనపర్వంగా ఉంటుంది. చంద్రరేఖను తిరస్కరించెడి నీ నెమ్మొ ముపై తుమ్మెద పరుసల్లాంటి ముంగురులు నాట్యమాడుతూ ఉంటాయి. చెవులు కనుబొమలు, ముక్కు అందం చిందిస్తూంటాయి. పలువరుస మొల్లమొగ్గ ల్లాగా ఉంటాయి. చెక్కిళ్ళు స్నిగ్ధంగా ఉంటాయి. కళ్ళు తామరరేకుల్లాగా విశాలంగా ఉంటాయి. మందస్మితంతో నీ ముఖం ముగ్ధమోహనంగా ఉంటుంది. కంఠం శంఖాకృతిలో సుందరంగా ఉంటుంది. కడకంటి చూపుల్లో అనురాగం తొణికిసలాడుతూ ఉంటుంది. భుజాలు సింహస్కంధా ల్లాగా సమున్నతంగా ఉంటాయి. నీ బాహుచతుష్టయం శంఖచక్రగదాపద్మా

లతో ముచ్చటగా ఉంటాయి. వనమాలతోను, కౌస్తుభమణితోను ప్రకాశిస్తూ లక్ష్మికి నివాసస్థానమైన నీ వక్షస్థలం నికషోపలం (ఒరపిడిరాయి) లాగా కఠినంగా ఉంటుంది. ఉదరంపై ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో చలించెడి మూడు ముడుతలుంటాయి. లోతైన పొక్కిలి సుడిగుండంలాగా ఉంటుంది. కటిప్రదేశం పీతాంబరకంతోను బంగారు మొలనూలుతోను, శోభిస్తూ ఉంటుంది. తొడలు అరటి బోదెల్లాగా స్నిగ్ధంగా ఉంటాయి. నమంగా ఉండే పిక్కలు, సమున్నతములు కాని మోకాళ్ళు, శరత్పద్మాల్లాంటి పాదాలు, చంద్రశకలాల్లాంటి గోళ్ళు దర్శనీయంగా ఉంటాయి. నానావిధ రత్నమణికాంచన భూషజాలతో కమనీయంగా రమణీయంగా ఉండెడి నీ దివ్యాకారాన్ని మాకు చూపించి మమ్మల్ని ఉద్ధరించు.

ఆత్మ పారిశుద్ధ్యం కోరేవానికి నీ దివ్యాకారం ధ్యేయవస్తువు. స్వర్గ రాజ్యాభిషిక్తునకైనా నీవు స్పృహణీయుడవు. భక్తజనులకు సులభుడవు. దుష్టాత్ములకు దుర్లభుడవు ఆత్మదర్శులకు గమ్యుడవు. నిన్ను వర్ణించడం ఎంతటివానికిన్ని సాధ్యం కాదు. నీ పాదపూజకు నోచుకొన్నవాడు నిన్నెన్నడూ విడువడు. అతిశయించిన భక్తియోగంతో నీ చరణారవిందాలను ఆశ్రయించిన వానికి సర్వలోకాలను సంహరించెడి మహోగ్రుడైన యముని భీతి అణుమాత్రం కూడా ఉండదు.

అలా నీ పాదాలను ఆశ్రయించి ధన్యాత్ముడైన వాడు ఏమరుపాటునందైనా ఇతరం కోరడు నీ భక్తులతో అర్ధనిమేషం చెలిమి చేసినా చాలు. దానితో మోక్షం కూడ సరితూగదు. అలాంటప్పుడు అశాశ్వతములైన మర్త్య సుఖాలను గురించి చెప్పేదేముంది? పాపవినాశనములైన పాద పంకజములు కలవాడా! నీ కీర్తి యనెడి తీర్థంలో క్రుంకిడి బాహ్యాంభ్యంతర కాలుష్యాలను కడిగివేసికొన్న పురుషులు తీర్థభూతులు. భూతదయాన్వితులు, వీతరాగులు, ఆర్జవాది గుణోపేతులూ అయిన భాగవతోత్తముల సాంగత్యభాగ్యం మాకు కలిగించు.

పద్మనాభా! సత్పురుషసాంగత్యంచే లభించిన భక్తియోగంతో పరిశుద్ధమైన వాని చిత్తం అస్థిరమైన బాహ్యవస్తువులను కాంక్షించదు. అంధకార బంధురమైన సంసారమనెడి గుహలో ప్రవేశించదు. నిరంతరం నీ మహనీయ తత్త్వం గని ప్రసన్నంగా ఉంటుంది.

ఆ తత్త్వమేమిటంటే!

దేనియందు ఈ విశ్వం విభావితమై ఉంటుందో, ఈ విశ్వమందు ఏది ప్రకాశిస్తూ ఉంటుందో ఏది నిత్యమో అవ్యయమో ఆకాశంలాగా ఏది విస్తృతమో అట్టి పరబ్రహ్మ శబ్దాభిధేయమైన జ్యోతిస్సే నీ తత్వం. పరమేశ్వరా!

జీవుడు ఈశ్వరుని కంటె భిన్నుడూ, స్వతంత్రుడూ అనే భ్రాంతిని కలిగించెడి నీ మాయచేత నీవు పదేపదే విశ్వాన్ని సృజించి, పోషించి లయం చేస్తూ ఉంటావు. అయినా నీవు నిర్వికారుడవై ఉంటావు అదే నీ తత్వం.

యోగపరాయణులైన వారు క్రియాకలాపాల్లో అంతఃకరణమందు ఉపలక్షితమగు నీ రూపాన్ని శ్రద్ధానమన్వితులై యజిస్తారు అలాంటివారే వేదతత్వం తెలిసినవారు నీవు అద్యుడవు. అద్వితీయుడవు.

నీవు నీ మాయాశక్తిచేత క్రమంగా సత్వరజస్తమో గుణాలు జనించాయి. వానివలన క్రమంగా మహత్తత్వం అహంకారం, ఆకాశం, వాయువు, అగ్ని, జలం, పృథివి గలిగాయి. పంచీకృతమైన పృథివ్యాది భూతాలవలన అండోత్పత్తియై దేవమానవ తిర్యక్కులలోను స్థావరములలోను, ఈ విశ్వం సృజింపబడ్డది. ఈ విధంగా నీ మాయావశంచేత సృజింపబడిన చతుర్విధ రూపమైన శరీరంలో ఆత్మాంశకమైన జీవుని రూపంలో ప్రవేశిస్తున్నావు ఆ జీవుడు ఇంద్రియోపార్జితమైన సుగాన్ని తేనెటీగలు సమకూర్చిన తేనెవలె అనుభవిస్తున్నాడు. జీవాంతరాత్మనే పురవర్తి అంటారు.

అటువంటి జాగత్స్రష్టవైన నీవు భూతములచేత భూతములనే పీడింపజేస్తూ మహావాయువు మేఘపుంజమునువలె సకల భూతసంహారం చేస్తున్నావు ఏవేవో చెయ్యాలనే ఆలోచనలతో ప్రమత్తుడై లోభం వలన విషయలాలసుడైన వానిని నీవు అప్రమత్తుడవై క్షుదాతురమై నాల్కలుచాచెడి సర్పం తన నోటిలో పడిన ఎలుకను మ్రింగినట్లు నీవు మ్రింగివేస్తావు. నా గురువైన చతుర్ముఖుడూ, మనువులూ శంకలేకుండా నిరంతరం నీ పాదాబ్జాలను యజిస్తారు అలాంటి స్థితిలో నీ అనాదరంచేత వ్యథితులైనా సజ్జనులు విడిచిపెడతారా? కనుక నాకు గాని ప్రాజ్ఞులైన వారికి గాని సంశయ నివారణం చెయ్యగల సమర్థుడవు నీ వొక్కడవే- అని రుద్రుడు నారాయణస్తవాన్ని ప్రచేతసులకు ఎఱిగించి యింకా ఇలా అన్నాడు.

ప్రచేతసులారా! యోగాదేశనామకమైన ఈ స్తోత్రాన్ని మీరు సమాహితచిత్తులై శ్రద్ధలో స్వధర్మాలను అతిక్రమించకుండా భగవదర్పితంగా పెక్కుమారులు జపించండి. లోక సృష్టి చెయ్యాలనే కోరికతో పూర్వం బ్రహ్మదేవుడు, అయన ఆత్మజులమైన మాకును భృగువు మొదలైన వారికిని చెప్పాడు. ప్రజా సర్గం నిమిత్తం బ్రహ్మచే ప్రేరితులమై మేము ఈస్తోత్ర ప్రభావంచేత తమోగుణాన్ని విధ్వస్తంచేసి నానావిధ సృష్టిని చేశాం. కనుక ఈస్తోత్రాన్ని ఏకాగ్రచిత్తుడై పఠిస్తే అతడు సంసార సాగరాన్ని సులభంగా తరిస్తాడు. శ్రీహరి అతని అభీప్సితాలను తీరుస్తాడు. ప్రభాతసమయంలో ఈ మంగళస్తవాన్ని చదివినా, విన్నా అతడు కర్మబంధం నుండి విముక్తుడౌతాడు-

అని ఇలా ఉపదేశించి రుద్రుడు వారిచే సంపూజితుడై అంతర్హితుడయ్యాడు. అనంతరం వారు రుద్రోపదిష్టమైన అచ్యుత స్తవాన్ని పదివేల సంవత్సరాలు జలమధ్యంలో నిలబడే జపించారు'-అని మైత్రేయుడు విదురునితో ఇంకా ఇలా అన్నాడు.

'విదురుడా! ప్రాచీన బర్హి అనేక క్రతువులు చేశాడని చెప్పాను గదా! అతని ఆజ్ఞానుసారం అతని కొడుకులు ప్రచేతసులు ప్రజా సృష్టికోసం అరణ్యాలకు వెళ్ళిన తర్వాత కర్మాసక్తుడైన అతనికి జ్ఞానోపదేశం చెయ్యాలనే తలంపుతో ఆధ్యాత్మ వేది యైన నారదమహర్షి అతని దగ్గఱకు వెళ్ళి యిలా అన్నాడు-

రాజా! నీవు ఈ కర్మలు ఎందుకు ఆచరిస్తున్నట్లు? వీటివలన ఇష్ట ప్రాప్తిగాని అనిష్టనిరసనం గాని జరుగదే!—అనేసరికి ప్రాచీన బర్హి బద్ధాంజలియై-మునీంద్రా! ఔను. నీ మాట వాస్తవం. ఈ కర్మాచరణం వలన నాకు జ్ఞానంగాని విముక్తి మార్గంగాని లభించలేదు. కనుక నాకు కర్మబంధనాశకమైన జ్ఞానాన్ని ఉపదేశించు. దారసుతాదులనూ ధనాధికాన్ని పురుషార్థాలుగా భావించి మతివిహీనుడైన వాడు సంసారమార్గంలో పరిభ్రమిస్తూ ఎన్నటికీ ముక్తి పొందలేడు-అనేసరికి నారదుడు

అనఘా! నీవు నీక్రతువుల్లో విశసించిన (వధించిన) పశువులు వేల కొలది పడి ఉన్నాయి. చూడు. ఆ పశు సమూహాలన్నీ నీవు పరలోకగతుడవైనప్పుడు లోహమయ శృంగాలతో నిన్ను హింసించాలని నిరీక్షిస్తున్నాయి. నీకు రానున్న ఆ సంకటం నుండి నిన్ను తరింపజేయగల ఒక ఇతిహాసం ఉంది. చెప్తాను విను.

## పురంజనోపాఖ్యానం.

పూర్వం పురంజనుడను రాజొకడున్నాడు. అతనికి విజ్ఞాతుడనే మిత్రుడు కలడు. అతడు తనకు నివాసార్హమైన పురంకోసం ధరాచక్రమంతా కలయదిరిగాడు. కాని ఎక్కడా అనురూపమైన పురం లభించక పోవడంచేత అతడు ఖిన్నుడై యుండగా హిమవత్పర్వత దక్షిణ సానువులందతనికి భోగవతీ నగరానికి సాటిరాగల ఒక మనోజ్ఞమైన పురం కనబడ్డది.

ఆ నగరం తొమ్మిది ద్వారాలతో అతివిశాలంగా ఉంది. ఎత్తైన ప్రాకారాలతో, బురుజులతో, బహిర్ద్వారాలతో, ఉద్యానవనాలతో, స్వర్ణ రజత మయ గోపురాలుగల గృహపంక్తులతో, మరకత మణులూ, స్ఫటికాలూ, పవడాలూ మణులూ ముత్యాలూ పొదిగిన సమున్నత హర్మ్యాలతో, సభామందిరాలతో, విశాలములైన రాజమార్గాలతో, విశ్రాంతి మందిరాలతో, క్రీడాగారా

లతో, విపణివీథులతో నయనాకర్షకంగా ఉంది.

ఆ నగరం వెలుపల ఒక ఉపవనం ఉంది. దానిలో నానా విధాలైన దివ్యతరులతానికుంజాలు కనువిందు చేస్తూ ఉంటాయి. ఆ వనమధ్యంలో మదించిన జలపక్షుల యొక్కయు తుమ్మెదల యొక్కయు కోలాహలంతో సంకులమైన సరోవరం ఒకటి ఉంది. ఆ కమలాకరమందలి చల్లని నీటి తుంపరలను, వికసించిన పద్మపరాగాన్ని ధరించి మందమారుతం వీస్తూంటే ఆ సరస్తీర మందున్న పవడపు తీవెలు తలలూపుతూ పరవశించిపోతూన్నట్లుంటాయి. కలహంసలు, రాచిలుకలు, కోకిలలు అచటికి వచ్చిన బాంధవజనానికి స్వాగతం పలుకుతూన్నట్లు మధుమధురంగా నదిస్తూ ఉంటాయి. అచటి వన్యమృగాలు కూడా మునివ్రతం ధరించడంచేత వాటి వలన ఎవర్కికీ ఏ విధమైన బాధాలేదు.

ఆ ఉద్యానవనంలో పురంజను డొక సుందరాంగిని చూచాడు. ప్రతీహారిలాగా ఆమెకు ముందు పంచశీర్షాలు గల సర్పం దారిచూపుతోంది. వెనుక పదిమంది భటులు అనుగమిస్తూన్నారు. ఒక్కొక భటుని ఆధిపత్యంలో నూఱురు యువతులున్నారు. ఆమె నవోఢ. కామరూపిణి. తనకు తగినపతిని అన్వేషిస్తూ బయలుదేరింది

ఆమె సౌందర్యం వర్ణనాతీతం. ఆమె కర్ణ కుండల కాంతులు చెక్కిళ్ళ సోయగాన్ని ఇనుమడింప జేస్తున్నాయి. ఆమె విశాలనేత్రాలు తామరతేకుల సిరిని తిరస్కరిస్తున్నాయి. ఆమె చీరముడి ఆమె ధరించిన బంగారు మొలనూలు సౌందర్యానికి వన్నె తెస్తోంది. ఆమె కాలి యందియల ఝుణఝుణధ్వని శ్రుతి మధురంగా ఉంది. యౌవనారంభంలో మిలమిలలాడుతూ ఒకదాని నొకటి నొరసి కొనుచున్న స్తన యుగాన్ని చూచి సిగ్గుచెంది ఆ సుందరి పయ్యెదతో కప్పుకొన్నది. ఆమె పలువరున చక్కగా ఉంది. గంధగజంలాగా మందమందంగా నడుస్తూ ప్రేమాతిశయంచేత చలించెడి కనుబొమలనెడి విండ్లచే కటాక్ష వీక్షణాలనెడి బాణాలను ప్రయోగించెడి ఆ మోహనాంగిని చూచి పురంజనుడిలా అన్నాడు.

కమలాక్షీ! నీ వెవ్వరిదానవు? నీ జనకుడెవ్వరు? నీ శుభనామ మేమిటి? ఈ భృత్యులెవ్వరు? ఈ సతులెవ్వరు? నీవు ఈ వనంలో ఉండడానికి కారణ మేమిటి? నీముందున్న ఈ సర్పరాజెవ్వరు? నాకు వివరంగా చెప్పు - అని ఆ రాజేంద్రుడింకా ఇలా అన్నాడు.

మృగాక్షీ! నీవు పతియగు ధర్మని అన్వేషిస్తూ తిరిగెడి హ్రీ యను సతివా? కాక రుద్రుని అన్వేషించెడి రుద్రాణివా? లేక బ్రహ్మను వెదకెడి భారతివా? అదికాక భక్తి పారవశ్యంలో శ్రీహరిని అన్వేషిస్తూ బయల్వెడలిన లక్ష్మీదేవివా? అయితే నీ చేతిలో లీలా కమలంఏది? అదెక్కడైనా జారి

వద్దదా? చపలనయనా! చెప్పు. నీ వెవరికోసం ఆతురతతో అన్వేషిస్తున్నావో చెప్పు.

నేను పౌరబద్ధాను. దేవగణం భూమిని స్పృశించదు. నీవీ భూమిపై చరిస్తున్నావు. కనుక నీవు హ్రీవిగాని రుద్రాణివిగాని శారదవుగాని ఇందిరా దేవివిగాని కావు. అంచేతనే నీవు నాకంటపడ్డావు. కనుక శ్రీ హరిభుజా పాలితమైన వైకుంఠాన్ని లక్ష్మీదేవి అలంకరించినట్లు నీవు నా అధీనంలో ఉన్న ఈ నగరాన్ని అలంకరించు. నీ కడగంటి చూపులచే నా మనస్సు సమ్మోహితమైంది. కామదేవుని సంప్రేరణంచే నీ నునుసిగ్గూ, నీ చిఱునగవూ, నీ కనుబొమల కదలికలూ నన్ను పీడిస్తున్నాయి. సుందరీ! నన్ను చూచి సిగ్గుపడకు.

చక్కని కనీనికలతో గూడిన కన్నుగవతోనూ, సుధామధురములైన వాక్కులతోనూ, మెత్తని నెఱికురులతోనూ, మనోభిరామంగా ఉన్న నీ ముఖాంబుజాన్ని ఎత్తి నన్నొకసారి చూడు — అని పురంజనుడు కామవశుడై సహజ గాంభీర్యాన్ని కోల్పోయి పలికేసరికి ఆ సుమాంగికూడ విమోహితయై ఆనందపారవశ్యంలో మందహాసం చేస్తూ ఇలా అన్నది—

పురుషవరేణ్యా! నా కులగోత్రాలు నాకు తెలియవు. నేనీ పురంలో ఉంటున్నానేకాని దీన్ని నిర్మించిందెవరో కూడా నాకు తెలియదు. వీరు నా సఖులు. ఈ కన్యలు నా చెలిమికత్తెలు. ఈ వృద్ధ సర్పం నేను నిద్రించినపుడు మేల్కొని ఉండి ఈ నగర రక్షణంచేస్తూ ఉంటుంది. రాజేంద్రా! నీవు నాభాగ్యవశంచేత ఇచ్చటికి వచ్చావు. నీకు ఇంద్రియ భోగ్యాలైన కామితాలన్నీ సమకూరుస్తాను నవద్వారాలతో గూడిన ఈ పురాన్ని నీవు కైవశం చేసికొని నూఱేండ్లు పాలించు. నీకంటె నాకు ప్రియులెవ్వరూ లేరు.

---

నారదుడు ప్రాచీనబర్హికి ఈ పురంజనోపాఖ్యానం ద్వారా అన్యాపదేశంగా తత్త్వోపదేశం చేశాడు. పురంజనుడు జీవుడు. అతని భార్య బుద్ధి. పురం శరీరం. అతని మిత్రుడు అవిజ్ఞాతుడు పరమాత్మ. బుద్ధి వెంటనున్న పదిమంది భటులు దశేంద్రియాలు. పంచశీర్షకమైన సర్పం పంచప్రాణాలకు సంకేతం. పురద్వారాలు నేత్రాదులైన శరీరావయవాలు. ఇలాగే ఉత్తరోత్తరా ఈ పురంజనోపాఖ్యానంలో వర్ణింపబడిన వివిధ ఘట్టాలను తత్త్వపరంగా సమన్వయించుకోవాలి. ప్రాచీన బర్హి అభ్యర్థనపై నారదుడే ఈ ఉపాఖ్యానంలో నిగూఢంగా ఉన్న తత్త్వార్థాన్ని విస్పష్టంగా చెపుతాడు.

అదీగాక నీవంటి వాని. కాదని రతిజ్ఞానహీనుల్యుడూ, అకోవిదుడూ ఇహపర చింతాహీనుల్యుడూ పశుతుల్యుడూ అయిన వాని నెవ్వరు వరిస్తారూ! వాస్తవానికి గృహస్థాశ్రమం సర్వక్షేమంకరం. ధర్మార్థ కామమోక్ష ప్రదాయకం ప్రజానంద సంధాయకం. యశస్కరం పితృదేవతలకు. దేవర్షులకు మానవులకు, మానవేంద్రులకు, ఆత్మకు శ్రేయోదాయకమైన ఆశ్రయభూమి నీవు ప్రియదర్శనుడవు. స్వయంప్రాప్తుడవు. సర్పాల్లాంటి నీ దీర్ఘబాహువుల సోయగాన్ని చూచి నాలాంటి కన్య నిన్ను వరించకుండా ఉండగలదా? రాజా! కరుణారసం మందస్మితం తొణికిసలాడెడి నీ కడగంటి చూపులతో దీనజనుల భీతిని హరిస్తూ ఇక్కడ ఉండు –

అని ఆ మందయాన మధురోక్తులతో అలా అనేసరికి పురంజనుడు అమందానందం చెంది ఆమెను వరించి ఆ పురంలో ప్రవేశించాడు.ఆ పురంలో నూఱు సంవత్సరాలు వందిమాగధుల కైవారాలు వింటూ యువతీజనపరివేష్టితుడై రాజోచిత కేళీమందిరాల్లో క్రీడిస్తూ సుఖంగా కాలం గడిపాడు. ఇంతలో తాపోద్దీపకమైన గ్రీష్మకాలం వచ్చేసరికి అతడు క్రీడాజనిత శ్రమను ఉపశమింపజేసుకొనేందుకు ఒక కొలను నీట ప్రవేశించాడు.

ఆ పురానికి తూర్పుదిక్కున అయిదూ, దక్షిణోత్తరాలలో రెండూ, పడమటి దిక్కున రెండూ మొత్తం తొమ్మిది ద్వారాలున్నాయి. వాటిల్లో ఏడు ఉపరిభాగాన రెండు అధోభాగాన ఉన్నాయి ఆ పురపాలకుడైన పురంజనుడు ఆ ద్వారాలవెంట స్వేచ్ఛగా తిరుగుతూ ఉంటాడు.

తూర్పుదిక్కునగల ద్వారపంచకంలో ఖద్యోతం, ఆవిర్ముఖి అను రెండు ద్వారాలున్నాయి పురంజనుడు ద్యుమంతుడను మిత్రునితో గూడి ఆ ద్వారాలవెంట విభ్రాజితం అనే జనపదానికి వెళ్లాడు నళిని, నాళని అను రెండు గవనుల నుండి అవధూత అను అనుగుసఖునితో కలిసి సౌరభం అనే దేశం చూడడానికి వెళ్లాడు. అయిదో వాకిలిపేరు ముఖ్యం. పురంజనుడు ఆ ద్వారంనుండి రసజ్ఞుడను చెలికానితో గూడి బహూదన దేశం, విపణుడను మరో మిత్రునితో కలిసి పణ మనెడి దేశం వెళ్లాడు.

దక్షిణ దిక్కునందు గల ద్వారానికి పితృహూవు అని పేరు. పురంజనుడు శ్రుతిధరుడను స్నేహితునితో గూడి ఆ ద్వారం నుండి దక్షిణపాంచాల దేశానికి పోతాడు. అలాగే దేవహూవను పేరుగల ఉత్తరద్వారంనుంచి ఉత్తర పాంచాలదేశం చూడడానికి వెళ్తాడు. ఇక నగర పశ్చాద్భాగమందున్న ఆసురి అను ద్వారం వెంట ఆ రాజు దుర్మదుడనే సహచరునితో గూడి గ్రామ్యకమనే దేశం, నిర్ఋతి అనే ద్వారం నుండి లుబ్ధకుడను నెచ్చెలితో కలిసి వైశసమను పేరుగల దేశం పోతాడు

ఆ పురజనుల్లో నిర్వాక్కు, యశస్కరుడు అను ఇద్దఱు అందులు న్నారు. వారి సాయంతో పురంజనుడు నడుస్తాడు. వివిధ కర్మలాచరిస్తాడు. అతడు అంతఃపురానికి వెళ్ళేటప్పుడు విషూచి దారిచూపిస్తాడు. ఆ అంతఃపురంలో ఆ రాజు దారసుతాదుల వలన లభించెడి సకలసౌఖ్యాలు అనుభవిస్తాడు. అలా అతడు బుద్ధి అను భార్యచే వంచితుడై కామాతురుడూ కర్మాసక్తుడూ అయి తన వ్యక్తిత్వాన్ని కోల్పోయాడు. ఆమె తింటే తానుతింటాడు. ఆమె త్రాగితే తాను త్రాగుతాడు. ఆమె నడిస్తే నడుస్తాడు. నవ్వితే నవ్వుతాడు. ఏడిస్తే ఏడుస్తాడు పాడితే పాడతాడు. వింటే వింటాడు. చూస్తే చూస్తాడు. కూర్చుంటే కూర్చుంటాడు. నిలబడితే నిలబడతాడు. నిద్రపోతే నిద్రపోతాడు. ముట్టుకుంటే ముట్టుకుంటాడు. మూర్కొంటే మూర్కుంటాడు. శయనిస్తే శయనిస్తాడు. హర్షిస్తే హర్షిస్తాడు. ఇలా ఆమె ఏదిచేస్తే అదల్లా చేస్తాడు. ఆమె చేతుల్లో అతడొక కీలు బొమ్మలాగా ఆమెకు ఒక క్రీడా మృగంలాగా అయ్యాడు.

అలా కొంత కాలం గడిచాక ఆ రాజు ధనుష్పాణియై అయిదుగుఱ్ఱాలు పూన్చిన రథాన్ని అధిరోహించి వేటకు వెళ్ళాడు. ఆ రథానికి రెండుచక్రాలు రెండు నొగళ్ళు ఒక యిరుసు మూడు ధ్వజాలు, అయిదు బంధనాలు, పంచవిధ గమనాలు, ఏడు ఆవరణాలు ఒక పగ్గః ఉన్నాయి. ఒక సారథి ఉన్నాడు. స్వర్ణ కవచం అక్షయ తూణీరాలు ధరించి పదునొకండుగురు సేనానులు వెంటరాగా అతడొకనాడు పంచప్రస్థం అనే వనానికి మృగయా వినోదార్థం వెళ్ళాడు.

అతడెన్నడూ విడిచి ఉండని పట్టమహిషిని విడిచి మృగయాసక్తుడై అసురవృత్తితో నిర్దయంగా కంట బడ్డ మృగాలన్నింటినీ తన నిశితబాణాలతో వధించాడు. రాజులకు మృగయావినోదం నిషిద్ధం కాదు. అదివారికి విహితానుష్ఠానమే. కాని శ్రాద్ధకర్మల నిమిత్తం అయినా నిర్ణీతదినాల్లోనే మాత్రం వధింపదగిన జంతువులను వనమునందే వధింపదగు నను నియమం ఉంది. అంతేకాని విచ్చల విడిగా జంతుహింస చేయరాదు. అలాచేస్తే అది అసుర వృత్తికాగలదు.

పురంజనుడు మృగయా ధర్మాన్ని అతిక్రమించి వధ్యములూ అవధ్యములూ అయిన జంతువులన్నింటినీ నిష్కరుణంగా నిశిత బాణాహతులచే సంహరించి అలసిపోయి నిజమందిరానికి తిరిగి వచ్చాడు. స్నానం చేశాడు. భోజనం చేశాడు. అనంతరం నానా విధాలైన మణిభూషణాలు ధరించి రతిక్రీడాకౌతుకంతో తన భార్యను కలిసి కొనేందుకు శయనాగారికి వెళ్ళాడు. కాని ఆమె అక్కడ కనబడలేదు. అంతఃపురకాంతలను గాంచి-మహారాజ్ఞి యెక్కడః రాజమందిరం ఇలా వెలవెలపోతున్నదేం? వాత్సల్యభని

యైన కన్నతల్లి కాని, భోగాంబుధిలో ఓలలాడించెడి భార్యగాని లేకపోతే గృహమేధికి ఏం సంతోషం ఉంటుంది? ఆ యిల్లు చక్రవిహీనమైన రథం లాగా ఎందుకూ కొఱగాదు. నాకు నిరంతరం సన్మార్గాన్ని బోధిస్తూ వ్యసనార్ణవం నుండి ఉద్ధరించెడి నా అనుగునతి యెక్కడుంది? - అని అడిగేసరికి వారు-రాజేంద్రా! అదిగో! ఆమె అక్కడ తనచీర కొంగైనా సరిగా పరచుకోకుండా నేలమీద పడుకుంది కారణమేమిటో మాకూ తెలియదు-అన్నారు

అపుడు పురంజనుడు ఆతురుడై ఆమె దగ్గఱకు వెళ్ళి ఆమెను తన ఒడిలో కూర్చుండ బెట్టుకున్నాడు. ఆమె చెక్కిళ్ళు నిమురుతూ లేచిగుళ్ళ వంటి ఆమె మృదుచరణాలను ఒత్తుతూ మధురోక్తులతో ఇలా అన్నాడు- కల్యాణి! భృత్యులు అపరాధం చేసినా వారియందు గల పక్షపాతబుద్ధితో కొందఱు రాజులు వారిని దండింపక విడిచిపెడతారు. అది తప్పు అపరాధియైన వాడు తగిన దండనకు పాల్పడవలసినదే నిన్ను విడిచి వెళ్ళి నీయెడల తీరని అపచారం చేశాను. నన్ను నీ యిష్టం వచ్చినట్లు శిక్షించు. కాక నీకెవడైనా ఏదైనా అపరాధం చేసి ఉంటే చెప్పు. అతడు బ్రాహ్మణుడు కానీ భగవద్భక్తుడు గానీ కాకుండా ఉంటే పట్టి పల్లారుస్తాను.

సుదతీ! సుధామాధుర్యాన్ని చిందించెడి నీ వాక్కులు వినిపించవూ! ఇంద్రనీల మణుల్లాంటి నల్లని ముంగురులతో చలించెడి లతల వంటి కనుబొమలతో, మందస్మితంతో గూడిన క్రీగంటి చూపులతో ముద్దులొలుకు నీ ముఖాంబుజాన్ని నాకు చూపవూ!

నీ కోపకారణం ఇంకేదైనా ఉంటే చెప్పు నీవు తిలకం ఎందుకు దిద్దుకోలేదూ! నీ ముఖం కోపరక్తిమతో శోభావిహీనంగా ఉన్నదెందుకూ? నీ స్తనయుగ్మం కన్నీటి బిందువులచే తడిసి కాంతి విరహితంగా ఉన్నదే! పండిన దొండపండులాంటి నీ అధరంపైన తాంబూలరాగం కనబడదేమి! నీ అనుమతి లేకుండా మృగయా వ్యసనంతో నేను అడవికి వెళ్ళినందుకేనా నీకు ఈ ఆగ్రహం? అయితే నా తప్పు మన్నించు. మన్మథ పీడితుడనై, నీకు వశం వదుడనయ్యాను- అని పురంజనుడు సానునయంగా పలికేసరికి-

ఆమె హృదయం ద్రవించింది. లేచి మంగళస్నానం చేసింది శుభ వస్త్రాలు ధరించింది. మణికాంచన భూషణాలలంకరించుకొన్నది మనోహరాకారంతో వచ్చి పతియెదుట నిలబడ్డది. సానబట్టిన మన్మథబాణంలాగా అలా వచ్చి తన యెదుట నిలబడిన నిజకాంతను జూచి పురంజనుడు పులకించి పోయాడు. ఆమెను గాఢంగా కౌగిలించుకొని ఏకాంత మందిరంలో ఆమెను రహఃక్రీడల్లో తేల్చినాడు. ఇది పగలా ఇది రేయా అని కాలవేగం సూచా

తెలిసికోకుండా వివేకం కోల్పోయి ఆమె తోడిదే లోకంగా ఇష్టభోగాల్లో మునిగి యుండగా అతని యౌవనకాలం ఇట్టే గడిచిపోయింది.

కాలక్రమంలో పురంజనునకు ఆమె వలన పదునొకండువందల మంది రణకర్కశదేహులైన కొడుకులు, నూటపదిమంది గుణశీల సంపన్నులైన కూతుళ్ళు కలిగారు. యుక్తవయసు రాగానే వారందరికి రాజు వివాహాలు చేశాడు. అతని కొడుకులొక్కొక్కనికి నూర్గురు పుత్రులు కలిగారు. వారివలన అతని వంశం పాంచాలదేశంలో వృద్ధిచెందింది. వారందరు శౌర్యధనులు. వారు గృహకోశాల ననుసరించి జీవయాత్ర చేస్తుండగా పురంజనుడు మాత్రం దారసుతాదులందు మమకారంతో సంసారలంపటుడై జీవిస్తున్నాడు.

అతడు పశువులను వధించడంచేత హింసాగర్భములైన యాగాలు చేస్తూ నీలాగానే పితృదేవతలను దేవతలను ఆరాధిస్తున్నాడు. ఇలా అతడు ఫలాపేక్షతో కర్మాచరణం చేస్తూ నిరంతరం భోగాసక్తుడై ఉండగా తనకూ తనప్రియాంగనా జనానికి అప్రియమైన జరాభారం (వార్ధక్యం) అతనిపై బడ్డది. చండవేగుడని ప్రఖ్యాతిగాంచిన గంధర్వపతి ఒకడున్నాడు. అతడు సంవత్సరాత్మకుడు. సితాసితవర్ణాలు కలిగి మిధునీభూతు (దంపతు) లైన దివసాత్మకులగు మూడువందల అఱువైమంది గంధర్వులూ, అదే సంఖ్యగల నిశాస్వరూపలైన గంధర్వాంగనలు అతని అనుచరులు. ఆ గంధర్వరాజు వారిని వెంటబెట్టుకొని పురంజనుని పురాన్ని నిరోధించగా అతని అనుచరులైన గంధర్వదంపతులు ఎంతో కల్లోల్లాన్ని సృష్టించారు.

ఆ పురాధ్యక్షుడు ప్రజాగరుడనువాడు తానొక్కడే ఆ గంధర్వ గణంతో నూఱు సంవత్సరాలు పోరాడి క్షీణబలుడై యుండగా పురంజనుడు చింతాక్రాంతుడై ఆ పురంలోనే ఉండి పాంచాలదేశాలనుండి నిజపార్షదులు తెచ్చిన భోగ్యపదార్థాలు గ్రహిస్తూ అల్పభోగాలనుభవిస్తూ కాలం గడుపుతున్నాడు.

కాలపుత్రిక (జర) అను ఒక కామిని ఉంది. ఆమెను పూర్వం ఒకప్పుడు యయాతి కుమారుడైన పూరువు సమాదరించేసరికి ఆమె సంతసించి అతనికి రాజ్యపట్టం వచ్చేటట్లు చేసింది. కాని దౌర్భాగ్యవశంచేత ఆమె తన సౌందర్యాన్ని కోల్పోయినా, వరేచ్ఛతో ఆమె లోకాలన్నీ తిరిగింది. కాని ఆమె నెవ్వరూ దరిచేరనియ్యలేదు.

ఒకనాడు ఆ జరాకన్యక భూలోకంలో తిరుగుతూ బ్రహ్మలోకం నుండి భూమండలానికి అవతరించిన నన్ను చూచింది. నేను నైష్ఠికుడనని తెలిసీ కూడ ఆమె కామపరవశయై నన్ను వరించింది. నేను ఆమెను ప్రతిషేధించాను. అపుడామె పట్టరానికోపంతో "మునీంద్రా! నీవు నన్ను తిరస్కరించావు

కనుక ఇక మీదట నీవు ఒక స్థానమందు స్థిరంగా ఉండకుండా నిరంతరం తిరుగుతూ ఉంటావు- అని శపించింది.

అనంతరం ఆమె నా ఉపదేశం విని యవనాధీశ్వరుడైన భయుడను వాని దగ్గఱకు వెళ్ళి ఇలా అన్నది- వీరుడా! నేను నిన్ను పతిగా వరించి గంపెడాశతో వచ్చాను. నా ఆశ అడియాస కాదని నా నిశ్చితం. లోకదృష్టితో గాని వేద దృష్టితోగాని ఈయదగిన వస్తువును అర్థించినవానికి ఈయని వానిని, అలాగే అర్థించదగిన వస్తువున్న అడిగి తీసికోని వానిని నిరువురనూ జడస్వభావులని సజ్జనులు గర్హిస్తారు కావున నిన్ను కామించిన నన్ను స్వీకరించు. ఆర్తులను కరుణించడం పురుషధర్మం కదా! -అనగా భయుడు మందస్మితంచేస్తూ దేవగోప్యమైన ఒక మహాకార్యాన్ని చేయగోరి వచ్చిన ఆమెతో ఇలా అన్నాడు-

తరుణీ! నీవు అశుభవు లోకంలో నిన్నెవ్వరూ అభిలషించరు. నేను జ్ఞానదృష్టితో నీకు పతిని రూపణం చేస్తాను. నాకు ఆధివ్యాధులను అపార సేనా వాహిని ఉంది ఆ సేనా సహాయంతో నీవు ప్రజానాశనంచేసి అవ్యక్తగతివై లోకమంతా తిరుగుతూ కర్మనిర్మితమైన లోకాన్ని ఆక్రమించి భోగించు. లోకమేనీకు పతియు గతియు కాగలదు. నాకు ప్రజ్వారుడను సోదరుడున్నాడు. నీవు నాకు చెలియలవు. మీరిరువురితో గూడి నేనున్నూ ఎవరికీ కనబడకుండా నా సైనిక వర్గంతో లోకంలో వర్తిస్తాను-అని యవనేశ్వరుడైన భయుడన్నాడు.

అంతట అతని ఆజ్ఞాపాలకులైన సైనికులు ప్రజ్వారునితోనూ కాలకన్యకతోనూ గూడి భూమండలం అంతా తిరుగుతూ ఒకనాడు నకల భౌతిక భోగాలతో తులతూగుతూ, వృద్ధ పన్నగు పరిరక్షితమైన పురంజన పురాన్ని ఆక్రమించారు. తనచేజిక్కిన ఎంతటివానినైనా పీల్చి పిప్పిచేయగల ఆ జరా కన్యక ఆపురంలో ప్రవేశించి దాన్ని శిథిలం చేసింది. అలా శిథిలమైన ఆ పురం వివిధ ద్వారాలనుండి యవన సైనికులు పురంలో ప్రవేశించి అందఱిని పీడించడం మొదలుపెట్టారు.

అయినా స్వపురమందు అభిమానం విడువని పురంజనుడు మమకారంలో వ్యాకులచిత్తుడై ఎంతో పరితాపం చెందాడు. కాలకన్యక (ముసలితనం) అతనని ఆక్రమించేసరికి అతడు సంపద్విహీనుడయ్యాడు. మతి కోల్పోయాడు. అతని సర్వశక్తులు ఉడిగిపోయాయి. గంధర్వులచేతను యవనుల్చు చేతను ఆక్రమింపబడిన పురం కాంతి విరహితమైంది అతని పుత్రులూ పౌత్రులూ, సచివులూ పురోహితులూ తుదకు అతని భార్యకూడా అతిన్ని

అనాదరించడం మొదలుపెట్టారు. పాంచాలదేశాలు కూడా శత్రుదూషితాలయ్యాయి.

జరాగ్రస్తుడైన పురంజనుడు అపుడెంతో పరితపించాడు. ఏం చెయ్యాలో అతనికి తోచలేదు. అతని బల వీర్యాలు నశించినా ఇంకా అతనిని భోగలాలస విడువలేదు. కాలకన్యక కౌగిల్లో చిక్కి గంధర్వయవనాక్రాంతమైన నిజ పురాన్ని అంటిపెట్టుకొని ఉండాలనే అతని ఆకాంక్ష. అయినా విధిలేక విడిచి పెట్టడానికి యత్నించాడు.

అంతలో భయుని అగ్రజుడైన ప్రజ్వారుడు పురాన్ని దగ్ధం చేశాడు. అపుడు పురంజనుడు శోకవేగంతో కంపించిపోయాడు. అతనిలో అణుమాత్రం కూడా శక్తిలేదు. అతని అవయవాలన్నీ శిథిలీభూతాలయ్యాయి. గొంతుకలో ఘురఘుర ధ్వని బయలుదేరింది. అయినా ఆత్మీయపరివారమందూ భుక్తావశిష్టమైన ధనాదిక భోగవస్తువులందూ అభిమానం మాత్రం వదలలేదు ఇక భార్యా వియోగానికి అతడెంత తహతహ చెందాడో చెప్పడానికి సాధ్యంకాదు.

అపుడాతడు ఆత్మగతంలో—అయ్యో! నేను పరలోకగతుడనైతే నా యిల్లాలు అనాథయై ఒంటరిగా శోకాక్రాంతులైన ఈ పిల్లలను ఎలా పోషిస్తుంది? నేను తినకపోతే తాను తినదు. నేను స్నానం చెయ్యకపోతే తాను స్నానం చెయ్యదు. నేను అలిగితే ఆమె అదలిపోతుంది. నేను అదలిస్తే ఆమె భయపడి ఎదురుచెప్పదు. వివేకం కోల్పోయి నేనేదైనా అకృత్యం చెయ్యదలిస్తే ఆమె సమయోచితంగా నాకు హితం ఉపదేశించేది. అలాంటి నా ప్రాణేశ్వరి నన్ను విడిచి పెట్టి ఆమె గృహస్థ ధర్మాన్ని ఎలా నిర్వహిస్తుంది?

ఆమె వీరపత్ని కనుక నన్ను అనుగమించినా అనుగమించవచ్చు. అపుడీ పిల్లలందరు సముద్ర మధ్యమున భిన్ననౌకలవలె అగతికులై అల్లాడిపోతారు— అని అతడు విలపిస్తూ తగులబడుతూన్న చెట్టు తొఱ్ఱనుండి సర్పంలాగా అతడు పురాన్ని విడిచిపెట్టడానికి ఉద్యుక్తుడయ్యేసరికి భయుడతన్ని పట్టుకున్నాడు. యవనసైనికులు అతన్ని పశువును బంధించినట్లు బంధించి ఈడ్చుకొని పోతూండగా శోకాతురులైన అతని పరిచరులందరు వెంటపడ్డారు. పురసంరక్షణంచేసెడి పంచశీర్ష పన్నగం పురాన్ని విడిచి వెళ్ళింది. ఆ పురం అపుడు విశీర్ణమైన ప్రకృతిలో కలిసిపోయింది.

బలవంతులైన యవనులు పురంజనుని అలా బలాత్కారంగా ఈడ్చుకొనిపోతూన్నా మోహాంధకారం కనుగప్పడంచేత అతడు తన పూర్వసఖుడైన విజ్ఞాతుని (ఈశ్వరుని) స్మరింపనైనా స్మరింపడయ్యె. అతడు పరలోకగతుడు కాగా పూర్వం అతనిచేత యజ్ఞాల్లో వధింపబడిన పశువులు కోపోద్రేకంతో

అతనిని తమ వాడి కొమ్ములతో పొడిచి పొడిచి పీడించాయి. స్త్రీలోలుడై అజ్ఞానాంధకారంలో మునిగి నష్టజ్ఞానుడైన పురంజనుడు చాలాకాలం పర లోకంలో నరకయంత్రణ అనుభవించి నిజభార్యను నిరంతరం మనస్సులో తలపోస్తూ ఉండడంచేత తరువాతి జన్మలో విదర్భరాజునింట స్త్రీగా జన్మిం చాడు.

ఆ వైదర్భిని మలయకేతనుడను రాజు వీర్యం పణంగా పెట్టి వివాహ మాడాడు. అతడు పాండ్యదేశాధీశుడు. శత్రుపురంజయుడు. దారుణ రణ రంగంలో అతడెందరో రాజన్యులను నిర్జించాడు. ఆ విదర్భ పుత్రికయందు అతనికి ఒక కూతుర ఏడుగురు కొడుకులు జన్మించారు. ఆ కొడుకులు ద్రవిడదేశాధిపతులై రాజ్యపాలనం చేశారు. వారికి ఒక్కొక్కరికి అర్బుద సంఖ్యాకులైన కొడుకులు పుట్టారు.

అతని కూతురు ధృతవ్రత. ఆమెను అగస్త్యుడు పరిణయమాడి ఆమె వలన దృఢచ్యుతుడను మునీంద్రుని కొడుకుగా పొందాడు. ఆ దృఢచ్యుతు నకు ఇధ్మవాహుడు జనించాడు. అనంతరం మలయధ్వజుడు విరక్తుడై రాజ్యాన్ని తన కొడుకులకు పంచియిచ్చి శ్రీహరి పాదకమల సేవాయత్త చిత్తుడై కులపర్వత ప్రాంతానికి వెళ్లాడు. అపుడాతని సతియగు విదర్భి కొడుకులను, గృహాలను, భోగాలను విడిచి చంద్రుని చంద్రిక (వెన్నెల) అనుసరించునట్లు పతిని అనుసరించి వెళ్ళింది.

మలయధ్వజుడు చంద్రమస, తామ్రపర్ణి, సవోదక మొదలైన పుణ్య నదుల్లో క్రుంకులిడి బాహ్యాభ్యంతర మాలిన్యాన్ని అపనయించుకున్నాడు. కందమూలాలు, పండ్లు, జీర్ణపర్ణాలు, నదీతోయాలు ఆహారంగా శరీరకర్శన మైన దారుణ తపశ్చర్యకు పూనుకున్నాడు శీతోష్ణాలు వర్షవాతాలు, క్షుత్పి పాసలు, ప్రియాప్రియాలు, సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాలను, ఇంద్రియా లను, సమదర్శనుడై జయించాడు. తపస్సులోను, యమ నియమాలలోను, కామవాసనలను నిర్మూలించి బ్రహ్మమునందు నిజాత్మను అనుసంధానంచేసి స్థాణువులాగా చలనరహితుడై నూఱు దివ్యసంవత్సరాలు ఉగ్రతపం చేశాడు.

భగవంతుడైన వాసుదేవుని యందు మాత్రమే ప్రీతివహిస్తూ అన్యమేదీ యెఱుగక ఆ రాజేంద్రుడు తనను స్వప్నంలో "మమేదం శిరశ్ఛిన్నం"1

1. స్వప్నంలో తన తల ఛేదింపబడినట్లు ప్రతీతి కలుగుతుంది. మేల్కొన్న తరువాత అది అసత్యమని గ్రహిస్తారు. అలాగే ద్రష్టయైన పరమాత్మను జీవాత్మయందు వ్యాపకత్వ ధర్మంచే చూచి విద్వాంసుడు స్వప్నవృత్తాంతం లాగానే దానినుండి మఱలి కేవల పరమాత్మాను సంధానం చేసుకుంటాడు.

ఇత్యాది ప్రతీతి యందువలె దేహాది వ్యతిరిక్తునిగా ఆ మర్మ (అంతఃకరణ) సాక్షిగా తెలిసికొని సర్వేశ్వరుడైన శ్రీహరి యనెడి గురువు అనుగ్రహించిన విశ్వతోముఖమూ, స్వయంప్రకాశితమూ అగు విశుద్ధజ్ఞాన దీపపుకాంతిచే పర బ్రహ్మమందు తననూ, తనయందు పరబ్రహ్మనూ సాక్షాత్కరింపజేసు కొన్నాడు. తుదకు ఉపాసనాత్మకమైన ఆ పరమజ్ఞానం కూడా కాలిపోయిన చిదుగు నందలి అగ్నిలాగా దానంతట అది ఉపశమించింది.

అతని భార్య విదర్భ రాజకన్య అతనికి పరిచర్య చేస్తూ అక్కడే ఉంది. ఆమె మహాపతివ్రత. సచ్చీల. భోగాలు విడిచి నారచీరలు, జటలు ధరించి వ్రతనియమాలతో కృశించిపోయింది. తపోనియతితో ఆమె ధూమ విరహితయైన అగ్నిజ్వాలలాగా ఉంది. తన పతి ఉపరతుడవడం ఆమెకు తెలియదు. పూర్వంలాగానే సేవాభావంతో అతని పాదాలను స్పృశించింది. కాని అవి చల్లబడి ఉన్నాయి. అణుమాత్రం కూడా వేడి లేదు. అపుడాతరు బ్రహ్మనిర్యాణం పొందాడని గ్రహించి గుంపునుండి తప్పిన లేడిలాగా దిక్కుతోచక శోకవేగంతో కంపించిపోయింది.

ఆమె కనులవెంట శోకాశ్రువులు స్రవించి వక్షాన్ని తడిపివేశాయి. విరహతాపంతో ఆమె హృదయం దహించుకు పోయింది. ఆమె అధరం కందిపోయింది. ఆ విపినాంతరంలోఆమె గోడుగోడున ఏడుస్తూ— నరనాథా! సాగర మేఖలావలయితమైన భూమండలం నీవు లేకపోతే చోరపీడితమై నశించిపోతుంది. కనుక నీవు ఉపేక్షించడం తగదు. తిరిగి ధరాపాలనం చెయ్యడానికి లేచిరా— అని విలపిస్తూ అతని పాదాలపై వ్రాలింది.

అనంతరం కొంతసేపటికి చితిని పేర్చి దానిపై పతి మృతకళేబరం ఉంచి నిప్పుముట్టించి తాను కూడా అతని అనుగమించడానికి ఉద్యుక్తురాలు అయ్యేసరికి వారికి పూర్వసఖుడూ, జ్ఞానస్వరూపకుడూ అయిన ఒక భూసు రుడు వచ్చి ఆమెను అనునయిస్తూ ఇలా అన్నాడు—తలోదరీ! నీవెవ్వతవు? ఎవ్వనిదానవు? ఈతడెవ్వడు? ఇతని కోసం నీవు విలపించడం దేనికి? నీవు నన్ను ఎరుగుదువా?

ఈ సృష్టికి పూర్వం నీవు నాతో స్నేహసౌఖ్యం అనుభవించావు. నేను నీ సఖుడను. పూర్వం మనం మానస నివాసులమైన హంసలం. వేయి సంవత్సరాలు కలిసి మెలిసి స్నేహభావంతో సంచరించాం. కాని నీకు భౌమ భోగాలయందు ఆసక్తి కలగడంచేత నన్ను విడిచి భూమండలానికి వచ్చి ఒక పురం చూచావు దానికి అయిదు ఆరామాలున్నాయి నవద్వారాలున్నాయి. అది ఏకపాలకం, త్రికోష్ఠకం, షట్కులం, పంచవిపణం, పంచప్రకృతి కలి తం. అది స్త్రీ నిర్మితం. ఇంకా వివరంగా చెపుతాను. విను.

అయిదు ఆరామాలంటే శబ్దాది విషయపంచకం. ముఖనాసికాది రంధ్రాలు నవద్వారాలు. ప్రాణమొక్కటే దానికి పాలకుడు. పృథివి, జలం, తేజం ఈ మూడు త్రికోష్ఠాలు. జ్ఞానేంద్రియ పంచకం, మనస్సు షట్కులాలు. కర్మేంద్రియాలు అయిదు అయిదు అంగడులు. పంచభూతాలు ప్రపంచ ప్రకృతులు. స్త్రీ నిర్మితం అంటే శక్తిచే నిర్మింపబడినది భావం. వీటితో గూడిన పురం దేహం.

ఆ పురంలో నీవు ఆ స్త్రీకి వశంగతుడవై దానితో రమిస్తూ స్మృతిని కోల్పోయి ఆమెను నిరంతరం సంస్మరిస్తూ ఉండటంచేత నీకు ఈపాపిష్ఠమైన దశ ప్రాప్తించింది. వాస్తవంగా నీవు వైదర్భీకావు. ఇతడు నీ పతీ కాడు. పూర్వజన్మలో పురంజనుడవూ కావు పూర్వజన్మలో పురుషుడననిన్నీ ఈ జన్మలో స్త్రీననిన్నీ నీవు భావించడం కూడా అవివేకం. ఇదంతా నా మాయా కల్పితం.

పూర్వం మనం హంసలం మన ఉభయులకు భేదభావంలేదు. నేనే నీవు. నీవే నేను. అంతేకాని అన్యులంకాము. విద్వాంసులు మన యిద్దఱి యందు అంతరం చూడరు. పురుషుడు అద్దంలో తన ప్రతిబింబం చూచి తనను భిన్నరూపునిగా భ్రాంతి చెందుతాడు- అని అవిజ్ఞాతు చెప్పగా ఆమెకు తద్వియోగనష్టమైన జ్ఞానం కలిగింది- అని నారదుడు ప్రాచీన బర్హిని చూచి- రాజా! ఈ అధ్యాత్మతత్వం నీకు రాజ కథావ్యాజంతో చెప్పాను అనేసరికి- ప్రాచీనబర్హి- మునీంద్రా! నీ వాక్యాలు సంకేతార్థ నిగూఢంగా వున్నాయి. పండితులకు అవి తెలియగలవు. కాని కర్మ విమోహితులమైన మాకు సుబోధ కాలు కావు. అనగా నారదమహర్షి ఆ నరేంద్రునకు ఇలా అన్నాడు.

## నారదుడు ప్రాచీన బర్హికి పురంజనోపాఖ్యానంలోని గూఢార్థాన్ని వివరించి చెప్పడం

నృపాలా! విను. పురంజనుడనగా పురుషుడు (జీవాత్మ) పురమంటే శరీరం. ఆ శరీరానికి ఒకటిగాని, రెండుగాని, మూడుగాని, నాల్గుగాని, అంత కంటె ఎక్కువగాని పాదాలుంటాయి. ఒక్కొక్కప్పుడు అది అసలు పాదం లేకుండా కూడా ఉండవచ్చు. నామక్రియలచేతగాని, గుణాదికం చేతగాని తెలియబడని పరమేశ్వరుడా పురంజనునకు మిత్రుడు. కనుకనే అతనికి 'అవిజ్ఞాతు' డని పేరు కలిగింది.

ఆ శరీరానికి తొమ్మిది ద్వారాలుంటాయి. పురుషుడు ఇంద్రియ సుఖా లను పరిపూర్ణంగా అనుభవించాలను కున్నప్పుడు నవద్వారాలూ, రెండు చేతులూ, రెండు కాళ్ళూగల పరిపూర్ణ మానవశరీరమే ఉత్తమమైనదని

భావించి అలాంటి పురాన్ని అన్వేషిస్తూ బయలుదేరి వెళ్తాడు. పోగాపోగా అతనికి తాను ఊహించిన పురం దొరుకుతుంది. అతనిక్కడ ఒక స్త్రీ కంట బడుతుంది. అతడామెను వరిస్తాడు. ఆమెయే బుద్ధి. ఆ బుద్ధి అహంకార మమ కారాలు పుట్టించి మదాన్ని కలిగిస్తుంది కనుక ఆమెకు ప్రమద అనే నామం కలిగింది. ప్రమదయైన బుద్ధినాశ్రయించి అతడు ఇంద్రియ సుఖాలను భవిస్తాడు.

ఆమె ననుసరించి వచ్చేది భటులు మనస్సుతో కూడిన దశేంద్రియాలు. ఆమె చెలిమికత్తెలు ఇంద్రియవృత్తులు. శరీరాన్ని రక్షించేది ప్రాణం. ఆ ప్రాణాలు అయిదు. అంచేత అయిదు తలలుగల సర్పం ఆ పురాన్ని రక్షిస్తూ న్నట్లు చెప్పబడ్డది. శరీరానికి గల నేత్రాది నవరంధ్రాలూ ఆ పురద్వారాలు' వీటిలో నేత్రాలూ, నాసికా రంధ్రాలూ, నోరూ- ఈ అయిదు తూర్పువైపున గల పంచద్వారాలు. దక్షిణ కర్ణం దక్షిణ ద్వారం. ఉత్తర కర్ణం ఉత్తర ద్వారం. స్త్రీ పురుష రహస్యాంగాలు రెండూ పశ్చిమ ద్వారాలు

ఏకత్రనిర్మితాలైన ఖద్యోతావిర్ముఖులు నేత్రాలు. విభ్రాజితం అంటే రూపం. ద్యుమంతుడంటే దర్శన సాధనమైన చక్షువు. నళినీ నాళినీ అను ద్వారద్వయం నాసికారంధ్రాలు. గంధ - సౌరభవిషయం. అవధూత అంటే ఘ్రాణేంద్రియం. ముఖ్య అంటే ముఖం (నోరు). విపణం అంటే వాక్కు. రసజ్ఞుడంటే రసం. ఆపణం అంటే వ్యవహారం. బహూదనం అంటే నానా విధాలైన అన్నం. పితృహువు కుడిచెవి. దేవహువు ఎడమచెవి.

చండవేగుడనగా కాలపరిమాణాన్ని తెలియచేసెడి సంవత్సరం. అది చక్రం లాగా ప్రచండంగా పురుషాయువును కొలుస్తుంది. గంధర్వులు పవళ్ళు. గంధర్వాంగనలు రాత్రులు. పరివర్తనం అంటే ఆయుర్హరణం. కాలకన్యక అంటే జర (ముసలితనం). యవనేశ్వరుడంటే మృత్యువు. అతని సైనికులు ఆధివ్యాధులు. ప్రజ్వారుడనగా శీతోష్ణభేదాలతో గూడిన రెండు విధాలైన జ్వరం. దక్షిణపాంచాలం అంటే కేవలత్రివర్గ సాధనోపాయం తెలిపెడి ప్రవృత్తిశాస్త్రం. అది పితృలోకప్రాపకం ఉత్తర పాంచాలం అంటే బ్రహ్మో పాసనమును గురించి తెలిపెడి నివృత్తిశాస్త్రం. అది దేవలోక ప్రాపకం. శ్రుతధరుడంటే చెవి. ఆసురి అనగా పశ్చాద్ద్వారమైన పురుషాంగం. గ్రామకం అంటే రతిసుఖం. దుర్మదుడంటే గుహ్యేంద్రియం. నిర్ఋతి యనెడి పశ్చిమ ద్వారం స్త్రీ రహస్యాంగం. వైశసం అంటే నరకం అంధులంటే పాణి పాదాలు. అంతఃపురం అంటే హృదయం. విషూచి అంటే మనస్సు - అని నారదుడు ప్రాచీన బర్హికి ఇంకా ఇలా చెప్పడం మొదలుపెట్టారు.

రాజా! విను, ఈ పురంజనోపాఖ్యానంలో మానవదేహం రథంగా

నిరూపింపబడ్డది కదా! ఆ రథానికి గుఱ్ఱాలు ఇంద్రియాలు. చక్రాలు పుణ్యపాపాలు. రథగమనం సంవత్సర వేగతుల్యం. సత్వరజస్తమోగుణాలు ధ్వజాలు. పంచప్రాణాలు పంచబంధన స్థానాలు. మనస్సు పగ్గం. బుద్ధి సారథి. హృదయం రథికుడు కూర్చుండు స్థానం. శోకమోహాలనెడి ద్వంద్వాలు కాడి బంధించెడి చోట్లు. ఇంద్రియార్థాలు బాణాలు. సప్తధాతువులు సప్తచర్మావరణాలు. రజోగుణం అక్షయతూణీరం. ఎండమావుల్లాగా సుఖాభాసాలైన బాహ్యవిషయాలను గూర్చి పరువులెత్తెడు ఏకాదశేంద్రియాలు సేనలు. పంచేంద్రియాలచేత మృగయావినోదంలాగా హింసాదులచేత విషయ సుఖాలనుభవించడమే వేట.

ఇలా జీవుడు దేహంలో చిక్కుపడి ఆధ్యాత్మికం, అధిదైవికం, ఆదిభౌతికం అనెడి తాపత్రయాన్నీ ఇంకా నానావిధాలైన దుఃఖాలనూ, అనుభవిస్తూ అజ్ఞానావృతుడై ఉంటాడు. ఆత్మయందు ప్రాణేంద్రియమనోధర్మాలను ఆరోపించుకొని సుఖ లేశాలకోసం చింతిస్తూ అహంకారమమకారాలకు లోనై కర్మాచరణం చేస్తాడు. స్వయంప్రకాశతఉన్నా పురుషుడు, ఆత్మజ్ఞానం కోల్పోయి ప్రకృతి గుణాల్లో ఎపుడు తగుల్కొంటాడో అపుడతడు గుణాభిమానియై కర్మవశుడవుతాడు. సాత్విక కర్మలతో కాంతిబహుళములైన లోకాలనూ, రాజసకర్మల వలన శోకసంపాదకములైన లోకాలనూ, తామసకర్మలాచరించి అజ్ఞానం, శోకం, మోహం కలిగించెడి లోకాలను పొందుతాడు.

తాను చేసెడి కర్మలకు అనుగుణంగా జీవుడు ఒకప్పుడు మనుష్య జన్మమునూ, ఒకప్పుడు దేవజన్మమునూ, ఒకప్పుడు పశుపక్ష్యాది జన్మమునూ, అందులో ఒకప్పుడు స్త్రీత్వం, ఒకప్పుడు పురుషత్వం, ఒకప్పుడు నపుంసకత్వం పొందుతాడు. ఆకలిగొన్న కుక్క యింటింటికి తిరిగి స్వకర్మాయత్తమైన అన్నమునుగానీ, తన్నులనుగానీ ఎలా పొందుతుందో అలాగే జీవుడు కామములందు కోర్కెకలవాడై తాను చేసిన కర్మలును అనుగుణంగా దైవయోగం చేత ప్రియంగాని అప్రియంగాని అనుభవిస్తూ జననమరణ చక్రంలోపడి త్రిలోకాల్లో తిరుగుతూ ఉంటాడు.

దుఃఖ నిర్మూలనం సులభం కాదు. దుఃఖాలకు ప్రతీకారం చేసినా అవి పూర్తిగా నశింపవు. ఆ ప్రతిక్రియ కూడా దుఃఖహేతువే అవుతుంది. ఎలాగంటే పురుషుడు తలపై భారాన్ని మోస్తూ తలకు విశ్రాంతి కలిగించే నిమిత్తం ఆ భారాన్ని భుజంపై వహిస్తే తలకు బాధతొలగవచ్చు. కాని అది భుజానికి తప్పదు. కనుక కేవలకర్మరూపకమగు ప్రతీకారం దుఃఖాలను మొదలంట నశింపజేయలేదు.

జ్ఞాన రూపాలైన కర్మలుకూడా దుఃఖహేతువులైన కర్మలను పూర్తిగా నివర్తింపజేయలేవు. ఎందుచేతనంటే ఆ రెండువిధాలైన కర్మలూ స్వప్నంలోని

స్వప్నాంతరంలాగా అవిద్యామూలకాలే. స్వప్నంలో ఉపాధిభూతమైన మనస్సు సంచరిస్తూ ఉంటుంది. మెలకువ కలిగినా దానిని స్వప్నసంబంధమైన సంస్కారాలు విడిచిపెట్టవు. తత్త్వజ్ఞానంచే అవిద్య నశించనంతవరకు సంసృతిబంధం విచ్ఛిన్నంకాదు.

హరిభక్తి ఒక్కటే అన్ని అనర్థాలకు మూలమైన సంసృతిని విచ్ఛిన్నం చేయగలదు. వాసుదేవుని మీద భక్తిసమాహితం అయితే అది సరియైన రీతిలో వైరాగ్యాన్ని, జ్ఞానాన్ని కలిగిస్తుంది. హరికథాశ్రయమైన ఆ భక్తి భాగవతుల సాంగత్యంతోకాని కలుగదు. మహాత్ములైన భగవద్భక్తుల నోటినుండి స్రవించెడి హరికథామృతప్రూరాన్ని, సావధానులై కర్ణపుటాలతో తనివిదీరా త్రాగేవారిని దేహసంబంధమైన ఆకలి దప్పులుగానీ శోక మోహాలుగానీ బాధించవు. కనుక భగవద్భక్తుల సహవాసం అవసరం—అని నారదుడు ప్రాచీన బర్హికి ఇంకా ఇలా చెప్పడం మొదలుపెట్టాడు.

రాజా! బ్రహ్మ ఈశ్వరుడు, మనువు, ప్రజాపతులైన దక్షాదులు, సనకాదులు, మరీచి, అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, వశిష్ఠుడు, నేను బ్రహ్మవాదులం. మేమందరం వాగీశ్వరలమూ, తపోయోగసమాధినిష్ఠులమూ అయి ఉపాసిస్తున్నా సర్వసాక్షియైన ఈశ్వరుని ఇప్పటికీ చూడజాలకుండా ఉన్నాం. అలాంటప్పుడు అనంతాలు, దురధిగమాలు అయిన నానా విధ కర్మములను ఆచరిస్తూ ఇం దాది దేవతలను భజించే సామాన్యులకు భగవత్సాక్షాత్కారం కావడం సాధ్యమా?

ఆత్మభావితుడైన భగవంతుని కరుణకు పాత్రుడైనవాడు మహాత్ముడై లోకవ్యవహారాలయందు గానీ, వేదోక్తాలైన కర్మలయందు గానీ, ఆసక్తి వహింపడు. చెవికి ఇంపుగా ఉండి పరమార్థ రూపాలుగా గోచరిస్తూ పరమార్థ భూతమైన వస్తువును స్పృశించనైనా స్పృశించని కర్మలయందు బుద్ధిని జొన్పించకు. మలిన బుద్ధులైన కొందరు జనార్దన ప్రతిపాదితమైన వేదం కర్మపరం అంటారు. వాస్తవంగా వారు వేదజ్ఞులు కారు స్వస్వరూపభూతమైన ఆత్మతత్వమే వేద తాత్పర్యమని వారికి తెలియదు.

కనుక ఓ రాజేంద్రా! ఈ భూమండలం అంతా ప్రాగగ్రాలైన దర్భలు పఱచి అహంకారంతో అవినీతుడవై అసంఖ్యాకాలైన పశువులను హింసించడం తప్పితే నీకు కర్మస్వరూపంగాని, విద్యాస్వరూపంగాని తెలియదు. ఆ కర్మ విద్యాస్వరూపా లెలాఉంటాయో చెపుతాను విను. ఏది సర్వేశ్వరునకు పరితోషం కలిగిస్తుందో అదే కర్మ. దేనివలన సర్వేశ్వరుని యందు బుద్ధి జనిస్తుందో అదే విద్య-దేహధారులకు అతడే ఆత్మ, ఈశ్వరుడు. కనుక ఆ శ్రీహరి చరణమూలమే పురుషులకు క్షేమంకరమైన ఆశ్రయం. అతన్ని సేవించేవారికి అణుమాత్రం కూడా దుఃఖం ఉండదు. అలాంటి భగవత్స్వ

రూపం తెలిసికొన్నవాడే విద్వాంసుడు, గురువు. అంతేకాదు అతడే సాక్షా త్శ్రీహరి- అని నారదు డింకా ఇలా అన్నాడు.

రాజా! ఇంకో రహస్యం చెపుతాను. విను. పుష్పవనంలో కామ పరవశమైన లేడి తన ప్రియాంగనను వెంటబెట్టుకొని పుష్ప పరీమళాన్ని ఆస్వాదిస్తూ తుమ్మెదల మధుర ఝుంకృతికి పరవశిస్తూ తిరుగుతూ ఉంటుంది. దానిముందు తోడేళ్ళుంటాయి. వెనుకవైపున బాణం సంధించి బోయవాడుం టాడు. కాని కామాంధమైన ఆ మృగం అవేవీ గణింపదు. తుదకు దానికి మృత్యుభీతి తప్పదు.

అలాగే పురుషుడు అంగనా నివాసాల్లో క్షుద్రమైన కామసుఖాన్ని ఆశించి స్త్రీలోలుడై తుమ్మెదల ఝుంకారాల్లాంటి వారి మధురాలాపాలకు పులకించిపోతూ ఎదుట ప్రత్యక్షంగా, తోడేళ్ళలాగా ఆయువును హరించెడి అహోరాత్రాలను గాని, వెనుక పరోక్షంగా మృత్యుపాశం చే దాల్చి సమయం కొఱకు నిరీక్షిస్తున్న యమునిగా గణింపడు.

కనుక నరేంద్రా! నీవు నేను చెప్పిన మృగచేష్టితాన్ని దృష్టిలో పెట్టు కొని నీ మనస్సును నిగ్రహించుకో. శ్రౌతకర్మలనుండిగాని నిస్మార్త కర్మల నుండిగాని నీ మనస్సును మరలించు. గృహస్థాశ్రమాన్ని విడిచిపెట్టు సకల జీవులకు ఆశ్రయుడైన ఈశ్వరుని భజించు సర్వంలో విరక్తి వహించు- అని నారదర్షి ఉపదేశించగా ప్రాచీనబర్హి ఇలా అన్నాడు—

మునీంద్రా! నీవు సాక్షాద్భగవంతుడవు విజ్ఞాననిధివి నీవు ఉపదేశించిన ఆత్మతత్వం విని విమర్శించి హృదయగతం చేసుకున్నాను కర్మనిష్ఠులైన ఉపాధ్యాయులీ ఆత్మతత్వం ఎఱుగరు లేక ఎఱిగినా ఉపదేశింపరు. ఇపుడు నాకు ఆత్మతత్వాన్ని గూర్చిన సంశయ నివృత్తి కలిగింది. కాని మఱియొక విషయం. కర్మను ఆచరించెడివాడు కర్మాచరణ సాధనమైన శరీరాన్ని ఇక్కడ విడిచిపెట్టి దేహాంతరంలో ఆ కర్మఫలం అనుభవిస్తాడని వేదవాదు లంటారు. అదెలా సాధ్యం? కర్తృశరీరం ఒకటికాగా భోక్తృశరీరం వేఱొకటి అవుతుందా? అదీకాక చేసిన కర్మ ఉత్తరక్షణంలో అదృశ్యమౌతుంది. కాలాం తరంలో అది ఫలితాన్ని ఎలా ఇస్తుంది? నా యీ సంశయాలు తీర్చు- అని ప్రాచీనబర్హి అర్థించేసరికి నారదమహర్షి యిలా అన్నాడు—

## నారదుడు ప్రాచీనబర్హికి కర్మరహస్యం బోధించడం

రాజా! నీ మొదటి సందేహానికి సమాధానం చెపుతాను. విను. పురు షుడు మనస్సు ప్రధానంగా గల లింగ శరీరంతోగూడి కర్మలు చేస్తాడు. కనుక కర్మారంభకమైన ఆ లింగశరీరంలోనే ఆత్మ ఆయా కర్మఫలాలను

అనుభవిస్తుంది. ఆ లింగశరీరం ఎప్పుడూ ఒకటే.. అంచేత కర్తృ భోక్తృ శరీర భేదాన్ని గురించి విచారించాల్సిన పనిలేదు. స్థూలశరీరం పరిగణనీయం కాదు అది నశించినా కర్మకు హేతుభూతమైన మనస్సు జీవుని అనువర్తిస్తూనే ఉంటుంది. కనుక ఉత్తరజన్మల్లో అది జీవునకు సుఖదుఃఖాలు కల్పిస్తుంది.

చేసిన ఉత్తరక్షణమందే కర్మ నశిస్తుందే ఇక కాలాంతరంలో సంభవించే ఫలితాలకు అది హేతువెలా అవుతుంది? అని కదా నీ రెండో సంశయం. దానికి ప్రత్యుత్తరం చెపుతాను. విను. పురుషుడు అహంకార మమకార యుక్తుడై మనస్సుతో చేసిన కర్మ పునర్జన్మకు హేతుభూతమవుతుంది.

గొంగళిపురుగు మరో ఆకును గట్టిగా పట్టుకొనేదాకా తానున్న మొదటి ఆకును విడిచిపెట్టదు అలాగే పురుషుడు మృత్యుగ్రస్తుడవుతున్నా పూర్వ శరీరంలో ఆరంభించిన కర్మసమాపనంచేత అన్యదేహప్రాప్తి కలిగేదాకా పూర్వదేహాభిమానాన్ని విడువడు. పురుషుడు ఇంద్రియాలద్వారా తాను పూర్వం అనుభవించిన వాటిని మనస్సులో చింతిస్తూ కర్మలు చెయ్యడం వలన మనస్సే భూతకోటికి సంసారకారణం. అవిద్య ఉన్నంతవరకు దేహాదులకు కర్మబంధం తప్పదు.

ఈ రీతిగా పూర్వజన్మకృతమైన కర్మ ఉత్తరదేహానికి ప్రారంభకం కావడంచేత అనుమాన ప్రమాణగోచరమైన కృతకర్మ అదృశ్యమనిన్నీ, కాలాంతరంలో అది ఫలితాన్ని ఎలా ఇస్తుందనిన్నీ సందేహించవలసిన పని లేదు. కర్మప్రవాహంవలన సర్వం ఉపపన్నం అవుతుంది కనుక అవిద్యానాశనానికి యత్నించాలి. ఎందుకంటే అవిద్యయే ఆత్మకు బంధహేతువు ఆ బంధం తొలగించుకోవాలంటే ఈ జగత్తంతా వాసుదేవాత్మకమని భావించి సర్వవిధాలా త్రికరణశుద్ధిగా శ్రీహరి పాదారవిందాలనాశ్రయించాలి- అని నారదుడు ప్రాచీనబర్హికి జీవేశ్వర తత్త్వాన్ని తెలిపి బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు.

అనంతరం ప్రాచీనబర్హి రాజ్యభారాన్ని తన పుత్రులకు ఒప్పగించి తపశ్చర్యకై కపిలాశ్రమానికి వెళ్ళాడు అక్కడ అతడు జితేంద్రియుడై గోవిందుని పదారవిందాలను ధ్యానిస్తూ భక్తియోగంతో బ్రహ్మాదులకు కూడా అందరాని అవ్యయానందపదం చెందాడు. లోకపావనమూ, మనశ్శుద్ధికరమూ, సర్వోత్కృష్ట ఫలప్రదాయకమూ! దేవర్షి ముఖవినిస్స్రుతమూ అయిన ఈ అధ్యాత్మ పారోక్ష్యాన్ని వినినవాడూ, పఠించినవాడూ లింగశరీరాన్ని కూడా విడిచి సమస్త బంధాలనుండి ముక్తుడౌతాడు. అతడిక సంసారచక్రంలో పరిభ్రమించకుండా విదేహకైవల్యం పొందుతాడు' అని మైత్రేయుడనేసరికి విదురుడు 'మునీంద్రా! ప్రాచీనబర్హి కుమారులు ప్రచేతసులు రుద్రోపదిష్టమైన శ్రీహరి సంకీర్తనంవలన ఏ గతిని పొందారు? వారు యాదృచ్ఛికంగా శ్రీహరికి

పరమప్రియుడైన రుద్రుని అనుగ్రహానికి పాత్రులై మోక్షం పొందారని చెప్పావు. అందులో సందేహంలేదు. శ్రీహరి సాక్షాత్కరించడానికి ముందు ఆ రాకుమారులు పొందిన ఫలితాలెవ్వి? వినాలని కుతూహల పడుతున్నాను- అనగా మైత్రేయుడిలా చెప్పడం మొదలు పెట్టాడు

## ప్రచేతసుల తపస్సునకు మెచ్చి భగవంతుడు వరాలివ్వడం

'విదురుడా! విను. జనకాజ్ఞను తలదాల్చి ప్రచేతసులు సముద్ర జల మధ్యంలో పదివేల సంవత్సరాలు రుద్రగీత స్తోత్రం జపిస్తూ ఘోర తపస్సు చేసేసరికి శ్రీహరి ప్రశాంతమైన నిజశరీరకాంతిపుంజంచేత వారి తపోవేద నను శమింపజేస్తూ వారికి సాక్షాత్కరించాడు. గరుడారూఢుడై వచ్చిన ఆ దేవదేవుడపుడు మేరు నగ శిఖరాన్ని అధిష్ఠించిన నీలమేఘంలాగా ఉన్నాడు. ధగధగ లాడుతూన్న అతని దేహకాంతులు దిగంతాళములందలి చీకట్లను పారద్రోలుతున్నాయి. అష్టభుజాలతో అష్టాయుధాలు ధరించి వెలుగొందు తున్నాడు. చెక్కిళ్ళపై కాంచన కుండలాల కాంతులు ప్రతిఫలిస్తున్నాయి. నవ రత్న మయమైన కిరీటాన్నీ, హార కేయూరాది మణిభూషణాలూ ధరించాడు. మెడలో కౌస్తుభం వేలాడుతోంది భుజ మధ్యమందు లక్ష్మీదేవి కాంతిని కూడా తిరస్కరించేది వైజయంతీ మాల వినూత్న శోభను వహించి ప్రకాశిస్తోంది. మునులు, దేవతలు, గరుడులు యక్షులు, కిన్నరులు. కలిసి కొలుస్తుండగా శ్రీహరి ఆ రాకుమారులకు ప్రత్యక్షమై వారిని కరుణారసార్ద్రాలైన క్రీగన్ను లతో జూస్తూ మధుర గంభీర వాక్కులతో ఇలా అన్నాడు-

తాపసోత్తములైన ప్రచేతసులారా! నే చెప్పేది సావధానంగా వినండి. సౌహార్దంతో మీరందఱూ సమాన ధర్మాలు గలిగిన వారవడంచేత నేను ఎంతో పరితోషం చెందాను. మీ మనోరథం ఏమిటో చెప్పండి. నేను తప్పక తీరుస్తాను. ఉత్తములైన మిమ్మల్ని శయ్యాగతుడై అనుదినం స్మరించేవాడు సోదరులయందు సుహృద్భావం, బంధుప్రీతి, భూతదయ, నిర్మలబుద్ధి కలిగి సుఖిస్తారు. అతని పాపాలు ఇట్టే హరిస్తాయి. ఈ రుద్రగీతను నిత్యం స్తోత్రంచేసే వారికి అభిమత వరాలేకాక మహాప్రజ్ఞను ప్రసాదిస్తాను. జనకాజ్ఞాపాలకులైన మీ కీర్తి అఖిల లోకాల్లోను వ్యాపిస్తుంది. మీకు గుణ వంతుడూ, వంశవర్ధనుడూ అయిన కొడుకు జనిస్తాడు!

పూర్వం కండు మహర్షి తపస్సు చేస్తూండగా ఇంద్రుడు ఆ మహర్షి తపస్సును భంగించడానికి ప్రమ్లోచయను అప్సరను పంపాడు. కండు మహర్షి ఆమెను మోహించి ఆమెతో సంగమం చేసేసరికి ఆమె గర్భం ధరించి ఒక

కుమార్తెను కన్నది. ఆమె తన లోకానికి తిరిగిపోతూ ఆ పిల్లను అచటి వృక్ష వాటికయందుంచి వెళ్ళిపోయింది. ఆ శిశువు ఆకలితో బిగ్గరగా ఏడుస్తూ ఉండగా అక్కడకు యాదృచ్ఛికంగా వచ్చిన సోముడు అమృతమయమైన తన బొటనవ్రేలిని ఆమెకు కుడుపగా ఆమె పెరిగి పెద్దదయింది. ఆమె పేరు మారిష. ప్రజాసృష్టికి మీ తండ్రియైన ప్రాచీనబర్హిచే నిర్దేశింపబడిన మీరందరూ ఆమెను చేబట్టండి- అని శ్రీహరి యింకా ఇలా అన్నాడు.

సమధర్మశీల నామాలుగల మీ యందఱకు ఆమె అనురూపవతియైన భార్యకాగలదు. మీరు అప్రతిహతమైన తేజంతో వేయి దివ్యసంవత్సరాలు భామ భోగాలనుభవించి అనంతరం నాయందుగల భక్తిచేత హరిపదం పొందుతారు. గార్హస్త్యజీవితం మీకు బంధహేతువు కాదు. ఎందుచేతనంటే మీరు ఏ కర్మ చేసినా భగవదర్పితంగా చేస్తారు. నిరంతరం నా కథలువింటూ కాలం గడుపుతారు. అలాంటి గుణగరిష్ఠులగు సాధువులైన మీకు భౌతిక భోగాలు భవబంధాలుకావు.

నాకథా గానంచేసే బ్రహ్మవాదులైన యోగిజనుల హృదయ మందిరాల్లో నేనెప్పుడూ వసిస్తాను. వారికి గృహాదులు సంసారకారణాలు కావు. నన్ను ఆశ్రయించినవాడు శోకంగాని మోహంగాని పొందడు — అని శ్రీహరి అనగా ఆ దేవదేవుని దర్శిస్తూ తం చేతనే రజస్తమోగుణదూరులై ప్రచేతసులు కేల్మోడ్చి గద్గదస్వరంతో ఇలా అన్నారు—

## ప్రచేతసులు శ్రీహరిని స్తుతించడం

కేశవా! నీవు సమస్తక్లేశాలనూ నశింపజేస్తావు. వాక్కులకుగాని మనస్సునకుగాని నీవు గోచరుడవుకావు. నీవు సత్వగుణ ప్రధానుడవు. నీ అనుగ్రహాతిశయంచేత ప్రాణికోటిమనోరథాలు సిద్ధిస్తాయి. లోకాలను సృజించి పెంచి లయం చెయ్యడానికి మాయామయములైన రూపాలు ధరిస్తావు నీ మార్గం ఇంద్రియ గోచరంకాదు. భవబంధాలను త్రెంచివేయగల ప్రజ్ఞ నీ కొక్కనికే ఉంది. నీవు దేవదేవుడవు. వాసుదేవుడవు. సర్వభూతనివాసివి. సర్వసాక్షివి. నీకు మాకైమోడ్పులు.

నీవు కమల నాభుడవు. నీ కట్టుపుట్టం కమలకింజల్కాల్లాగా పిశంగ వర్ణం కలిగి ఉంటుంది. నీ పాదాలు కమలాల్లాగా ఉంటాయి. నీవు ధరించేది కమలమాల. నీవు పరావరుడవు. కృష్ణుడవు రాక్షసహంతవు నీకు మా నమస్కారాలు —అని వినుతించి ప్రచేతసులు శ్రీహరికి ఇంకా ఇలా అన్నారు.

కమలేక్షణా! దుర్భరమైన విపద్దశలో దుఃఖమగ్నులమైన మాకు దుఃఖ

హరణ కారణమైన నీ దివ్యమంగళరూపాన్ని చూపించావు. లోకంలో ఇంతకు మించినభాగ్యం ఇంకేముంటుంది? దీనజన రక్షానిరతుడవైన నీవు మమ్మల్ని ఆత్మీయులుగాగణించి మాకు సాక్షాత్కరించావు. మాకు ఈమాత్రం సత్కారం చాలు. సమస్త ప్రాణికోటి హృదయాల్లో వర్తించెడి నీకు మా మనోరథమేమిటో తెలియదా! నీ దర్శనలాభమే మాకు మహావరం. అయినా మా విన్నపాన్ని విను.

లోకంలో నీ విభూతులు అనంతాలు. అంచేతనే నిన్ను అనంతుడంటారు. కనుక మేము నిన్ను ఏవరమని కోరతాం? దప్పికగొన్న బాలకుడు మహాంబుధిలో ఎన్నినీళ్ల త్రాగగలడు? అదీగాక నిరంతరం నీ పాదమూల మందుండెడి మేము నీ విలోకనం తప్ప అన్యమేమి కోరగలం? పారిజాత కుసుమంలోని క్రొందేనియ త్రావి పరవశించెడి తుమ్మెద ఇతర పుష్పాలను ఆశ్రయిస్తుందా? దేవా! నీ మాయకు వశంగతులమై భవకర్మలు చేస్తూ మేము ఎందాకా ఈ లోకంలో తిరుగుతామో అందాకా నీ భక్తకోటి యొక్క సాంగత్యం మాకు లభించేలాగా చెయ్యి. చాలు.

మాధవా! స్వర్గసుఖంకానీ, మోక్షంకానీ నీ పాదదాసుల సాంగత్య లేశంతో కూడా సమానంకావు. ఇక మానుషాలైన సుఖాల సంగతి చెప్పే దేముంది? భగవద్భక్తుల సాంగత్యంలో నీ పవిత్రగాథలు వింటూంటే కోర్కెలు నశిస్తాయి. సర్వభూత సమత్వం సిద్ధిస్తుంది. ముక్తసంగులైనవారు కూడా నిన్ను ధ్యానిస్తారు. పుణ్యతీర్థాలను గూడా పవిత్రం చెయ్యడానికి పాదచారులై భూమిపై చరించెడి నీ భక్తుల సాంగత్యం సంసార భయభీతుడైన వానికి రుచి చకుండా ఉంటుందా?

కమలలోచనా! నీ సఖుడైన రుద్రునితో నిమిషమాత్రం మాకు లభించిన సాంగత్య ఫలితంగా భవరోగాన్ని ఇట్టే మాన్పగల మహా చికిత్సకుడవైన నిన్ను దర్శించి కృతార్థులమయ్యాం. మా స్వాధ్యాయం అధ్యయనం, మాపై గురుజనులకు గల అనుగ్రహం, విప్రుల యెడలను వృద్ధుల యెడలను మా అనువర్తనం, ఆహారం లేకుండా జలమధ్యంలో దీర్ఘకాలం మేము చేసిన తపస్సు - అన్నీ పురాణపురుషుడవైన నీ పరితోషం కోసమే అగుగాక అని మేం విన్నవిస్తున్నాం.

తపోజ్ఞాన సత్వ:రూఢిచే నొప్పెడి మనువులూ, బ్రహ్మదులూ కూడా నీ మహిమను వర్ణింపలేరు. మేమేదో మా బుద్ధి ననుసరించి యోచినంత నిన్ను వినుతించాం. ఆదిపురుషుడవైన నీకు మా ప్రణతులు- అని ప్రచేతసులనేవరికి శరణ్యవత్సలుడైన శ్రీహరి సంతుష్టాంతరంగుడై వారు కోరినట్లు వరాలిచ్చి వారు చనిపి తీపక తనను చూస్తుండగా ఆత్మనివాసానికి వెళ్ళిపోయాడు,

అనంతరం వారు భగవదాజ్ఞ తలదాల్చి తపస్సు మాని సముద్రజల మధ్యం నుండి బయటకు వచ్చారు. ప్రాచీనబర్హి ముక్తిపదం చెందాక కృష్యాదులు లేకపోవడంచేత స్వర్గద్వారాన్ని నిరోధిస్తూ విచ్చలవిడిగా సమున్నతంగా పెరిగిన వృక్షసమూహంతో నిండిన భూమండలాన్ని చూచి వారు ప్రళయకాల మందలి రుద్రుడులాగా మహోగ్రులై భూమండలాన్ని వృక్షరహితంగా చెయ్యాలని సంకల్పించారు. వెంటనే వారి ముఖములనుండి భయంకరమైన అగ్నీ వాయువూ బయలుదేరి వృక్షసమూహాన్ని నాశనం చెయ్యడం మొదలు పెట్టాయి.

బ్రహ్మ ఆ మహాప్రళయం చూచి వెంటనే ఆ రాకుమారుల దగ్గరకు వచ్చాడు. సాంత్వనోక్తులతో వారి క్రోధాన్ని శమింపజేశాడు. అపుడు నశించగా మిగిలిన వృక్షాలు చతుర్ముఖుని ఆదేశానుసారం పూర్వం ప్రమ్లోచ కని తమకడ విడిచిన మారిష యను కన్యను తీసికొని వచ్చి ప్రచేతసులకు అర్పింపగా వారు ఆమెను విధిచోదితంగా వివాహమాడారు. దైవసంకల్పం అనుల్లంఘనీయం కదా! పెక్కురు రాకుమారులు ఒక కన్నియను వివాహ మాడడం ఎక్కడైనా ఉందా? శ్రీహరి మాయా కలితాలైన అద్భుతాలు నుతింపదగ్గవి.

చాక్షుష మన్వంతరంలో ప్రచోదితుడై ప్రజాసృష్టి చసూ ప్రసిద్ధుడైన దక్షుడు పూర్వదేహం కాలగ్రస్తం కాగా ప్రచేతసులకు మారిషయందు జన్మించి నిజకాంతిచే సమస్త తేజోధనుల తేజాన్ని తిరస్కరించగల దక్షుడవడంచేత దక్షుడను పేరు వహించాడు. బ్రహ్మ అతన్ని ప్రజాసర్గ రక్షణ మందు నియోగిస్తూ మరీచి ప్రభృతులను ఆయా వ్యాపారాల్లో నియమించడం వలన ప్రజాసృష్టి అప్రతిహతంగా ప్రవర్తిల్లింది.

ప్రచేతసులు మహాజ్ఞానులవడంచేత శ్రీమన్నారాయణోక్తిని స్మరిస్తూ భార్యను కొడుకువద్దనుంచి వనవాసానికి ఉద్యుక్తులై పశ్చిమసముద్రతీరాన జాబాలి సిద్ధిపొందిన ఆశ్రమానికి వెళ్లారు. అక్కడ వారు సర్వభూతాత్మ భావంతో ఆత్మవిచారం చెయ్యడానికి దీక్ష వహించి ఇంద్రియాలను, మనస్సును, నిగ్రహించారు. ప్రాణవాయువును, వాక్కును, దృష్టిని నియమించారు. నిశ్చలంగా కూర్చుండి పరబ్రహ్మమందు ఆత్మను నియోజించారు.

ఇంతలో నారదమహర్షి అక్కడకు వచ్చేసరికి ప్రచేతసులు లేచి వినమ్రులై ఆ దేవర్షికి సకలోపచారాలూ చేసి ఇలా అన్నారు— మునీంద్రా! నీ రాక సకలలోక శుభంకరం. మా భాగ్యవశంచేత మాకు ఈనాడు మీ దర్శనం లభించింది. మీ సంచారం సూర్యగమనంలాగా ప్రాణికోటికి సకల భయాపహరణం కాగలదు. గృహస్థుల మవడంచేత సంసార లంపటంలోపడి పూర్వం

కేశవ వామదేవులు మాకు ఉపదేశించిన ఆత్మతత్వం మరచిపోయాం. సంసార సాగరాన్ని తరింపచేయగల ఆ ఆత్మతత్వాన్ని కృపామతివై మాకు బోధించు-అని ప్రచేతసు లర్థించేసరికి నారదర్షి వారికి ఇలా అన్నాడు-

## నారదుడు ప్రచేతసులకు తత్వోపదేశం చెయ్యడం

మానవుని జనన కర్మలు, ఆయువూ, మనస్సు, వాక్కులు శ్రీహరి సేవయందు వినియుక్తములైనపుడే అవి సార్థకాలౌతాయి. హరిసేవా విరహితములైన జన్మలు కాని దీర్ఘాయువుగాని, వేదచోదిత కర్మలుగాని, జపతపాలుగాని, వచోవిలాసాలుగాని నిరర్థకాలు. అలాగే హరి విహీనమైన ఇంద్రియ పాటవం, బుద్ధినైశిత్యం, ప్రాణాయామం, ఆత్మజ్ఞానం, సన్యాసం, అధ్యయనం, వైరాగ్యం కూడా నిష్ప్రయోజనాలే.

ఉమాపతి సర్వేశ్వరుడు. సమస్తశ్రేయ స్వరూపుడు. సర్వభూతాంతర్యామి. సర్వభూతాత్మప్రదుడు. సర్వభూతప్రియుడు. కావున నాతనినొక్కని పూజిస్తే చాలు సర్వదేవతలను పూజించినట్టే. వృక్షమూలాన్ని తడిపితే శాఖోపశాఖలకు కూడా పుష్టి కలుగుతుంది. ప్రాణోపహారం చేత సకలేంద్రియాలకు సంతృప్తి కలుగుతుంది. అలాగే సమస్తమునకూ మూలమైన శ్రీహరిని యజిస్తే భూతకోటి సమస్తాన్ని సంపూజినట్లే అవుతుంది.

వర్షాకాలంలో సూర్యునివలన జలం ఉత్పన్నమై తిరిగి గ్రీష్మంలో ఆ సూర్యుణ్ణే చేరుతుంది. చరాచర జీవకోటులు భూమియందు జనించి తిరిగి ఆ భూమిలోనే లీనమౌతాయి. అలాగే హరివలన ఉద్భవించిన జగత్తు ఆ హరియందే లయమౌతుంది. ఆకాశమందు, మేఘసమూహం, చీకటి, కాంతి ఒకప్పుడు దృగ్గోచరమౌతాయి. కొంతసేపటికి అదృశ్యమౌతాయి. అలాగే జగత్సృష్టి రక్షాలయ కారణాలైన త్రిగుణాలు పరబ్రహ్మ మందొకప్పుడు పొడచూపుతాయి. ఒకప్పుడు లయమౌతాయి. కనుక ఆ శ్రీహరిని ఆత్మైకత్వ భావంతో భజించండి. సర్వభూతములందునూ దయగలిగి ఉండడం, యాదృచ్ఛికంగా లభించిన దానితో సంతుష్టి చెందడం, సర్వేంద్రియాలను నిగ్రహించడం ముఖ్యం. ఈ గుణాలు గలవాడు శ్రీహరి అనుగ్రహానికి తప్పక పాత్రుడౌతాడు రాగరహితమైన విశుద్ధ మనస్సు గల సాధువులను శ్రీహరి యెన్నడూ విడువడు విద్యాధనకుల మదాంధులై నిస్సహాయులైన సాధుజనులకు కీడుచేసేవారి పూజలను ఆ దేవదేవుడెన్నడూ కైకొనడు.

భగవంతుడు, తనను అనుగమించి వచ్చేడి లక్ష్మిని, ఆ లక్ష్మీకటాక్షాన్ని అర్థించెడి ఇంద్రాదుల్నిసు విడిచి నిజభక్తులందు ప్రేమభావం కలిగి నిరంతరం

వారిని అనుసరిస్తూ ఉంటాడు. అలాంటి కరుణా వార్ధియైన శ్రీహరిని రసజ్ఞుడైన వాడెవడైనా విడిచి పెట్టాలను కుంటాడా? మీ వంశంలో ప్రసిద్ధుడైన ధ్రువుడు సవతితల్లి నిష్ఠురోక్తులచే ఖిన్నహృదయుడై అయిదేండ్లప్రాయంలో తపోవనానికిపోతూ మార్గమధ్యంలో నాకంటబడ్డాడు. అపుడు నేనతనికి ఉపదేశించిన క్రమంలో అతడు పుండరీకాక్షునారాధించి అన్యులకెవ్వరికి అందని సర్వోత్తమమైన పదం పొందాడు. కనుక మీరున్నూ రుద్రోపదేశ క్రమంలో సర్వభూతాంతర్యామి యైన ఈశ్వరుణ్ణి సంసార విచ్ఛేదం కోసం ఆరాధించండి-అని నారదర్షి శ్రీహరిచరిత్రను ప్రచేతసులకు చెప్పి బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు.

నారద నిర్గమనానంతరం రాకుమారులైన ప్రచేతసులు మంగళావహమూ, కలిమలాపహరనూ అయిన శ్రీహరి కథా సంకీర్తనం, పాదపద్మ చింతనం చేస్తూ హరిపదం చెందారు— మహాత్మా! నీవు నన్నడిగిన ప్రచేతో నారద సంవాదరూపమైన హరికీర్తనమూ, మనుపుత్రుడైన ఉత్తానపాదుని వంశక్రమమూ చెప్పాను'—అని ఇంకా ఇలా అన్నాడు.

'నారదునివలన ప్రియవ్రతుడు ఆత్మజ్ఞానం పొంది ధరామండలం చిరకాలం పాలించి అనంతరం పుత్రులకు రాజ్యం పంచి యిచ్చి పరంగతుడయ్యాడు'—అని మైత్రేయుడనేసరికి విదురుడా మునీంద్రుని పాదాలపై వ్రాలి శ్రీహరి చరణకమలాలను మనస్సులో ధ్యానిస్తూ- 'మునినాథా! నీవు కరుణా సముద్రుడవు. నీ వలన శ్రీహరి తత్వం తెలుసుకున్నాను. ధన్యుడనయ్యాను'—అని పలికి బంధుదర్శనా కాంక్షతో హస్తినాపురం వెళ్ళిపోయాడు." రాజేంద్రుడైన పరీక్షితునకు శుక మహర్షి చెప్పిన ఈ ఉపాఖ్యానం విన్నవానికి ఆయువు, ఐశ్వర్యం, కీర్తి లభిస్తాయి.





# మహాభాగవతం

## పంచమ స్కంధం

పరీక్షిన్నరేంద్రుడు శుక మహర్షిని ఉద్దేశించి యిలా అన్నారు- "మునీంద్రా! ప్రియవ్రతుడు నారదునివలన ఆత్మజ్ఞానం పొంది తిరిగీ ధరాపాలనం చేశాడని చెప్పావు. పరమ భాగవతుడూ, ఆత్మారాముడూ అయిన అతడు దుఃఖాపాదకమైన గృహస్థాశ్రమాన్ని ఎలా నిర్వహించాడూ? గృహస్థాశ్రమమందు కర్మబంధాలు తప్పవు. అంచేత ముక్తసంగులైన పురుషులకు దానియందు ఆసక్తి ఉండదు. పుండరీకాక్షుని పాదచ్ఛాయలో నిర్వృతచిత్తులై నిరతిశయానందం పొందిన మహాత్ములకు కుటుంబ జీవితమందు అభినివేశం ఉండదు. కనుక ప్రియవ్రతునకు సంసారమందు తగులం ఎలా కలిగింది? దారసుతాదులందు సక్తచిత్తుడైనవానికి పరమేశ్వరుని యందు అస్ఖలితబుద్ధి యెలా కలుగుతుంది? సిద్ధి ఎలా కలుగుతుంది?— ఈ సంశయం తీర్చు" అని పరీక్షిన్నరేంద్రుడర్థించేసరికి శుక మహర్షిలా చెప్పడం మొదలుపెట్టారు.

"రాజేంద్రా! విను. శ్రీహరి పాదకమల మకరందం గ్రోలి మత్తచిత్తుడైన సత్పురుషుడు, ఒకవేళ విఘ్నాలేవైనా తటస్థించినా, పూర్వమార్గాన్ని విడువడు. అయినా ప్రియవ్రతుడు ఏ పరిస్థితిలో రాజ్యపాలనాదికి అంగీకరించాడో చెపుతాను. విను. అతడు నారద మహర్షి చరణసేవచేస్తూ అధ్యాత్మ సత్త్రయాగంలో దీక్షితుడై ఉండగా అతని తండ్రి స్వాయంభువమనువు అతణ్ణి రాజ్యపాలనం చెయ్యమని ఆదేశించాడు. కాని దానివలన జ్ఞానభంగం అవుతుందని అతడంగీకరించలేదు.

ఈ విషయం తెలిసి బ్రహ్మదేవుడు ప్రియవ్రతునకు రాజ్యపాలనయందు ఆసక్తి కలిగించాలనే భావంతో శ్రుతులతోగూడి నక్షత్రాలచే పరివేష్టితుడైన చంద్రుడులాగా ప్రకాశిస్తూ హంసవాహనారూఢుడై ఆకాశ మార్గాన బయలుదేరాడు. మహర్షులు, మహేంద్రాదులు కూడా అతణ్ణి ప్రశంసిస్తూ అతని వెంటవచ్చారు. మార్గమధ్యంలో సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు చారణులు, గరుడులు, కింపురుషులు ఇరువైపులా స్తుతిస్తుండగా గంధమాదన పర్వత

ప్రాంతాలకు వన్నెకూరుస్తూ బ్రహ్మదేవుడు రాగా నారదమహర్షి ముకుళిత హస్తుడై స్వాయంభువ ప్రియవ్రతులతో గూడి ఎదురువెళ్ళి ఆ సురజ్యేష్ఠునకు నకలోపచారాలు చేశాడు. విరించి సంతసించి ప్రియవ్రతుని జూచి మంద స్మితం చేస్తూ ఇలా అన్నారు-

రా కుమారా! నీకు హితం చెప్పడానికి శ్రీహరి నన్ను వంపాడు. కనుక నేను చెప్పేది శ్రీహరి వాక్యంగా భావించి సావధానుడవై విను. నీవూ, నారదుడూ, నేనూ, అందఱం ఈశ్వరాజ్ఞను వర్తులమై ప్రవర్తిస్తూ ఉంటాం. ఈశ్వరాజ్ఞ నతిక్రమించడం ఎవరి తరమూ కాదు తపస్సుచేగాని, విద్యచే గాని, యోగబలంచేగాని, జ్ఞానబలంచేకాని, ధర్మంచేకాని, మఱియింకే సాధనం చేతగాని జీవుడు తానైకాని అన్యులచేతగాని శ్రీహరి ఆజ్ఞను అన్యథా కరించడానికి సమర్థుడుకాడు. ఉత్పత్తిస్థితి లయాలకు, శోకమోహ భయాదులకు, సుఖ దుఃఖాలకు జీవుడు ఈశ్వరాధీనుడు కాని, స్వతంత్రుడుకాడు.

ముకుత్రాటిచే మానవుడు పశువును వశవరచుకుంటాడు. అలాగే ఈశ్వరుడు వేదాత్మకమైన గుణత్రయమనెడి త్రాటిచే బంధించి అస్మదాదులందరినీ తనకు వశంగతులై యుండేలాగా చేస్తాడు. అంతేకాని ఎవ్వరూ స్వతంత్రంగా వ్యవహరించలేరు. కనులున్నవాడు అంధుణ్ణి ఎలా ఎటువడితే అటు తీసుకొనిపోతాడో అలాగే మానవులు ఈశ్వరాజ్ఞానుసారం వర్తిస్తారు. స్వప్నంలో చూచిన అర్థాన్ని మేల్కాంచినపుడు మిథ్యగా తలచినట్లు మోక్షార్థియైన జ్ఞాని ప్రాప్తించిన సుఖ దుఃఖాలను అనుభవిస్తూ దేహారబ్ధ కర్మములను విడిచి పెట్టడు.

వనవాసియైనా జితేంద్రియుడు కాకపోతే సంసార బంధంలో చిక్కుకుంటాడు. గృహస్థాశ్రమంలో ఉన్నా విజితేంద్రియుడై ఆత్మజ్ఞానం కలిగి ఉంటే మోక్షం పొందుతాడు. శత్రువిజయం కాంక్షించే వాడు ఏదో దుర్గాన్ని ఆశ్రయిస్తేకాని శత్రువులను జయింపలేడు. అలాగే మోక్షార్థియైన పురుషుడు శ్రీహరి చరణ యుగళమనే దుర్గాన్ని ఆశ్రయించి కామక్రోధాదులైన అరి షడ్వర్గాన్ని జయిస్తాడు. నీవును నిస్సంగుడవై ఈశ్వర కల్పితాలైన భోగాలను అనుభవిస్తూ ముక్తిని పొందు- అని త్రిలోక గురువైన చతుర్ముఖుడనిన వాక్యాన్ని ప్రియవ్రతుడు తలదాల్చి రాజ్యభారం వహించడానికి అంగీకరించాడు. అనంతరం అంబుజభవుడు స్వాయంభువుని సత్కృతులనంది నారదర్షి, ప్రియవ్రతుడూ చూస్తూండగా నిజసదనానికి వెళ్ళిపోయాడు. అనంతరం స్వాయంభువుడు నారదాను మతంతో ప్రియవ్రతుని రాజ్యాభిషిక్తుణ్ణి చేసి విషయవాసనలనుండి విముక్తుడై వనవాసానికి వెళ్ళాడు.

ప్రియవ్రతుడు ఈశ్వర వాక్యాన్ని అనుసరించి నిస్సంగుడై కర్మా

చరణం చేస్తూ రాగాదులకు లోనుగాకుండా నిరంతరం శ్రీహరి పాదారవింద చింతనమునందు మనస్సును నిలిపి నిత్యానందంతో ప్రజాపాలనం చేశాడు. ప్రియవ్రతుడలా రాజ్యపాలనంచేస్తూ విశ్వకర్మయను ప్రజాపతి పుత్రిక బర్హిష్మతి యను నామెను వివాహమాడి ఆమె వలన శీలంలోను, గుణంలోను, రూపంలోను, శౌర్యంలోను, ఔదార్యంలోను తనకు సమానులైన— ఆగ్నీధ్రుడు, ఇధ్మజిహ్వుడు, యజ్ఞబాహుడు, మహావీరుడు, హిరణ్యరేతుడు, ఆకృతపృష్ఠుడు, సవనుడు, మేధాతిధి, వీతిహోత్రుడు, కవి—అనెడి పదిమంది కొడుకులను, కడపట 'ఊర్జస్వల' అను ఒక కుమార్తెను కన్నాడు.

వారిలో కవి, మహావీరుడు, సవనుడు—అను ముగ్వురూ బాల్యం నుండి ఇంద్రియాలను జయించి బ్రహ్మవిద్యా నిష్ణాతులై పరమహంసాశ్రమం స్వీకరించి సర్వాంతర్యామియైన వాసుదేవుని చరణకమల ధ్యానంచేస్తూ భక్తి యోగాను భావంతో నిర్మలమనస్కులై ఈశ్వరు తాదాత్మ్యం పొందారు.

ప్రియవ్రతునకు మరో కాంతయందు మహా మహితాత్ములూ మన్వంతరాధిపతులూ అయిన ఉత్తముడు, తామసుడు, రైవతుడు, అను ముగ్వురు కొడుకులు జన్మించారు. చిన్నతనమందే ఊర్ధ్వరేతస్కులై అప్యయపదం పొందిన ముగ్వురు కొడుకులూ పోను మిగిలిన వారందఱు తనకు ఆజ్ఞావర్తులై చరిస్తుండగా శౌర్యధనుడైన ప్రియవ్రతుడు తన బాహుబలంచేత శత్రువులందఱిని నిర్జించి అకంటకంగా రాజ్యంచేస్తూ బర్హిష్మతీ కాంతయందు అనురక్తుడై ఆమె రూపయౌవ్వన లీలావిలాసాలకు వశంగతుడై అవివేకిలాగా భోగలాలసుడై కాలంగడపడం మొదలుపెట్టాడు. అలా అతడు పదునొకండు కోట్ల సంవత్సరాలు రాజ్యపాలనం చేశాడు

ఇలా ఉండగా అతనికి ఒక ఊహ కలిగింది. సూర్యుడు మేరుపర్వతం చుట్టూ ప్రదక్షిణంచేస్తూ భూమండలంలో సగాన్ని మాత్రమే ప్రకాశింప చేస్తాడు. మిగిలిన సగం అంధకారావృతమై ఉంటుంది. అందచేతనే పవలని, రాత్రియని విభాగం ఏర్పడ్డది. ప్రియవ్రతుడు చీకటి అనేది లేకుండాచేసి రాత్రిళ్ళనుకూడా పవళ్ళుగా చేయాలని భావించి భగవదుపాసనా బలంతో గడించిన శక్తితో సూర్యరథంతో సమానమైన తేజోమయరథం అధిష్ఠించి రెండవ సూర్యుడులాగా ప్రకాశిస్తూ సూర్యుడు మేరునగానికి ఉత్తరాన ఉన్నపుడు తాను దక్షిణాన, దక్షిణాన ఉన్నపుడు తాను ఉత్తరాన సప్తరాత్రాలు సంచరించాడు. ఈ వృత్తాంతం విని బ్రహ్మదేవుడు వచ్చి అతణ్ణి వారించాడు.

ప్రియవ్రతుని రథనేమి మార్గాలు సప్తసముద్రాలయ్యాయి. వాటిమధ్యగల భూసంధులు సప్తద్వీపాలయ్యాయి. ఆ ద్వీపాలే జంబూద్వీపం, ప్లక్షద్వీపం, కుశద్వీపం, క్రౌంచద్వీపం, శాకద్వీపం, శాల్మలిద్వీపం పుష్కరద్వీపం—అని

పిలువబడుతున్నాయి. ఆ ద్వీపాలు ఒకదానికంటె ఒకటి రెండింతల పరిమాణం కలిగి ఉంటాయి. జంబూద్వీప పరిమాణం లక్షయోజనాలు. ఇక ఆ జలభాగాలేమా—క్షారసముద్రం, ఇక్షురససముద్రం, సురాసముద్రం, ఘృతసముద్రం, క్షీరసముద్రం, దధిసముద్రం, శుద్ధోదకసముద్రం—అను పేర్లతో ప్రసిద్ధికెక్కాయి వీటిపరిమాణం ద్వీపపరిమాణాన్ని బట్టి ఉంటుంది. సప్తద్వీపాలసంధి సంధిని ఇవి అగడ్తల్లాగా ఉంటాయి. ఒకదాన్ని ఒకటి కలియవు.

ఆ సప్తద్వీపాలను పరిపాలించడానికి ప్రియవ్రతుడు తన పత్నియైన బర్హిష్మతి వలన జనించిన పదుగురు పుత్రుల్లో విరక్తులై అవ్యయపదంచెందిన ముప్పురూ పోను మిగిలిన యేడుగురికి ఒక్కొక్కని కొక్కొక్క ద్వీపానికి పట్టంకట్టి 'ఊర్జస్వల' యను కన్యను శుక్రునకిచ్చి వివాహంచేశాడు. శుక్రునకు ఊర్జస్వల యందు దేవయాని యను కూతురు జన్మించింది. కొంత కాలం గడిచాక ప్రియవ్రతుడు విరక్తుడై శోకభారంతో నారదమహర్షిని స్మరించి —అయ్యో! నేను ఇంద్రియాలను జయింపలేక అజ్ఞాన విరచితాలైన విషయవాసనలనెడి అంధకూపంలో పడ్డాను. స్త్రీలకు క్రీడా మృగాన్నయ్యాను. ఇక నాకా భోగాలేవీ అక్కరలేదు— అని భావించి హరికృపచే పూర్వం తనకిచ్చిన ఆత్మజ్ఞాన ప్రభావంతో దారసుతాదులను విడిచి హరిచరణాయత్తచిత్తుడై నారదపదవిని పొందాడు.

ప్రియవ్రతుడలా తన రథమార్గాలను సప్తద్వీపాలుగా సప్తసముద్రాలుగాచేసి సూర్యునకు ప్రతిసూర్యుడని ప్రసిద్ధికెక్కాడు. ప్రాణికోటి శ్రేయస్సును కాంక్షించి ప్రతి ద్వీపానికి నదులూ, పర్వతాలూ, వనాలు మొదలైన చిహ్నాలల్లో హద్దులు కల్పించాడు. లౌకిక సుఖాలను నరకసమానాల్లనుగా భావించి విరక్తుడై నిరంతర హరినామస్మరణంచేత నిర్మల మనస్కుడైన ప్రియవ్రతుని ప్రతిభ ఈశ్వరునకు తప్ప ఇతరులకు తెలియదు. అతని మహిమాతిశయాన్ని ఈనాడుకూడా అందఱూ ప్రశంసిస్తూ ఉంటారు. అంతటి మహానుభావుడైన ప్రియవ్రతుడు కైవల్యపదవి పొందడంలో ఆశ్చర్యమేముంది? చండాలుడైనా హరి నామచింతనం చేత అవ్యయపదం పొందుతాడు.

ప్రియవ్రతుని అనంతరం అతని కొడుకు అగ్నీధ్రుడు ధర్మబద్ధంగా జంబూద్వీపాన్ని పాలిస్తూ ప్రజలను తన కన్న కొడుకుల్లాగా కాపాడుతూ చిరవిఖ్యాతి చెందాడు. ఇలా ఉండగా అతడు పుత్రకాముడై మందరపర్వత సమీపమందు బ్రహ్మదేవుని సకలోపచారాలతో ఏకాగ్రచిత్తుడై యర్చించేసరికి ఆతడు సంతోషించి తన సమ్ముఖంలో గానంచేసే 'పూర్వచిత్తి' అను అప్సరను పంపాడు.

బ్రహ్మదేవుని ఆదేశాను సారం ఆమె అగ్నీంద్రుని ఆశ్రమ వనానికి వచ్చింది. ఆ వనం స్వచ్ఛజల సంభరితాలైన కొలకులతో మనోజ్ఞంగా ఉంది. అనరస్తీరములందు దట్టంగా ఉన్న వృక్షశాఖలను సువర్ణకాంతిగల పుష్పలతలు పెనవేసికొని ప్రకాశిస్తున్నాయి. ఆ వృక్షవాటికల్లో స్థలపక్షుల జంటలు షడ్జాది స్వరాలతో మధుమధురంగా నినదిస్తున్నాయి. జలాకరాల్లో నీటికోళ్లు, కన్నె లేడిపిట్టలు, కొంగలు, రాయంచలు మొదలైన జలపక్షులు శ్రుతిమధురంగా ధ్వనిస్తున్నాయి.

పూర్వచిత్తి మనోహరమైన ఆ వనంలో సవిలాసంగా తిరుగుతూండగా కాంచనమయాలైన ఆమె కాలి యందియల నిక్వణధ్వనులు సమాధి నిష్ఠతో ముకుళితనేత్రుడైన అగ్నీంద్రుని చెవినిబడ్డాయి. అతడు మెల్లగా కనులువిచ్చి ఆ దేవకన్యను చూచారు. ఆమె సౌందర్యానికి ముగ్ధుడయ్యాడు. ఆమె నడకలు, చూపులు, మధురస్వరం, అవయవ సౌకుమార్యం మదనవికారం కల్పిస్తున్నాయి. ఆమె పూవుపూవును మధుకరాంగనలాగా ఆఘ్రాణిస్తోంది. మందస్మితపూర్వకంగా అమృతబిందువులను చిందిస్తూ ఆమె మధురాలాపాలు చేస్తుంటే ఆ పరిమళానికి మదాంధాలైన మధుకర మిథునాలు వెంటపడగా వాటిని వంచించి అటూ ఇటూ పరుగులు పెట్టగా ఆమె స్తనాలు, కేశపాశం, మొలనూలు అల్లాడుతూ మోహోద్రేకాన్ని కల్పిస్తున్నాయి. ఇలా తన సమీపంలో సవిలాసంగా విహరిస్తున్న పూర్వచిత్తినిచూచి అగ్నీంద్రుడు మన్మథ పరవశుడై జడునిలాగా ఇలా అన్నారు—

జవ్వనీ! నీవెవ్వతెవు? ఏదైనా కాంక్షించి ఈ పర్వతానికి వచ్చిన వనదేవతవా? శారదవా? లేక రతీనాథుడు పంపిన మాయవా? అదికాక తపస్వి రమణివా? పుష్పచాపాన్ని సంధించి మన్మథుడు వేటాడెడి మానవమృగాలను చూస్తూ వచ్చావా? నీ చేష్టల తీరు నాకు తెలియడంలేదు. చెప్పు. నిన్ను చూడగానే మన్మథుడు నా మనస్సును కలచివేశాడు. మదన బాణాల్లాంటి క్రీగంటి చూపులతో నీవు ఎవ్వని చిత్తాన్ని కలవరపెడుతున్నావు?

వేదాధ్యయనం చేసెడి శిష్యులమీద పుష్పవృష్టి కురిసినట్లు నిరంతరం ఝంకృతులుచేస్తూ మన్మథ సామగానాలు చేసెడి శిష్యుల్లాగా ఉన్న తుమ్మెదల మీద నీ కేశ పాశంనుండి క్రొవ్విరులు జారి పడుతున్నాయి. నీ కాలి యందియల మ్రోతలు నా మనస్సును వికలం చేస్తున్నాయి. నీవు దాల్చిన వస్త్రం కడిమి పూవుల కాంతిగలిగి ఉండడంచేత నీ నితంబ భాగం కూడా అదే కాంతిని వెదజల్లుతోంది. నీ సన్నని నడుము ఎంత పరిశీలించి చూచినా కనబడడం లేదే! ఇక ఏనుగు కుంభస్థలాల్లాంటి గురుకుచములను ఎలా నిలుపుకో గలుగుతున్నావు? నీవు నీ స్తనములపై అలదికొన్న కుంకుమ పంకం

యొక్క వాసనలు నలువైపుల వ్యాపిస్తున్నాయి. నీ చనుదోయి పెంపూ, సొంపూ చెప్పనలవి కాదు.

సుందరీ! నీవు ఏ లోకం నుండి వచ్చావు? ఏ లోకంలోనూ నీలాంటి లావణ్యవతిని నేను చూడనూలేదు. ఎవరూ చెప్పగా వినవూలేదు. నీ సౌందర్యం, నీలాలిత్యం, నీ హాసవిలాసాలు అనుపమానాలు. నా అదృష్టం కొలదీ నీవు ఈ భూలోకానికి వచ్చినట్లున్నావు. నీ మందహాసం, నీ కడగంటి చూపులు నాలో ఆశలు రేకెత్తిస్తున్నాయి. నీ ముఖం మచ్చలేని చంద్రబింబం లాగా కాంతివంతంగా ఉంది. అంచేత నీవు విష్ణువు నంశం అని భావిస్తాను.

చెవి కమ్మలనెడి చక్రవాకముల జంటను చూచి భీతిల్లి చలించెడి గండుచేపల్లాంటి కళ్ళలో, తుమ్మెద బారుల్లాంటి నల్లని ముంగురులలో, ద్విజ* సమూహపు కాంతిని అతిశయిస్తూ నీ ముఖం అపరజలాకరంలాగా ఉంది. నీ చూపులు దిక్కులయందు వ్యాపిస్తూ తుమ్మెద బారుల్లాగా ఉన్నాయి. గాలికి నీ పైట జారిపోతే పట్టుకోవేమీ? నీ జుట్టు ముడి జాజి మెడపై పడితే తిరిగి ముడుచుకోవేమీ? సంభ్రమపాటులో ఈ రత్న కందుక క్రీడ యేమిటి?

తపోధనుల తపస్సును అపహరించగా నీ యీ చక్కదనం నీవు ఏ తపం చేసి సంపాదించావూ? నేను తపస్విని. నీవు నాతో గూడి తపస్సు చెయ్యి. నా సంసారాన్ని వృద్ధి చెయ్యి. బ్రహ్మదేవుడు సాక్షాత్కరించి నిన్ను నా కిచ్చాడు. కనుక నిన్ను విడిచిపెట్టలేను. నీ సఖీజనంకూడా నామాట కాదనరని నా భావన. నీవు వెళ్ళేచోటికి నన్నుకూడా తీసికొని వెళ్ళు—అని స్త్రీలకు మనోరంజకంగా ఉండేలాగా అగ్నీధ్రుడు అనేక రీతులుగా మాటలాడాడు.

పూర్వచిత్తి అనునయ పూర్వకములైన అతని మధుర భాషణాలకు ముగ్ధురాలైంది. అతని కోర్కెకు సమ్మతించింది. జంబూద్వీపాధిపతియైన ఆ రాజేంద్రునితో గూడి నూఱువేల సంవత్సరాలు భౌతిక భోగాలూ, స్వర్గ సుఖాలూ, అనుభవించింది. ఆ నరేంద్రునకు ఆమె వలన—నాభి, కింపురుషుడు, హరివర్షుడు, ఇలావృతుడు, రమ్యకుడు, హిరణ్మయుడు, కురువు, భద్రాశ్వుడు, కేతుమాలుడు—అను తొమ్మండుగురు కొడుకులు కలిగారు. అనంతరం ఆమె ఆ కొడుకులను పతి గృహమందు విడిచిపెట్టి తిరిగి బ్రహ్మలోకానికి వెళ్ళిపోయింది.

ఆ అగ్నీధ్ర పుత్రులు మాతృ సామర్థ్యంచేత సహజంగా దృఢగాత్రులయ్యారు. అనంతరం వారు తండ్రియానతని తమ తమ నామాలతో ప్రసిద్ధాలైన జంబూద్వీపాంతర్గత వర్షాలను పాలించారు. అగ్నీధ్రుడు పూర్వ

* ద్విజులు, పక్షులు, బ్రాహ్మణులు.

చిత్తిస్తే గల మోహాతిశయంతో నిరంతరం ఆమెనే స్మరిస్తూ వేదోక్తకర్మలను ఆచరిస్తూ తుదకు బ్రహ్మలోకానికి వెళ్ళాడు. అలా తండ్రి పరలోకగతుడయ్యే సరికి నాభి ప్రముఖులు తొమ్మండుగురూ మేరు పుత్రికలైన—మేరుదేవి, ప్రతిరూప, ఉగ్రదంష్ట్రి, లత, రమ్య, శ్యామ, నారి, భద్ర, దేవి—అను కన్య లను వివాహమాడారు.

## శ్రీమన్నారాయణుడు ఋషభావతారం ధరించడం

కొంతకాలానికి నాభి సంతానార్థియై మేరుదేవితో గూడి యజ్ఞపురుషుడైన వాసుదేవుని శ్రద్ధతో పూజించాడు. అగ్నిష్టోమానికి అంగభూతాలైన ప్రవర్గ్యము లను పేరుగల యాగాలను యథావిధిగా నిర్వర్తించి శ్రీహరిని మెప్పించాడు. ఎవ్వరికీ ప్రసన్నుడు కాని పుండరీకాక్షుడు నరేంద్రుడైన నాభి నిర్మలాంతఃకరణంతో చేసిన యాగవిధులకు సంతుష్టుడై నయనానంద కరమైన నిజరూపంలో అతనికి సాక్షాత్కరించాడు.

చతుర్భుజాలతో పీతాంబరంతో ఆ దేవదేవుడు ధగధగలాడుతున్నాడు. అతని వక్షస్థలమందు శ్రీవత్సం, కౌస్తుభం, రమణీయంగా వెలుగొందుతున్నాయి అతని పాణి తలములందు శంఖం, చక్రం, గద, పద్మం ప్రకాశిస్తున్నాయి. రత్నమణిఖచితమైన అతని కాంచన కిరీటపు కాంతులు నలుదిక్కులా వ్యాపిస్తున్నాయి. కర్ణకుండలాలూ, కటిసూత్రం, హార కేయూరాలు, నూపురాలు ధరించి మనోహరాకారంతో శ్రీహరి ఆ దంపతులకు సాక్షాత్కరించేసరికి, పెన్నిధిని గాంచిన పేదవానిలాగా అచట నున్న ఋత్విక్కులు అవనతముఖులై అతని నీ రీతిగా స్తుతించారు.

దేవా! నీవు పరిపూర్ణుడవై యుండిన్నీ మమ్మల్ని మఱువకుండా మా పూజలను మన్నిస్తావు. మేము చేసే స్తోత్రం నీ మహిమ తెలిసి కాదు. పెద్దల ఉపదేశాలను దృష్టిలో ఉంచుకొని మా శక్తికొలది నిన్ను నుతిస్తాం. సంసార బంధంలో చిక్కుకొన్నవారికి నీవు వశ్యుడవు కావు. నీవు సర్వేశ్వరుడవు. ప్రకృతీ పురుష వ్యతిరిక్తుడవు. పరమ పురుషుడవు. నామరూపాలు లేని నిన్ను నిరూపించడం మావంటివారి వలన కానిపని. సకల జీవకోటి పాపాలను హరించగల శక్తిసంపన్నుడవు నీవు. అలాంటి నీ ఉత్తమగుణాల్లో ఏదో ఒక గుణలేశాన్ని నిరూపించడం సాధ్యమౌతుందేమోకాని నీ సర్వగుణ నిరూపణం చెయ్యడం అసంభవం.

నీ భక్తులు గద్గదస్వరంతో నిన్ను నుతిస్తూ తృణమో, పల్లవమో, తులసీదళమో, జలమో, దర్భాంకురాలో సమర్పిస్తే నీవు అత్యాదరంతో స్వీకరిస్తావు. వైభవోపేతంగా చేసే యజ్ఞయాగాదులు కూడ నీకంతటి సంతృప్తి నీయలేవు. నీవు పురుషార్థ స్వరూపుడవు పరమానంద రూపుడవు.

కనుక నీకు యాగాదులు వాంఛనీయాలు కాకపోవచ్చును. అయినా మేము మా కోర్కెలు తీర్చుకొనడానికి క్రతువులు చేస్తాం.

దేవా! మేము మూఢులం. మా మేలు మాకే తెలియదు. కృపానముద్రుడవైన నీవే మమ్మల్ని పాలించి మాకు ఇహపరసౌఖ్యాలు కల్పిస్తావు. నీకు తగిన పూజలు మేం చేయలేకపోయినా ప్రసన్నుడవై మా కోర్కెలు తీర్చడానికి కరుణించి వచ్చావు. అంతేకాని నీ దర్శనలాభం కోసం నిన్ను సన్నుతించడం మా తరమా?

నిస్సంగులూ, నిశితజ్ఞానంచేత దోషరహితులూ ఆత్మారాములూ అయిన మునులు నీ గుణగణాలు నుతింప సమర్థులు. అయినా జీవితంలో తటస్థించెడి నానా వివిధ దురవస్థల యందునూ, మరణకాలమందునూ, వివశులమగు మాకు సకల పాప నిరాసకములైన నీ దివ్యనామాలను స్మరించెడి శక్తి నను గ్రహించు.

వరదా! స్వర్గాన్నికాని మోక్షాన్నికాని ఈయదగిన నిన్ను ఈ రాజర్షి ధనార్థియైనవాడు ధనవంతుని దర్శించి పొట్టు నర్థించినట్లు నీలాంటి పుత్రుడు కావాలని నిన్ను అర్థిస్తున్నాడు. నీ మాయాప్రభావంచేత మోహితుడై విషయాసక్తుడు కాని వాడెవ్వడుంటాడు? అర్థకాములమూ, మదాంధులమూ, అయిన మేము అల్పకార్యం నిమిత్తం నిన్ను ఆహ్వానించినందుకు మమ్మల్ని మన్నించు— అని ఋత్విక్కులూ, వర్షాధిపతియైన నాభీ ప్రణమిల్లగా శ్రీహరి కరుణించి వారికి ఇలా అన్నాడు—

మునులారా! మీరు వేదోక్తరీతిని నన్ను నుతించి రాజర్షియైన నాభికి నాతో సాటియైన కొడుకు నిమ్మనికదా! మీరర్థించినది. ఈ ముల్లోకాల్లో నాకు నేనే సాటి. నాకు సరివచ్చు వాడెవ్వడూ లేడు. భూసురోత్తములైన మీరు నాకు ముఖమై వర్తిస్తారు. కనుక మీమాటను కాదనరాదు. కనుక నాభి పత్నియగు మేరుదేవి యందు నేనే జన్మిస్తాను—అని పలికి శ్రీహరి అంతర్హితుడయ్యాడు

అనంతరం సర్వేశ్వరుడైన పుండరీకాక్షుడు నాభి మీదగల కృపాతిశయంచేతనూ, మునులకూ, యోగులకూ, నైష్ఠికులకూ యోగధర్మాలు తెలియజేయాలనే తలంపుతోనూ, నాభి పత్నియైన మేరుదేవి గర్భాగారంలో ప్రవేశించాడు. మేరునగధీరుడైన శ్రీహరి యుక్తసమయంలో సకల శుభలక్షణాలతో మేరుదేవికి కొడుకుగా జన్మించాడు. అపుడు ప్రజలందఱూ సంతోషాబ్ధిలో ఓలలాడారు. కాంతివంతమైన అతని దేహాన్నీ అనమానమైన అతని బలపరాక్రమాలను చూచి నాభి అతనికి ఋషభుడు అని పేరు పెట్టాడు.

అవనీసురులూ, అమాత్యగణమూ, బంధువులూ, పరివారమూ ప్రజలూ ఆ బాలకుని మహానురాగంలో రాజుగా భావించి ఆనందించారు. బాలకుడైనా

మహామహిమాన్వితుడవడంచేత ఇంద్రుడాతని మహిమలు విని ఈర్ష్యాభావంతో అతని రాజ్యంలో అనావృష్టి కల్పించాడు. ఋషభుడు అది తెలిసికొని, యోగమాయాబలంచేత రాజ్యంలో సమృద్ధిగా వర్షం కురిపించి ఇంద్రకృత దౌష్ట్యానికి ప్రతిక్రియ కావించాడు. దేశం సుభిక్షంగా ఉంది. నాభి ఆనందానికి అవధుల్లేవు. ఋషభుడు సాక్షాద్భగవత్స్వరూపుడని తెలిసి యుండీన్నీ నాభి మాయామోహితుడై అతడు తన కన్నకొడుకను భావంతో మధురోక్తులతో అతణ్ణి లాలిస్తూ పరవశించిపోయేవాడు. కొంత కాలం గడిచాక పౌరుల యొక్కయూ, అమాత్యుల యొక్కయూ అభీష్టాన్ననుసరించి అతణ్ణి రాజ్యాభిషిక్తుణ్ణిచేసి మేరుదేవితో గూడి బదరికాశ్రమానికి వెళ్ళారు. అచట మహాయోగ సమాధిలో పురుషోత్తముడైన శ్రీహరి నారాధించి క్షీణదేహుడై తుదకు హరితాదాత్మ్యం పొందాడు.

ఔరా! నాభి యదృష్టమే అదృష్టం. భూసురుల స్తుతివాక్యాలను మన్నించి శ్రీహరి తనంతట నాతని కడుపున ఋషభుడుగా జన్మించాడు. ఋషభుడు తన రాజ్యాన్ని కర్మభూమిగా భావించి ప్రజలకు కర్మతంత్రం తెలియజెయ్యాలని నిశ్చయించుకున్నాడు. లోకవిడంబనార్థం కర్మాచరణనిమిత్తం గురువులవద్ద వేదాధ్యయనం చేశాడు. వారి ఆదేశానుసారం ఇంద్రుడిచ్చిన జయంతియను కన్యను పరిణయమాడి ఆమెయందు భరతుడు మొదలైన నూర్వురు కుమారులను పొందాడు. ఆ భరతుని పేరుతోనే అతని రాజ్యమైన అజనాభం, భారతవర్షం అని విఖ్యాతి చెందింది.

ఆ మహాభారత వర్షంలో తమ తమ పేర్లతో వ్యవహరింపబడు తొమ్మిది భూభాగాలకు కుశావర్తుడు, ఇలావర్తుడు, బ్రహ్మవర్తుడు, ఆర్యావర్తుడు, మలయకేతువు, భద్రసేనుడు, ఇంద్రస్పృక్కు, విదర్భుడు, కీకటుడు అను వారలు (భరతుని అనుజులు) ప్రధానులయ్యారు. ఋషభుని కుమారులు నూర్గురులో కవి, హరి, అంతరిక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, ఆవిర్హోత్రుడు, ద్రమిళుడు, చమసుడు, కరభాజనుడు-అను తొమ్మండుగురు భాగవత ధర్మాలను ప్రకటించెడి మహాభాగవతులయ్యారు. భగవన్మహిమచే ప్రవృద్ధాలైన వారి చరిత్రలు ముందు చెప్పబడతాయి. మిగిలిన ఎనుబది యొక్క *కుమారులు పితృాజ్ఞాపాలకులు, వినీతులు, శ్రోత్రియులు, యజ్ఞశీలురు, కర్మనిష్ఠులు అయిన బ్రాహ్మణోత్తములయ్యారు.

---

*ఋషభుని పుత్రులు నూర్వురిలో, భరతుడూ, భరత వర్షంలోని తొమ్మిది భూభాగాలకు ప్రధానులైన కుశావర్తాదులు తొమ్మండుగురూ, మహాభాగవతులైన కవి మున్నగువారు తొమ్మిదిమందీ (19) పోను మిగిలిన వారు ఎనుబది యొక్కరు.

ఋషభుడు స్వతంత్రుడై సంసారధర్మాలకు దూరంగా ఉంటూ, కేవలానందానుభవుడైన ఈశ్వరుడైయుండిన్నీ, ప్రాకృతుడు లాగా కాలానుగతాలైన ధర్మాలను ఆచరిస్తాడు. ధర్మ ప్రవర్తకులయందు సమత్వం కలిగి సమస్త భూతకోటిని సమాదరిస్తాడు. గృహస్థాశ్రమంలో ధర్మబద్ధులై ఉండే లాగా ప్రజలను నియమిస్తాడు. సకలవేదరహస్యాలు, సకల ధర్మాలు తనకు తెలిసినా బ్రాహ్మణోత్తములను అడిగి తెలుసుకుంటూ, దేశకాల ద్రవ్యానుసారంగా ఋత్విక్సమేతుడై యొక్కొక్క క్రతువును నూరుమారులు చేశాడు. ఆ ఋషభుని రాజ్యంలో అందఱూ ముముక్షువులే. ఐహిక ఫలాన్ని కాంక్షించేవాడు ఒక్కడూ కనబడడు. సూర్యసమతేజుడైన అతని మహిమలు వర్ణించడం ఎవరి తరమున్నూ కాదు.

## ఋషభుడు పుత్రులకు నీతి నుపదేశించడం

అలా కొంతకాలం రాజ్యం చేశాక ఋషభుడు ఒకనాడు భూలోక ఫలాపేక్ష విడిచి మోహం విడనాడి కొడుకులకు రాజ్యభారం అప్పగించి బ్రహ్మవర్తదేశానికి బయలు దేరాడు. అతని వెంట కొడుకులు, మంత్రులు కూడా వచ్చారు. బ్రహ్మవర్తం చేరాక అచటి మునిజనుల సమక్షంలో పరమ పురుషుడైన ఋషభుడు మహానందంతో కొడుకులను దగ్గఱకు పిలిచి అనురాగం ఉట్టిపడుతూండగా ఇలా అన్నాడు-

నాయనలారా! వినండి. భూమిమీద ఉత్తమజన్మ యెత్తిన మానవులకు, హీనజాతికి చెందిన శునకాలకూ ఒకే రీతిగా కామం కష్టహేతువవుతుంది. కనుక మీరు కామాన్ని జయించండి. ఏ తపస్సు చేస్తే మానవులకు అనంత సుఖాలు చేకూరుతాయో, ఆ తపస్సే చేస్తే బ్రహ్మసౌఖ్యం కూడా లభిస్తుంది. వృద్ధులను, దీనులను ఆదరించండి దుష్టవర్తనులైన కాముకులకు దూరంగా వుండండి. మీకు శుభం కలుగుతుంది. అంగనాసక్తులైన కాముకుల సాంగత్యం నరకప్రాయం. మహాత్ముల సాంగత్యం మోక్షద్వారం.

మహాత్ములెవ్వరంటే:

శత్రుమిత్ర విచక్షలేకుండా అందఱినీ సమచిత్తంతో చూచేవారు, శాంతులు, క్రోధరహితులు, సకలభూతదయా పరులు, సాధువులు అగువారు మహాత్ములు. అలాంటి మహాత్ములు నాయందలి స్నేహమే ప్రయోజనంగా గలిగి ఉండడంచేత వారు భోగలాలసులైన కుజనులయందు, గృహమిత్ర దారసుతాదులందు ఆసక్తి వహించరు. విషయాసక్తుడైనవాడు వ్యర్థకర్మలు చేస్తాడు. అలాంటి వ్యర్థకర్మల చేసేవాడు ఎప్పుడూ పాపకర్ముడై కష్ట భూయిష్టమైన శరీరాన్ని ధరిస్తుంటాడు. వానికి జన్మరాహిత్యం ఉండదు.

కనుక పాపమూలకమైన కామాన్ని కోరకండి. ఈ జ్ఞానం కలగనంత వరకు ఆత్మతత్వం తెలియదు. ఆత్మతత్వం తెలియకపోతే శరీర ధారికి అన్నీ కష్టాలే. జననహేతువైన లింగశరీరం ఎంతకాలం ఉంటుందో అంతకాలమూ మనస్సు కర్మాధీనమై జ్ఞానవంతం కాదు. అవిద్యను విడవదు. శరీరం కర్మ మూలకం. కనుక కర్మాచరణం తగదు. వాసుదేవుడనైన యందు మీకు ఎంతకాలం ప్రీతికలుగదో అంతకాలమూ దేహధర్మాలు మిమ్మల్ని బాధిస్తూనే ఉంటాయి.

విద్వాంసుడైనా దేహేంద్రియాదులందు ఆశను పెంచుకుంటే స్త్రీ లౌల్యం ప్రధానంగా గల సంసారాన్ని అంగీకరిస్తాడు. స్వరూపస్మృతి శూన్యుడై మూఢుడౌతాడు. "స్త్రీ పురుషుల మిథునీ భావాన్నే హృదయగ్రంథి అంటారు. అది యొకవిడరాని ముడి." అది అహంకార మమకారాలను పెంచుతుంది. స్త్రీ సాంగత్యంతో పురుషునకు సంతానలాభం కలుగుంది. ఆ సంతాన హేతువుచే గృహక్షేత్ర విత్తాదు లార్జించాలనే వ్యామోహం అధికమవుతుంది. దానివలన మోక్షమార్గం దూరమవుతుంది సంసారంలో ఉన్నా మోక్షసాధనకు మార్గాలు లేకపోలేదు. ఎలాగంటే—

పర-మోపదేష్టనైన నాయందు భక్తి కలిగిఉండడం, ఆశను జయించడం, శోక మోహాది ద్వంద్వాలకు అతీతంగా ఉండడం, సకలజీవకోటి దుఃఖాలను తెలిసికొనడం, ఈశ్వరజ్ఞానాన్ని అపేక్షించడం, తపస్సు చెయ్యడం, నన్నుద్దేశించి కర్మలు చెయ్యడం, నాకథలు వినడం, నన్నే దైవంగా తెలిసికొనడం, నా గుణాలనే కీర్తించడం, ఎవ్వరితోను వైరభావం వహించకుండా అందరినీ సమబుద్ధితో ఆదరించడం, దేహగేహాదాలు ఆత్మీయాలను భ్రాంతిని విడిచిపెట్టడం, ఆధ్యాత్మయోగం, ఏకాంతసేవ, ప్రాణేంద్రియాలను నిగ్రహించడం, కర్తవ్యాన్ని విడవకుండా ఉండడం, శ్రద్ధ, బ్రహ్మచర్యం, స్వీయవిధులందు అప్రమత్తంగా ఉండడం, వాఙ్నియమం, సర్వం బ్రహ్మాత్మకమని భావించడం, జ్ఞాన విజ్ఞానాలను ఉద్దీపంచేసే యోగం— ఇవన్నీ లింగశరీరాన్ని జయించి దేహముక్తుడవడానికి హేతుభూతాలౌతాయి.

కర్మరూపకమైన అజ్ఞానాన్ని కలిగించెడి హృదయ బంధనాలనే లతలను అప్రమత్తమైన యోగమనే చురకత్తితో సాహసించి త్రెంచి వెయ్యాలి. గురువుగాని రాజుగాని యోగయుక్తుడైతే శిష్యులను, సుతులను యోగయుక్తులనుగా చెయ్యకలుగుతాడు. కాని కర్మపరులను మాత్రం యోగులనుగా చెయ్యలేడు. మానవులు ధన కాంక్షతో మూఢులౌతారు మనస్సులో ఎప్పుడూ ఐహికాలైన తుచ్ఛసుఖాలకోసం తపిస్తారు. ఇతరులతో వైరం పెంచుకొని దుఃఖమగ్నులౌతారు. మాయామోహవశులై జడులైన అలాంటి వారి యందునూ ధర్మ

బుద్ధితో దయదలచి కన్నులున్నవాడు కాననివానికి దారి చూపినట్లు తెలియ జెప్పి వారికి దివ్యమైన మోక్షమార్గం చూపాలి.

తల్లిదండ్రులుగాని, గురువుగాని, పతిగాని, బంధువుగాని, దైవతంకాని, మఱెవ్వరైనాగాని సంసారరూపమైన మృత్యువును తిరస్కరించెడి మోక్ష మార్గం చూపకపోతే వారెవ్వరూ హితులు కానేకారు. నా శరీరం దుర్విభావ్యం. నా మనస్సు సత్వగుణోపేతం, ధర్మసహితం, పాపరహితం, కనుక పెద్దలు నన్ను ఋషభుడంటారు. శుద్ధ సత్వమయమైన నా శరీరమందు జన్మించిన మీరందఱు జ్యేష్ఠుడూ, మహాత్ముడూ, అయిన భరతుని నన్నుగానే భావించి నిర్మలబుద్ధిలో సేవిస్తూ ప్రజాపాలనం చెయ్యండి. అది మీ ధర్మం. మీరలా అతన్ని సేవిస్తే మీరు నన్ను సేవించినట్లే కాగలదు- అని ఋషభు డింకా ఇలా అన్నాడు.

భూతజాలంలో స్థావరాలైన వృక్ష లతాదులకంటె జంగమాలైన సరీ సృపాదులు శ్రేష్ఠాలు. వాటికంటె జ్ఞానసహితాలైన పశ్వాదులు ఉత్తమాలు. వాటికంటె మనుష్యులు, వారికంటె సిద్ధ విబుధ గంధర్వులు, వారికన్నా దేవతలు ఉత్తములు. వారికన్న ఇంద్రాది దేవతలూ, వారందఱికంటె దక్షాది మునులు ఎక్కుడు. అంతకన్నను శివుడూ, ఆ శివునికన్న బ్రహ్మ అధి కుడు. ఈ అందరికంటె విష్ణువు శ్రేష్ఠుడు. ఆ విష్ణువు బ్రాహ్మణులను ఆదరిస్తాడు. కనుక బ్రాహ్మణుడు మానవుల పాలిట దైవం.

ఈ చరాచరకోటిలో భూసురులతో సాటియైన దైవాన్ని నే నెఱుగను. భూసురులు భుజించేటప్పుడు కలిగే ఆనందం నాకు అగ్నుల నుపాసించే టప్పుడు కూడా కలగదు. మంగళకరమైన బ్రహ్మస్వరూపాన్ని, వేదాత్మక మైన నా దేహాన్ని తత్వబుద్ధిలో బ్రాహ్మణులు ధరిస్తారు. శమం, దమం, సత్యం, తపస్సు, తితిక్ష గల విప్రుడు ఉత్తమ గురువు. కనుక విప్రుణ్ణి సేవిస్తే నన్ను సేవించినట్లే. ఈ రహస్యం తెలిసికొని బ్రాహ్మణ జాతిని పూజించేవాడు మాయాతీతుడై భూతలమందే మోక్షమార్గాన్ని తెలిసి కొంటాడు.

ఈ రీతిగా ఋషభుడు సదాచారులైన కుమారులకు లోక ప్రదర్శ నార్థం ఆచారాలను ఉపదేశించాడు. అచటి మునులకు భక్తి జ్ఞాన వైరాగ్య లక్షణాలు గల పరమహంస ధర్మాన్ని బోధించాడు అనంతరం పరమ భాగవతుడూ, భగవజ్జప పరాయణుడూ అయిన తన అగ్రసుతుడు భరతుని రాజ్యాభిషిక్తుణ్ణి చేసి తాను సకల దైహిక బంధాలను వదలి దిగంబరుడై ఉన్మత్తుడుగా జుట్టు విరియబోసికొని ఆత్మయందు ఆహవనీయాదులగు

నగ్నులను ఆరోపణం చేసికొని బ్రహ్మావర్తదేశం విడిచి వెళ్ళాడు మార్గ మధ్యంలో జనులు తనను పలకరించినా పలుకక, జడునిలాగా గ్రుడ్డివాని వలెనూ, చెవిటివాని రీతిగా మూగవాని మాదిరిగా పిశాచం విధంగా పిచ్చివాని పోలికగా వర్తిస్తూ అవధూతవేషంతో తన దారిని తాను పోయేవాడు.

అలా పోతూన్నపుడు నగరాల్లోను, గ్రామాల్లోను, జానపదాల్లోను, గొల్లపల్లెల్లోనూ, ఆశ్రమాల్లోను, పర్వత ప్రదేశాల్లోను, తుంటరి పిల్లలు అతని వికృతవేషం చూసి అతని వెంటబడి బెదరిస్తూ రాళ్ళు రువ్వుతూ, ఉమియుచూ, మూత్రవిసర్జనం చేస్తూ తిడుతూ, కొడుతూ ఎంతటి పరాభవం చేసినా మదగజం తనవెంట మూగెడి ఈగలను గణించనట్లు వారిని లెక్క చేసేవారు కాదు. దేహాభిమానంతో చిత్తచలనం పొందకుండా నిర్లిప్తభావంతో ఏకాకియై అలాగే తిరుగుతూన్నారు.

అతడు సహజ సుకుమారుడు. మహా సౌందర్యవంతుడు. అంచేత ఈ వికృతావస్థలో కూడా మృదువులైన అతని కరచరణాలు, విశాలమైన వక్షస్థలం, దీర్ఘ బాహువులు. ఎగుబుజాలు, శంఖంలాంటి కంఠం, చక్కని అవయవ విన్యాసాలు, మనోజ్ఞమైన మందహాసంతో గూడిన ముఖారవిందం, క్రొంగలువ రేకుల్లాంటి నేత్రాలు, కాంతాజన హృదయాలను ఇట్టే ఆకట్టుకుంటున్నాయి.

ధూళిధూసరితమై జడలు కట్టిన కేశపాశంతో, మలినములైన అవయవాలతో అవధూత వేషం ధరించిన ఋషభుడు పిశాచం పట్టినవానిలాగా తిరుగుతూ యోగసంచారం ఇలాగే లోకవిరుద్ధంగా ఉంటుందని ఆత్మవర్తనలో తెలియజేస్తూ భీకన్ని రూపంతో నేలమీద పరుండియే తింటాడు, త్రాగుతాడు, మూత్ర పురీషాలు విసర్జించి అక్కడే దొరలాడతాడు. యోగ మహిమచేత అతని పురీష సౌగంధనం వహించిన వాయువు దశదిశలా దశ యోజన పర్యంతం వీస్తుంది.

భగవదంశయైన ఋషభుడీ రీతిగా గో మృగ కాక చర్యలవలంబించి మహానందం అనుభవిస్తూ తనయందు సర్వ భూతాంతర్యామియైన వాసుదేవుని ప్రత్యక్షంగా చూడగలిగిన వాడవడంచేత అతనికి సకలార్థ సిద్ధులు ప్రాప్తించాయి అంచేత ఆకాశగమనం, మనోజవం, పరకాయ ప్రవేశం, అంతర్ధానశక్తి దూరగ్రహణ శవణయోగం మొదలైన సిద్ధులు తమంత వచ్చినా అతడు తిరస్కరించాడు' అని శుకుడు చెప్పేసరికి – 'మునీంద్రా! యోగజ్ఞానంచేత వెరుపబడిన కర్మలు గల పెద్దలు ఒకవేళ యోగసిద్ధులు అవలంబించి వర్తించినా వారికి తిరిగి సంసారబంధము లభించదే? అలాంటప్పుడు ఋషభుడు తన దగ్గరకు వచ్చిన యోగసిద్ధులను అంగీకరిస్తేమాత్రం వచ్చే నష్టమేముంది ?' అని ప్రశ్నించగా శుకమహర్షి ఇలా అన్నాడు.

'రాజా! నీ మాట నిజం. ఋషభుడు యోగసిద్ధులను తిరస్కరించ డానికి కారణం చెపుతాను విను. వన్యమృగం పట్టువడి కూడా అదను కని పెట్టి మాయోపాయంతో బోయవానిని వంచించునట్లు మనస్సు ఇంద్రియాలను వంచించి కామాదులకు ఆశ కల్పిస్తుంది. జారకాంత భర్తను వంచించి విటునకు ఆశ్రయ మిచ్చునట్లు మనస్సు ఎంతటి తపశ్చర్యనైనా హరించి అరిషట్కాన్ని అతిశయింపచేస్తుందని జ్ఞానులు మనస్సును ఎన్నడూ విశ్వసించరు.

అంచేత దివ్యయోగీంద్రుడూ, పరమ పురుషుడూ, అయిన ఋషభుడు ఎన్నడూ ఐశ్వర్యాలను చేపట్టాలని చూడడు అవధూత వేషభాషలతో తన యందున్న భగవత్స్వరూపాన్ని ఇతరు లెరుగకుండా కప్పిపుచ్చుతూ దేహ త్యాగం చెయ్యడానికి నిశ్చయించుకున్నాడు. కుమ్మరి సారెను త్రిప్పి విడిచి పెట్టినా అది మరికొంతసేపు తిరుగుతూనే ఉంటుంది. అలాగే ఋషభుడు దేహాభిమానాన్ని విడిచినా ప్రాచీన సంస్కార విశేషమైన అభిమానం యోగ మాయావాసనచే ఉన్నట్లు తోపింపజేస్తూ ఒకప్పుడు కొంకణం, వంకవటం, కుటకం అను దక్షిణ కర్ణాటదేశాలకు వెళ్ళాడు.

అక్కడ కుటకపర్వత సమీపంలో ఉపవనములందు నివసిస్తూ రాళ్ళు తింటూ పిచ్చివానిలాగా జుట్టు విరియబోసికొని దిగంబరుడై తిరుగుతూండగా భయంకరమైన దావాగ్ని ఆ వనాన్ని దహించివేసేసరికి అందులో అతడు కూడా దగ్ధుడయ్యాడు. ఆ దేశాధిపతియైన అర్హతుడను రాజు ఋషభుని చరిత్ర విన్నాడు. అతడొక మహాపురుషుడని భావించాడు.

అతడు నిజధర్మాలను విడిచిపెట్టి తన ప్రజలతో ఋషభుని ఆచారా లను అనుసరించాడు. కాని కలియుగం అధర్మ బహుళమవడం వల్ల ఋష భుని వర్తనలోని వైశిష్ట్యాన్ని గ్రహింపక ప్రజలు అసమంజసమైన పాషండ మతాభినివేశులయ్యారు వర్ణాశ్రమ ధర్మాలు విడిచిపెట్టారు. స్నానం, ఆచమనం, శౌచం విడిచిపెట్టారు. అధర్మ ప్రచురమైన కలి వలన వేదాలను, బ్రాహ్మణులను, దేవతలను నిందిస్తూ అవివేకులై చరించడం మొదలు పెట్టారు.

వాస్తవంగా ఋషభుడు స్థాపించింది అవధూతలైన పరమహంసల పద్ధతి. రజోవ్యాప్తులగు పురుషులకు మోక్షమార్గం ఉపదేశించడానికి అది ఉద్దిష్టమైంది. కాని కలిప్రభావంచేత ప్రజలు తలకొక మతాన్ని స్థాపించి స్వేచ్ఛగా చరిస్తూ తమ తమ మతాలే శ్రేష్ఠమైనవని భావించడం మొదలు పెట్టారు.

కాని సప్త సముద్ర పరీవృతమైన భూమండలంలోని సప్తద్వీపాల్లోను,

నవ వర్షాల్లోను, నివసించేది జనులుమాత్రం తప్ప దారినిబడక ఋషభుని కృత్యాలను కీర్తించారు. ఎంచేతనంటే అవి దివ్యావతార ప్రతిపాదకాలు. ఆ మహానుభావుని అంశంలోనే ప్రియవ్రతుడు జన్మించాడు. జగదాద్యుడు, పురాణ పురుషుడు, అయిన ఆ శ్రీహరియే ఋషభావతారం ధరించి కర్మహేతుకంగాని మోక్షధర్మం ప్రతిపాదించాడు. అతడు యోగమాయా సిద్ధులు అసత్యాలని తిరస్కరించాడు.

అంతటి మహానుభావుడైన ఋషభునకూ, అతడు చెప్పిన సిద్ధిని పొంద దానికి యత్నిస్తున్నామని భ్రమపడు అన్యయోగీశ్వరులకూ సాటి యెక్కడ? గోబ్రాహ్మణులకు, దేవతలకు, వేదాలకు గురువైన సాక్షాద్భగవంతుడు ఋషభుడు. అతని చరిత్ర ఎవరు వినినా, పాపాలు తొలగిపోతాయి. సకలశుభాలు సిద్ధిస్తాయి. హరిభక్తి దృఢమవుతుంది. సమస్త పురుషార్థాలు ప్రాప్తిస్తాయి. పాపహేతువైన సంసార బంధం తొలగిపోతుంది నిరంతరభక్తి యోగమను అమృతమందు స్నానంచేసి ముక్తులౌతారు-అని సప్తద్వీపవాసులు ఈనాడును విశ్వసించి ఆ మహాపురుషుని కీర్తిస్తారు.

రాజేంద్రా! యాదవులకు, మీకు కులగురువైన కృష్ణుడు అలాంటివాడే. అతడు లేని చోటులేదు అతణ్ణి సేవించే వారందరికీ, సులభుడై మోక్షం ఇస్తాడు. నీవేమీ చింతించవద్దు. ఋషభుడు ప్రత్యక్ష విష్ణువు. నిత్యానుభూత మైన ఆత్మరూపం లభించడం వలన ఇతర పురుషార్థములందు ఆశలేనివాడై, మాయావిరచితమైన అర్థమందు తగుల్కొనని నిర్మల బుద్ధికలిగి కరుణా సముద్రుడై అందరికి అవ్యయమైన తనలోకాన్ని చూపింపగల మోక్షమార్గాన్ని తెలిపి ఆ మహాత్ముడు శరీరం త్యజించి తాదాత్మ్యం చెందాడు.

## భరతోపాఖ్యానం

ఋషభుడు రాజ్యంవిడిచి అవధూతయై వెళ్లాక ఆతని జ్యేష్ఠ సుతుడు భరతుడు ధరాపాలనం చేస్తూ విశ్వరూపుని కుమార్తెయగు 'పంచజని' ని పత్నిగా చేసుకున్నాడు. అహంకారంవలన పంచతన్మాత్రలు జనించినట్లు ఆమెవలన భరతునకు—సుమతి, రాష్ట్రభృత్తు, సుదర్శనుడు, ఆచరణుడు, ధూమ్రకేతువు అను అయిదుగురు కొడుకులు కలిగారు. అంతవరకు అజనాభం అను పేరులో ప్రవర్తితమైన వర్షం భరతుడు పాలించడం వలన భారతవర్షం అని ప్రసిద్ధి కెక్కింది.

భరతుడు హరికృపాపాత్రుడై తన పితృ పితామహుల మాదిరిగా కర్మాచరణం చేస్తూ విప్రజనసమ్మతంగా ప్రజాపాలనం చేశాడు అనేక యజ్ఞాలు చేశాడు దర్శ పూర్ణిమాస్యలు, చాతుర్మాస్యాలు అనేటి అగ్నికార్యాలు నిర్వ

ర్తించాడు. పశుయజ్ఞాలు, సోమ యజ్ఞాలు ఎన్నో ఆచరించాడు. వేదోక్తాలైన ఈ పవిత్ర కర్మలన్నీ అతడు పురుషోత్తమార్పణంగా చేశాడు. యజ్ఞవిధులందు మంత్రాలు ఆయాదేవతల నామాలతో ఒప్పుతూన్నా అవన్నీ ఆ దేవతలకు అంతరాత్మయైన వాసుదేవునియందే పర్యవసితములవడంచేత ఆ దైవాలను వాసుదేవుని అవయవాలుగా భావించి అతడు అత్యంత శ్రద్ధతో విహిత కర్మలు ఆచరిస్తూ రాజ్యపాలనం చేశాడు.

భరతుడు వాసుదేవుని యందు అచంచలమైన భక్తితో ధర్మబద్ధంగా యాభైలక్షల వేల సంవత్సరాలు రాజ్యాన్ని పాలించి తన పితృపితామహులు సంపాదించిన ధనాన్ని పుత్రులకు పంచియిచ్చాడు. సకల సంపదలతో తులతూగుతూన్న ఇంటిని విడిచిపెట్టి పులహాశ్రమానికి వెళ్ళాడు. ఆ ఆశ్రమం పరమపవిత్రమైనది. శ్రీహరి ఆ పులహాశ్రమాన్ని విడిచిపెట్టకుండా ప్రత్యక్షంగా ఉండి అచట నున్నవారినందరినీ ఆదరిస్తాడు. ఆ ఆశ్రమ సమీపంలో సాలగ్రామాలతో నిండిన గండకీ నదిప్రవహిస్తూ ఉంటుంది. భరతుడు ఆ నదీ తీరాన ఏకాకియై నానా విధాలైన పూవులతోను, కందమూల ఫలాలతోను, తులసీ దళాలతోను, స్వచ్ఛాంబువులతోను, కందమూల ఫలాదులతోను శ్రీహరిని నిత్యం అర్చిస్తూ ఉంటాడు. దానివలన అతనికి విషయాభిలాషలు నశించాయి. శమదమాది గుణాలు వృద్ధిచెందాయి. నిరంతరం హరిని సేవించడంవలన అతని హృదయ గ్రంథి (అహంకారమనెడి ముడి) వీడిపోయింది. సంతోషంతో అతని శరీరం పులకించింది. కనుగవ నుండి ఆనందాశ్రువులు సంతత ధారగా స్రవించాయి.

శ్రీహరి చరణారవింద ధ్యానం వలన పరిచితమైన భక్తియోగంతో పరమానంద భరితమై గంభీరమైన హృదయమను అమృతహ్రదం (మడుగు) లో మునిగిపోవడంచేత భరతునకు తానుచేసే పూజకూడా తెలియడంలేదు. ఇలా భగవద్వ్రతంపూని లేడిచర్మం దాల్చి ముప్పేళ స్నానం చెయ్యడం వలన ఆర్ద్రమై వంకరలు తిరిగి రాగి రంగుగల జడలు కట్టిన కేశపాశం కలిగి సూర్యాంతర్వర్తియైన పరమేశ్వరుని హిరణ్మయ పురుషునిగా భావించి ఇలా ధ్యానం చేశాడు.

'దేవా! నీవు జీవులకు కర్మఫలాన్ని ఇస్తావు. సంకల్ప మాత్రంచేత లోకాలను సృజించి నీవా లోకాల్లో జీవకోటిరూపంలో ప్రవేశిస్తావు. ఆ పైన ఆనందరూపమైన బ్రహ్మమును గోరెడి జీవునకు నీయోగ శక్తి నిస్తావు. ఆ శక్తిలో జీవుడు తాదాత్మ్యం చెందుతాడు. ఇలా అహోరాత్రాలు లోకాలను పాలిస్తూ సూర్యమండల మధ్యవర్తివై ప్రకాశిస్తావు. లోకాల్లో నీవు అంతర్యామివిగా ఉన్నా నిన్ను ప్రకృతి గుణాలంటవు. సాటిలేని నీ యా దివ్యానందమయ

రూపాన్ని శరణు చొచ్చెదను' అని భరతుడు అనుదినం శ్రీహరిని ధ్యానం చేసేవాడు.

ఇలా ఉండగా అతడొకనాడు నదిలో స్నానంచేసి మూడు ముహూర్తాల కాలం నీటిలో ప్రణవం జపిస్తూ ఉన్నాడు. ఆ సమయంలో నిండుచూలాలైన లేడి యొకటి దప్పికగొని నీటికోసం ఆ నదిదగ్గరకు వచ్చింది. అది జలపానం చేస్తూండగా ఆ దగ్గఱలో పొంచి ఉన్న సింహం గర్జించినది. సహజంగా భీత స్వభావంగల లేడి సింహాన్ని చూడగానే కలవరపడి యెగిరి గంతేసింది. అలా యెగిరినపుడు భయవశంచేత దాని గర్భంలో ఉన్న జింకపిల్ల దాని యోని ద్వారాన జాఱి నదీజలంలో పడ్డది. ఆ లేడి వెంటనే ఆ నదీతీరానగల ఒక కొండ లోయలోపడి మరణించింది.

మాతృగర్భం నుండి జాఱిపడి నీటిపై తేలియాడుతూన్న ఆ లేడిపిల్లను భరతుడు కనువిచ్చి చూచాడు. అతని హృదయం ద్రవించింది. అతడు వెంటనే మృతజననియైన ఆ లేడిపిల్లను తన ఆశ్రమానికి తీసుకొని వెళ్ళి దాన్ని ప్రేమతో ఉపలాలనం చేస్తున్నాడు. క్రమంగా దానిమీద మమకారం పెరిగింది. నిరంతరం దాని పాలన పోషణాదికంలో నిమగ్నుడై ఎప్పుడూ ఆ హరిణ శాబకాన్ని గూర్చి ఆలోచిస్తూ ఉండడంవల్ల ఆత్మ విషయాలైన అష్టాంగ యోగాలు, శ్రీహరి పూజా పరిచర్యలు క్రమంగా అంతరించాయి.

అలా అతని తపస్సు భంగమైనా ఆతనికావిషయం తెలియనే తెలియదు. అతనికి ఆ లేడిపిల్లపై మనఃప్రీతి అధికం కాగా అతడు దాని నుద్దేశించి యిలా వితర్కించడం మొదలు పెట్టాడు- అయ్యో! ఈ మృగశాబకానికి తల్లి లేదు. ఆప్తులుకూడా ఎవ్వరూలేరు. ఏదిక్కూ లేని దవడంచేత నేను దీనిని తెచ్చాను. ఇది నన్నెంతో ప్రేమిస్తోంది. నాయెదుట నిర్భయంగా చరిస్తోంది. అంచేత దీన్ని నేను అనురాగంతో పోషిస్తాను. శరణార్థియై వచ్చిన జంతువునైనా, కనువిచ్చిచూచి రక్షించడం వలన లభించెడి పుణ్యం అధికమని మునీంద్రులు చెప్పగా విన్నాను—

అని భావించి ఆ లేడిపిల్లను తన ఆశ్రమంలోనే ఉంచుకున్నాడు. అతడు కూర్చున్నా, పరుండినా, తిరుగుతున్నా, సమిధలు, దర్భలు, పువ్వులు తేవడానికి అడవికి వెళ్ళినా, జపమూ పూజా చేసుకుంటున్నా దాన్ని తన దగ్గఱే వుంచుకున్నాడు. అది అడవుల్లోకి పోతే వన్య మృగాలు ఎక్కడ దాన్ని వధిస్తాయో అని దాని వెంటనంటి పోతాడు. అమిత ప్రేమతో దాన్ని కొంతసేపు భుజాలపై ఎక్కించుకుంటాడు. కొంతసేపు ఱొమ్మున హత్తుకుంటాడు. కొంతసేపు ఒడిలో నుంచుకొని లాలిస్తూ మురిసిపోతాడు.

అతడు నిత్య నైమిత్తిక క్రియలు చేసేటప్పుడు మధ్య మధ్య లేచి ఆ

లేడి ఎక్కడుందో ఎలాఉందో చూచి వస్తేనే కాని అతని మనస్సుకు ఊరట కలిగేదికాదు. మాటిమాటికి దాన్ని ఆశీర్వదిస్తూ అభినందిస్తాడు ముద్దాడుతూ ముచ్చటపడుతాడు. ఇలా భరతుడు తల్లిలేని ఆ లేడిపిల్లపై అమితమైన మోహం పెంచుకున్నాడు.

అతనిపై చనువుతో అది పరుగులు పెడుతూ వచ్చి అతనిపై తటాలున దూకుతుంది. కొమ్ములతో చిమ్ముతుంది. కాళ్ళ త్రొక్కుతుంది. గోళ్ళతో గీరుతుంది. అతని ఒడిలో కొంతసేపు ఒదిగిఉండి అంతలో గభాలున అతని వీపెక్కుతుంది అది ఇలా చెలరేగి స్వేచ్ఛగా ఆడుతూఉంటే భరతుడు ఆనందంతో పరవశించిపోతూ ఉంటాడు. ఇలా ఉండగా ఒకనాడు ఆ లేడి ఆశ్రమం విడిచి కనిపించకుండా పోయింది. అపుడు భరతుడెంతో మనోవ్యధ చెందాడు ధనం పోగొట్టుకొన్న దీనునిలాగా విలపించాడు. దాని విరహం భరించలేక విహ్వలించాడు. శోక భారంతో అనుక్షణం దాన్నే స్మరిస్తూ ఇలా చింతించాడు.

హరిణడింభకమా! వనాంతంలో నీకు క్రూరమృగ బాధలేకుండా నిన్ను వేయి కళ్ళతో కనుపెట్టుకొని ఉంటున్నానే! నీవు నన్ను వంచించి వెళ్ళిపోతే నేనేంచేస్తాను? నీవు తిరిగి నాకంట ఎలాపడతావు? నిన్నేవిధంగా మళ్ళీ పాలించి లాలిస్తాను?- అని ఆరాటపడుతూ- అయ్యో! ఈ ఆశ్రమభూమిలో మొలిచి యేపుగా పెరిగిన లేతతృణసమూహం తిని పెద్దదైన ఈ హరిణం అటూ ఇటూ తిరుగుతూ మృగేంద్రుని చేజిక్కి మృతి చెందిందేమో!

అది ఎప్పుడు తిరిగి వచ్చి నన్ను సంతోషపరుస్తుంది? నానావిధాలైన తన గతి విశేషాలచేత నన్నెప్పుడు ఆనందపరవశుని చేస్తుంది నేను ధ్యాన సమాధిలో ఉన్నప్పుడు అదివచ్చి కొమ్ములతో గోకేది. ఆ వినోదానుభూతి నాకు మళ్ళీ ఎప్పుడు లభిస్తుంది? దేవపూజాద్రవ్యాలు త్రొక్కి అది వాసన చూస్తూంటే నేను కసరుకొనేవాణ్ణి. అపుడది అభిమానవంతుడైన కన్న బిడ్డలాగా దూరంగావెళ్ళి నిలబడి తిరిగి నేను ప్రణయభరంతో పిలిస్తే వచ్చి నా వెనుక నిలబడేది. అంతటి మెలకువతో వర్తించెడి స్వభావం మృగజాతికి ఉండడం ఆశ్చర్యం కాదు!

ఈ భూమి ఎంత తపస్సు చేసుకొన్నదో! ఆ హరిణ పాద స్పర్శలతో పవిత్రమై అది స్వర్గాపవర్గాలను కాంక్షించెడి మునులకు యజ్ఞార్హ ప్రదేశమైంది. అలాంటి హరిణశాబకాన్ని నేనెలా కనుగొనగలను? అదుగో! చంద్రుడు నా ఆశ్రమం విడిచి వెళ్ళిన తల్లిలేని ఆ లేడిని మృగరాజెక్కడ వధిస్తాడో! అని జాలిపడి బహుశా తాను తీసుకొని వెళ్ళి పెంచుకుంటున్నాడేమో! నేను ఇంతకుముందు పుత్రులను విడిచిరావడం వలన కలిగిన తాపాన్ని

చంద్రకిరణ స్పర్శచే పోగొట్టుకొనేవాణ్ణి. కాని ఇప్పుడు హరిణపోతం తన శరీరస్పర్శచేత చంద్రకిరణాలకంటె అధికంగా నా సుత వియోగతాపాన్ని పోగొడుతోంది— అని హరిణ నిమిత్తాలైన కోర్కెలచేతను, పూర్వకర్మవశం చేతను భరతుడు యోగభ్రష్టుడయ్యాడు. భగవదారాధన విడిచిపెట్టాడు. హరిణంమీద అంతులేని వ్యామోహాన్ని పెంచుకున్నాడు—

మోక్షవిరుద్ధమని భావించి పూర్వం భరతుడు విడువరాని కొడుకులను విడిచివచ్చాడు. ఇప్పుడో లేడిపిల్లను పెంచి పోషిస్తూ దాని వ్యామోహంలో పడ్డాడు. ఎలుక బొఱియలో ప్రవేశించిన పామునోట్లో ఎలుక అలవోకగా పడ్డట్టయింది. అతడు యోగభ్రష్టుడయ్యాడు. రాజా! చూచావా? కాలం ఎంత వానికైనా గడవరాదు. మునులకైనా విధి తప్పదు. ఇతరులసంగతి చెప్పడం దేనికి? ఇలా భరతుడు మృగవియోగ తాపంచేత ఎంతో బాధపడుతూండగా అనూహ్యంగా ఒకనాడు ఆ లేడి తిరిగివచ్చేసరికి అతనికి బ్రహ్మానందం కలిగింది'— అని శుకుడు ఇంకా ఈ రీతిగా చెప్పడం మొదలుపెట్టాడు—

'ఇలా ఉండగా భరతునకు అంత్యకాలం ఆసన్నమైంది అపుడాతడు తాను సుతనిర్విశేషంగా పెంచుకుంటూన్న హరిణశాబకాన్ని తదేకదృష్టితో చూస్తుండడంవల్ల అతని హృదయంలో ఆ హరిణరూపమే నిలిచిపోయింది. అంచేత దేహత్యాగానంతరం అతడు హరిణీ గర్భంలో జనించి హరిణ మయ్యాడు. ఈ విధంగా భరతుడు లేడి కడుపునపుట్టినా పూర్వం తాను చేసిన భగవదారాధన సామర్థ్యంచేత తన మృగత్వ కారణం తెలిసికొని ఇలా చింతించాడు—

ఒకనాడు నన్ను రాజులందఱు ప్రస్తుతించారు. మహేంద్ర సమానుడనని పేరుపొందాను. కొడుకులకు రాజ్యంఇచ్చి తపస్వినయ్యాను. నన్ను అందఱు రాజర్షినని కీర్తించారు. అలాంటి తేజశ్శాలినైన నేను ఆ హరిణ దేహమందలి ప్రీతిచే ఆ తేజస్సును కోల్పోయాను. భ్రష్టుడనయ్యాను. యోగిజనుల్లో చులకన అయ్యాను.

శ్రీహరి ధ్యాన పరిచర్యాదులను ఒకక్షణం కూడా విడిచిపెట్టని నాకు హరిణపోతస్మరణం వలన యోగవిఘ్నం కలిగింది. మోక్షదూరుడనయ్యాను— అని లోలోపల అమితమైన వేదనచెందాడు. తన మృగజననిని విడిచిపెట్టి తిరిగి పులస్త్య పులహాశ్రమానికి వెళ్ళాడు. ఆ ఆశ్రమం దట్టంగా పెరిగిన మద్దిచెట్లుగల యొక గ్రామసమీపంలో ఉంది. ఉపశమన శీలురైన మునులెందఱో అక్కడ తపస్సుచేసుకుంటూ ఉంటారు. భరతుడు ఆ ఆశ్రమ ప్రాంతంలో ఉన్న కాలాంజనపర్వతం చేరుకున్నాడు. అక్కడ తన మృతదేహాన్ని త్యజించాలని కాంక్షించి సకలసంగమాలు విడిచిపెట్టి ఎండుటాకులు, తృణమూ

తింటూ తన మృగత్వానికి హేతువైన ఆ నదీతీర్థంలో అవసానాన్ని కోరుతూ తుదకు అక్కడే దేహత్యాగం చేశాడు'— అని శుకుడు పరీక్షిన్నరేంద్రునకు ఇంకా ఇలాచెప్పడం మొదలు పెట్టాడు—

## భరతుడు హరిణజన్మంవిడిచి బ్రాహ్మణుడై జనించడం

'హరిణదేహం విడిచిన తర్వాత భరతుడు—తపస్స్వాధ్యాయ నిరతుడూ, సీతికోపిదుడూ, శమదమాది గుణసంపన్నుడూ అయిన అంగిరసుడను నొక బ్రాహ్మణునకు పుత్రుడుగా జన్మించాడు. తిరిగి ఈ సంసారబంధం ఏమిటా అని విస్తుబోయాడు. కర్మబంధాలను త్రెంచకల్గిన శ్రీహరి చరణధ్యానానికి విఘ్నం కలుగకుండా మనస్సులో ఆ దేవుని నిరంతరం స్తుతిస్తున్నాడు.

అంగిరసునకు ప్రథమ భార్యయందు తొమ్మండుగురు కొడుకులు పుట్టారు. కనిష్ఠ భార్యయందు స్త్రీ పురుషులిద్దఱు జన్మించారు. ఆ కనిష్ఠభార్య కొడుకే భరతుడు. అతడు హరిణదేహాన్ని విడిచి ఆ విప్రదంపతులకు పుట్టాడు. అతడు పరమభాగవతుడు. రాజర్షి. ఇదే అతని చరమశరీరం. అన్యజన సాంగత్యం జన్మపరంపరలకు కారణమౌతుందని అతని భీతి. కర్మబంధాన్ని విచ్ఛిన్నం చెయ్యగలది శ్రీహరి ధ్యానమొక్కటే. శ్రీహరి అనుగ్రహంచేత అతనికి పూర్వజన్మ జ్ఞానంఉంది. అంచేత అతడు నిరంతరం శ్రీహరి ధ్యానం చేస్తూ అతడొక మహాజ్ఞాని యని యితరులు గ్రహించకుండా వెఱ్ఱివానిలాగా, జడుడులాగా, గ్రుడ్డివానివలెను చెవిటివానివలెను. ప్రవర్తించడం మొదలు పెట్టాడు.

అంగిరసుడు కొడుకును సాదరంగా పెంచుతూ చౌలోపనయనాది కర్మలు చేసి అతణ్ణి సంస్కారవంతునిగా చేశాడు. అతనికి ఇష్టం లేక పోయినా తండ్రి అతనికి శౌచాచారాలు బోధించాడు. తండ్రి మాట కాదనలేక భరతుడా కర్మలను అంగీకరించాడు. అతని బోధలు విన్నాడు. అయిష్టంగానే తండ్రి సన్నిధిలోనే ఇతరులతో గూడి వేదాధ్యయనం చేశాడు. ప్రణవం[1] ముందుగాగల వ్యాహృతులలో[2] గూడిన గాయత్రీ మంత్రోపదేశం పొందాడు.

అతని యందున్న మోహం చేతను, ఆత్మభూతుడైన అతనిని శిష్టాచార సంపన్నునిగా చెయ్యాలనెడి ప్రబల వాంఛతోను, లోకాచారం అనుసరించిన్నీ, అంగిరసుడు అతనిచేత శౌచం, ఆచమనం, అధ్యయనం, జపతపాదులు,

1. ప్రణవం=ఓంకార మంత్రం. 2. వ్యాహృతులు—భూః, భువః, సువః అను మూడు మంత్రాలు.

అగ్నికార్యాలు చేయించారు. కాని వాటియందు అతనికంత మక్కువలేదని గ్రహించి ఆ విప్రుడు విగతమనోరథుడై కొంతకాలానికి మృతిచెందాడు.

అతని తల్లి పతితో అగ్నిప్రవేశం చేసింది. భరతుని మహిమలు తెలియక అతని సవతితల్లి కొడుకులు అవినీతులై శాస్త్రవిద్యలను చదువనీయ కుండా అతనిని గృహకర్మల్లో నియోగించారు. భరతుడు మాటాడకుండా వారు చెప్పిన పనులన్నీ ఏమరిల్లక, వాటియందు ఆసక్తి వహించక చేసేవాడు. ఇలా అతడు గృహకృత్యాలు నిర్వహిస్తూంటే ద్విపాద పశువు లనదగిన మూఢులగు ఆ యింటిలోనివారు అతనిని ఓయీ వెఱ్ఱివాడా! ఓయీ జడుడా! ఓయీ చెవిటివాడా! అని అవహేళన చేస్తూ నీచంగా భాషించేవాళ్ళు. అయినా అదేదీ గణించకుండా అతడు వారి యాజ్ఞానుసారంగాగాని, గత్యంత రం లేకగాని బరువులు మోయడానికి, కూలిచెయ్యడానికి, యాచించడానికి కూడా పాల్పడేవాడు. మృష్టాన్నం పెట్టినా, పాసిన చలిది పెట్టినా అతడు హితంగానే భుజించేవాడు. రుచులకోసం ప్రాకులాడేవాడు కాదు.

అతనికి ఆత్మానుభూతియందే ఆనందం. సుఖమేదో దుఃఖమేదో అతనికి తెలియదు. అతనికి దేహాభిమానం లేదు. చలికి, వేడిమికి, గాలికి, వర్షానికి, ఎండకు భయపడేవాడు కాదు. ఎన్నడూ పైన చీర కప్పుకొని యెఱుగడు. అతని శరీరం వృషభ శరీరంలాగా బలిష్ఠమై మోటుతేలి ఉండ డంచేత అతడు కటిక నేలమీద పడుకుంటాడు. నడుముకు మలినాంబరం చుట్టుకుంటాడు. దుమ్ముచే కప్పబడిన మాణిక్యం వెలుగులు చిమ్మదు. అలాగే నేలపై శయనిస్తూ స్నానాదికం లేకపోవడంచేత అతని బ్రహ్మ వర్చస్సు ఎవడికీ గోచరమయ్యేది కాదు. అతని యజ్ఞోపవీతం మట్టికొట్టుకుని నల్లగా ఉండడంచేత క్రతుకర్తలైన బ్రాహ్మణులు "ఇతడు బ్రాహ్మణుడు లాగా కనబడతాడు కాని వట్టి మూఢుడు" అని పరిహసించేవారు.

అయినా భరతుడు వారికి మాఱుపలకక తన దారిని తాను వెళ్ళిపోయే వాడు. ఏదో పని చేసిపెట్టిగాని యితరుల వలన ఆహారం స్వీకరించడు. అప్పుడప్పుడు తనవారు వ్యవసాయ కర్మలయందు అతనిని నియోగించేవారు. కాని అతనికి కృషికర్మ యేమీ తెలియదు. ఏది పల్లమో ఏది మెరకో, ఏ నేల సారవంతమైనదో ఏది సారవిహీనమైనదో ఎఱుగడు. ఎంత శ్రమ పడినా అతనికి సరియైన ఆహారం లభించేది కాదు. ఊక, తవుడు, తెలిక పిండి, పొట్టు, మాడిన అన్నం— ఏది లభించినా అమృత రసతుల్యంగా భావించి తినేవాడు.

# వృషలరాజభృత్యులు కాళికాదేవి బలికి భరతుని గొనిపోవడం

భరతుడు కావలి కాస్తూన్న చేను సమీపంలో ఒక శూద్ర పల్లె ఉంది. దాని కధిపతియైన వృషలరాజుకు సంతానం లేదు. సంతానార్థియై కాళికా దేవికి నరపశువును బలిగా ఇవ్వడానికి సంకల్పించాడు. అతని ఆజ్ఞానుసారం అతని సేవకులు ఒక పురుషుణ్ణి ఎలాగో పట్టుకొని కాళికాలయానికి తీసికొని వెళ్తూండగా అతడు వారిని మాయోపాయంచే వంచించి కనుమరుగయ్యాడు.

వృషలపతి భృత్యులు అతనికోసం గాలించారు. కాని లాభంలేక పోయింది. ఆ రాత్రి వారు చేనిగట్టున వీరాసనం వేసికొని కూర్చున్న భరతుని చూచి బలిపశువు మంచిది దొరికిందని సంతోషించారు. వెంటనే అతణ్ణి పట్టి బంధించి కాళికాలయానికి తీసికొని వెళ్ళి అభ్యంజనాది సంస్కారాలు చేశారు. క్రొత్త బట్టలు కట్టారు. గంధ పుష్పాక్షతలతోను, ఆభరణాల తోను అలంకరించారు. మృష్టాన్నం భుజింపజేశారు.

దేవికి ధూపం, దీపం, మాల్యం, లాజలు (పేలాలు), చిగురాకులు, పండ్లు సమర్పించారు. మహావాద్యాలు మ్రోగుతూండగా ఆ పురుష పశువును కాళికా సమక్షంలో కూర్చోబెట్టారు. అపుడు వృషలపతి నరపశువు రక్తంలో భద్రకాళిని సంతోషపెట్టాలని భావించి కాళికామంత్రంచే అభిమంత్రితమైన ఒక భయంకర ఖడ్గాన్ని తీసికొని తన అభీష్టసిద్ధికోసం అతని తల నరకడానికి ఉద్యుక్తుడయ్యాడు. కాని ఇంతలో అనూహ్యంగా ఒక విచిత్రం జరిగింది.

పశువుగా తన సాన్నిధ్యానికి తీసికొని రాబడిన భరతుని చూచి కాళిక భయకంపిత అయింది. సర్వభూతసఖుడూ, బ్రహ్మభూతాత్ముడూ, నిర్వైరుడూ అయిన ఆ బ్రాహ్మణ పుత్రుని తేజం దుస్సహంకాగా ఆ దేవికి వృషలపతిమీద అమితమైన కోపం వచ్చింది. హుంకరించింది. వికటాట్టహాసం చేసింది. బ్రాహ్మణహింసకు పాల్పడిన క్రూరులూ, పాపాత్ములూ, రజస్తమ గుణోపేతులూ అయిన వృషలపతినీ, అతని భృత్యవర్గాన్నీ నేలకూల్చింది. వృషలాధిపతి ఖండిత శిరస్సును చేదాల్చి భద్రకాళి ఆడుతూ పాడుతూ కేళీవిహారం చేసింది.

శ్రీహరి బ్రాహ్మణుల యందుంటాడు. అంచేత బ్రాహ్మణులకు హాని చెయ్యడానికి ఉద్యమించే వాడెవడైనా వానికి చేటు తప్పదు. ఇంత జరుగుతున్నా భరతుడు మాత్రం నిర్భయంగా ఉన్నాడు. అతన్ని చంపడానికి వచ్చిన వారియందూ, ఖడ్గమందూ, కాళికయందూ అచ్యుత భావముంచి అతడు తన హృదయములో కమలాక్షుని దివ్యమంగళ మూర్తిని పాదుకొల్పుకొని ఏ విధమైన అనుమానం లేకుండా నిశ్చలంగా నిశ్చింతగా ఉన్నాడు.

ఆ సంఘటన జరిగాక భరతుడు కాశికా గృహంనుండి వెలువడి తిరిగి చేని కావలికి పూనుకున్నాడు. అలా కొన్ని సంవత్సరాలు గడచాయి. ఒక నాడు రహూగణుడను సింధుభూపాలుడు ఇక్షుమతీ తీరానఉన్న కపిలమహర్షి దగ్గర తత్వజ్ఞానం తెలిసికోవాలనే కాంక్షతో శిబికనెక్కి ఆ దారిని పోతు న్నాడు. ఆ శిబికా వాహకులు (పల్లకి మోసేవాళ్ళు) చేనికి కాపున్న విప్రుని చూచారు. అతడమాయికంగా పిచ్చివానిలాగా ఉన్నాడు. వారికి దుర్బుద్ధి పుట్టింది. అతనిచేత పల్లకి మోయిద్దామనుకున్నారు. అతణ్ణి బలవంతంగా తీసికొనివచ్చి అతని భుజంపై పల్లకి పెట్టారు.

అతడు పలుకలేదు ఉలుకలేదు. పల్లకి మోస్తూ అప్రయత్నంగా నడవడం మొదలు పెట్టాడు. పల్లకిలో కూర్చున్న సింధురాజుకు పల్లకి నడక ఎగుడు దిగుడుగా ఉండి కుదుపు కలిగించగా నతడు బోయీలతో - ఓయీ! ఏమది? మీ నడక విషమంగా ఉంది. మీ నడక నన్ను బాధపెడుతోంది — అనేసరికి బోయీలు ఇలా అన్నారు.

దేవా! ఈ ఎగుడు దిగుడు నడక మాదికాదు. ఈ నాల్గవ బోయీ కొత్తవాడు. ఇతడు మాతో కలిసి సుఖంగా అడుగు వేయలేక పోతున్నాడు. తన నడకయేమో! తానేమో!— అనగా రాజు క్రుద్ధుడయ్యాడు. అతడు వృద్ధ జనులను సేవించేవాడే. అయినా అతడు ఎందుకో కోపం వహించి ఉగ్రుడై బూడిద కమ్మిన నిప్పు కణంలాగా ఇతరులకు గోచరం కాని బ్రహ్మతేజం గల భరతునితో అనాలోచితంగా - పాపం. అలసిపోయావు. ముసలివాడవు. ఆకలిచే డస్సి ఉన్నావు. నీవెన్ను మృదువుగా, పలచగా ఉంది. ఈ శిబిక ఎంతో బరువైనది. ఇంతదూరం మోసికొని వచ్చావు. అవును ఎలా నిలబడ గలవు?— అని నిష్ఠురంగా హేళనగా అన్నాడు.

కాని విప్రుడు ఆతని మాటలను పట్టించుకోలేదు. అతడీ చరమ శరీర మందు అహంకార మమకారాలకు స్థానం ఇవ్వదలచుకోలేదు. మిథ్యాజ్ఞానాన్ని కాలదన్ని బ్రహ్మభూతుడై మౌనంగా శిబికను యథారీతిగా మోస్తున్నాడు. అతని వక్రపు నడక వలని కుదుపు సహించలేక ఆ నరేంద్రుడు కుపితుడై తిరిగి ఇలా అన్నాడు—

ఓరీ! దుర్మదుడా! జీవన్మృతుడా! నా ఆజ్ఞ తిరస్కరించి నీవు నీ యిష్టానుసారం నడుస్తావా? ఈ వక్ర మార్గాలను విడిపించి నిన్ను సన్మార్గంలో నడిపిస్తాను, చూడు— అని రాజ్యగర్వంతో కనులు మూసికొని పోయిన రాజు అబద్ధ ప్రలాపాలు పలికినా శమ దమాది గుణసంపత్తి కలిగి బ్రహ్మ స్వరూపమై సకల భూతహితుడైన బ్రాహ్మణుడు, యోగివర్తన ఏమాత్రమూ ఎఱుగని ఆ సింధురాజు నుద్దేశించి యిలా అన్నాడు—

నరేంద్రా! నీవన్నది నిజం. బరువనేది ఈ శరీరానికేగాని నాకు గాదు. బలియడం, చిక్కిపోవడం, అధివ్యాధులు, ఆకలి దప్పులు, ఇచ్ఛా విరోధ భయాలు, జరామరణాలు, నిద్రాజాగరణాలు, రోషం, మదం, అహంకారం, మమకారం—ఇవన్నీ దైహికాలు. దేహంతో వస్తాయి. కాని అవి నాకు సంక్రమించవు. జీవన్మృతుడను నేనేకాదు. ఎవడైనా అంతే. స్వామి సేవక సంబంధం విధికృతం. లోక వ్యవహారాన్ని అనుసరించి ఆ సంబంధం శరీరాలకే కాని జీవునకు లేదు. అదీకాక నీవు రాజాభిమానంతో ప్రమత్తుడవై నన్ను అజ్ఞాపిస్తున్నావంటే అది నీ వెనుకటి జన్మనుండి సంక్రమించిన గుణం. అలా నా గత జన్మనుండి వచ్చిన గుణాలు నన్నూ విడిచిపెట్టవు. పిచ్చివాడు, మూగవాడు, గ్రుడ్డివాడు, జడుడు ఎంతో నేనూ అంతే. అది నా సహజ స్వభావం. అలాంటి నాకు నీవు ఏ శిక్ష విధించినా అది నిరుపయోగం—

అని పలికి ఉపశమశీలుడైన విప్రుడు తన పూర్వజన్మకృతమైన కర్మ ఫలాన్ని అనుభవించి నశింపజేసు కునేందుకే శిబికను మోస్తూ పోతున్నాడు. రాజు తత్వజ్ఞానాపేక్షతో కపిల మునీంద్రుని దర్శించడానికి వెళ్ళుతూన్నవాడు కనుక తన హృదయ గ్రంథిని విప్పేవీ, బహుయోగ గ్రంథ సమ్మతాలూ అయిన ఆ విప్రుని వాక్యాలు విని శిబికనుండి గభాలున ఉరికి అతనికి సాష్టాంగ నమస్కారాలు చేశాడు. అతని గర్వం అణిగింది. చేతులు జోడించి ఆ విప్రున కిలా అన్నాడు—

భూసురేంద్రా! నీవెవ్వడవు? అవధూతవేషంలో ఇలా ఒంటరిగా చరించడానికి హేతువేమిటి? నన్ను కృతార్థుణ్ణి చెయ్యడానికి వచ్చిన ఆ కపిల మహర్షివి కాదుగదా! నీ మహిమ తెలియక అజ్ఞాన వశంచేత నేను చేసిన తప్పు మన్నించు. నేను యముని దండానికిగాని, శివుని శూలానికిగాని, ఇంద్రుని వజ్రాయుధానికిగాని, సూర్యచంద్రాగ్నులకు గాని, కుబేరాదుల అస్త్ర శస్త్రాలకుగాని భయపడను. ఒక విప్రునకే నేను భయపడేది.

నీవు నిస్సంగుడవై జడుడులాగా నిగూఢమైన విజ్ఞానం కలిగి చరిస్తున్నావు. నీ మాటలు యోగశాస్త్రానుగుణంగా ఉన్నాయి. వాక్కునకుగాని మనస్సునకుగాని అవి అభేద్యాలు. నేను సాక్షాత్తూ శ్రీహరియైన కపిల మహామునివలన బ్రహ్మవిద్య తెలిసికోవాలనే కోరికతో బయలుదేరాను. నీవు లోక నిరీక్షణం కోసం నిజరూపాన్ని వ్యక్తం చెయ్యకుండా ఇలా చరిస్తూన్న కపిలుడవే అయ్యుంటావు. మూఢులైన గృహస్థులకు యోగీశ్వరుల చరిత్రలు ఎలా తెలుస్తాయి?

ఈ గృహస్థాశ్రమ వ్యథ నాకే అనుకున్నాను. అది నీకూ ఉన్నదని తోస్తోంది. లేకపోతే నీకి శిబికా వాహనం ఏమిటి? ఈ లోక వ్యవహారంఅంతా

మిథ్య అని నీ వాదన. కాని అది అసత్యం కుండలేనిదే నీరు తేలేము. కుండ అనేది వేరుగాలేదు. అది మట్టితో చేయబడ్డది. కనుక మట్టి సత్యం. కుండ మిథ్య అని అంటారు. అనగా ఆ మిథ్య అనేది కూడా సత్యంలో భాగమే. కనుక ఈ లోక వ్యవహారాలన్నీ మిథ్యలైనా సత్యాలే. అంచేత నీవన్న మాటలు నాకు నమ్మతం కావు—

అని సింధు నరేంద్రుడనేసరికి ఆ విప్రుడు లోక వ్యవహారానికి నిత్యత్వం ఔపాధికం (అధారాన్ని కాంక్షించేది) కాని నిత్యంగాదని దృష్టాంత నిదర్శనంగా ఇలా అన్నాడు—

రాజా! విను. అగ్నిచే భాండం తప్తమౌతుంది. అతప్త భాండంచేత అందున్న నీరు వేడెక్కుతుంది. వేడెక్కిన ఆ నీటిలో ఉంచిన బియ్యం ఉడుకు పట్టి అన్నం అనబడు ఒక విశిష్ట పదార్థం ఉత్పన్నమౌతుంది. అలాగే దేహం, ఇంద్రియాలు, ప్రజ్ఞ అనువానిని ఆశ్రయించుకొని జీవుడుంటాడు. దేహమందు ప్రాణేంద్రియాల సమ్మేళనం వలన సృష్టి యేర్పడుతుంది. ఆ సృష్టి రక్షణ భారం వహించదగినవాడు రాజు. ఆ రాజు దుష్టకర్మలకు పాల్పడకుండా శ్రీహరి పదసేవచేస్తే అతనికి ఇక భవబంధం ఉండదు—

అని ఆ భూసుర మౌళి పలికేసరికి సింధుపతి అతణ్ణి వినుతించి యిలా అన్నాడు - నేను రాజునను దురభిమానంతో మదాంధుడనై నిన్ను తూలనాడాను. నన్ను కరుణించు. నీవు ఆర్త బంధుడవు. నీ కృపాదృష్టి వలన, మహాత్ములను అవమానం చేసిన నాకు పాప విముక్తి కలుగుతుంది. విశ్వ శ్రేయస్సు కోరే నీకు క్రోధం ఉండదు. అసమర్థులయి మావంటివారు మహాజనావమానంచేత తమ వినాశాన్ని తామే తెచ్చిపెట్టుకుంటారు. కనుక దయాళుడవై నన్ను మన్నించు-మని ప్రార్థించగా ఆ విప్రుడిలా అన్నాడు—

రాజా! నీవో వింత మనిషిలాగా ఉన్నావు. అన్ని విషయాలు తెలిసిన విద్వాంసుడవైయుండికూడ్నీ ఏమీ తెలియని వానిలాగా మాట్లాడుతున్నావు. అది నీకు వేడుకా! అయినా నీ యీ లక్షణాలను బట్టి నిన్ను పురుష శ్రేష్ఠునిగా భావించవచ్చు. పెద్దలెవ్వరూ ఈ ప్రపంచం తథ్యమని అంగీకరింపరు. నీవు మాత్రం తథ్యం అంటున్నావు. ఈ విషయంలో నేను నీతో ఏకీభవించను.

యజ్ఞకర్మల్లోనూ, వేదాల్లోనూ పరబ్రహ్మ తత్వం కనుపించదు. స్వప్నంలో సౌఖ్యానుభూతి కలుగుతుంది. ఆ సౌఖ్యానికి అకారంకూడా ఉంటుంది. అది కలలో సత్యంగా గోచరిస్తుంది. కాని మెలకువరాగానే అది అసత్యమని తోస్తుంది. అలాగే వేదాంత వాక్యాలు తత్వావబోధనకు మాత్రమే తోడ్పడతాయి. అవికూడా నిత్యాలు కావు. పురుషుని మనస్సు

రజస్సత్త్వతమో గుణాలతోగూడి యెంతకాలం వుంటుందో అంతకాలం కర్మేంద్రియాలకు వశంగతుడై పురుషుడు ధర్మాలను అధర్మాలుగా భావిస్తాడు.

మనస్సు ధర్మాధర్మవాసనాయుక్తం. విషయాను రక్తం. అది గుణ త్రయ ప్రభావంచేత వికాసం చెంది దేవతలు, తిర్యక్కులు, మనుష్యులు మొదలైన దేహోత్పత్తి చేస్తూ ఎప్పుడే సుఖదుఃఖాలు ప్రాప్తిస్తే వాటిని అనుభ విస్తుంది. జీవునకెప్పుడూ స్థూల సూక్ష్మ రూపాల్లో సుఖదుఃఖానుభవాలు గుణాలను బట్టి కలుగుతూ ఉంటాయి. మనస్సు గుణ విరహితమైనప్పుడే మోక్షం లభించేది.

నేతియందు వత్తినుంచి వెలిగిస్తే పొగతోగూడిన మంటవస్తుంది. ఆ నెయ్యి, వత్తి నశిస్తే ఆ పొగా, మంటాపోయి అగ్ని నిజ స్థితిని పొందుతుంది. అలాగే మనస్సు జన్మాంతరాలను కల్పించెడి గుణ కర్మాను బంధాన్ని విడిచి పెడితే, తానే పరబ్రహ్మంగా నిలుస్తుంది. జ్ఞానేంద్రియాలైదూ, ఇంద్రియార్థ గతాలైన ప్రజ్ఞలు అయిదూ, వానియందు అభిమానం, ఈ పదనొకండు మనస్సుకు ఏర్పడే వృత్తులు. ఈ వృత్తులతో గూడినప్పుడు మనస్సు అసం ఖ్యాకాలైన జన్మలను కల్పిస్తుంది. మనస్సును, వృత్తులను అతిక్రమించిన జీవుడే పరంజ్యోతియైన నారాయణ స్వరూపం.

స్థావరజంగమాలైన జీవులకు వాయువు ప్రాణం. అలాగే సర్వ భూతాంతర్యామి యైన ఈశ్వరుడు జీవాత్మ స్వరూపంతో ఉంటాడు. జీవాత్మ జ్ఞానోదయం వలన ఎంతకాలం మాయను జయించదో అంతకాలం ముక్త సంగుడు కాడు. అరిషడ్వర్గాన్ని నిర్జించి, పరతత్వాన్ని తెలుసుకుంటే ఈశ్వరుడౌతాడు. మనస్సు ఎంతకాలం ఇంద్రియాలకు వశంగతమై ఉంటుందో అంతవఱకు అది సంసార చక్రంలోపడి తిరుగుతూనే ఉంటుంది. కనుక ఎంతటివాడైనా తనకు విరోధియైన మనస్సును అప్రమత్తుడై స్వేచ్ఛగా విహ రించనీయక పరమ గురువైన శ్రీహరి చరణోపాసన యనెడి అస్త్రం చేత మనస్సును జయిస్తే పరతత్వం ప్రాప్తిస్తుంది—అని విప్రుడు పలికేసరికి అతని మహిమకు ఆశ్చర్యపడి రాజేంద్రుడిలా అన్నాడు.

విప్రేంద్రా! కారణ జన్మమైన నీ యీ శరీరం, నీ యీ అవధూత వేషం, బ్రాహ్మణత్వం, ఆత్మభావం, శాంతగుణం, గూఢవర్తనం ఎవరికైనా నమస్కరింపదగ్గవి. నీ కిదే నా ప్రాంజలి. జ్వరార్తుడైన రోగికి ఔషధం ఇష్టం. ఎండగొట్టిన వానికి శీతలోదకం ఇష్టం. అలాగే అహంకారమనెడి సర్పంచేత కాటువేయబడిన నాకు నీ వాగమృతంకంటె వేఱే మందు

ఏముంది? ఆ కారణంచేత మహాత్మా! నిన్నడిగి నా సంశయాలన్నీ తీర్చుకోవాలని కుతూహల పడుతున్నాను. కనుక నాకు తత్వయోగం తెలియజెయ్యి— అని రాజు అర్థించేసరికి విప్రుడిలా చెప్పడం మొదలు పెట్టాడు—

నరేంద్రా! విను. ఈ భూమిపై పాదాలున్నాయి. వానిపై పిక్కలు, ఆపైన క్రమంగా మోకాళ్ళు, తొడలు, నడుము, బొమ్మ, కంఠం, భుజం ఉన్నాయి. ఆ భుజంపై పల్లకి బొంగు ఉంది. ఆ పల్లకిలో రాజేంద్రుడనని దురభిమానం గల నీ వున్నావు. కనుక నిన్నే అత్యధికుడవని భావించాలా? అలా భావించడం అవ్యక్తం. కాని నీకు మాత్రం "నే నరేంద్రుడను. అందరికంటె అధికుడను" అని గర్వం ఉంది. అంచేతనే నీకు మహాత్ముల సభల్లో పూజ్యత్వంలేదు.

స్థావరజంగమాలకు నివాసస్థానం భూమి. ఇక జగత్కారణమైన తత్వాన్ని చెబుతాను విను. అది సులభసాధ్యం కాదు. సత్క్రియాచరణం వల్ల అది బోధపడుతుంది. పరమాణులు కలిసి భూమి అయింది. అలాగే అవిద్య, మనస్సు అను రెండింటి కలయికచే జగత్తు పుట్టింది. ఈ కల్పిత జగత్తులో క్రమంగా ఎన్నో విభేదాలు, ఎన్నో విధాలైన స్వభావ స్వరూపాలతో విభిన్నంగా కనబడుతుంది బాహ్యాభ్యంతరాలు కలిగి స్వప్రకాశమై భగవచ్ఛబ్ద వాచ్యమును, విశుద్ధమును, పరమార్థమును జ్ఞాన రూపమునూ అయిన బ్రహ్మమొకటే సత్యం. దృశ్యమానమైన ఈ జగత్తంతా అసత్యం అయితే ఆ బ్రహ్మాన్ని పొందడం ఎలా?

తపోదానాలచేతగాని, గృహధర్మాలచేతగాని, వేదాలచేతగాని అది సాధ్యంకాదు. జలాగ్ని చంద్ర సూర్యులచేత కూడ అది అసంభవం. భాగవతుల పాదసేవ ఒక్కటే బ్రహ్మమును పొందడానికి సులభతరమైన మార్గం తపస్సు కాక ఇతర సౌఖ్యాలకు విముఖులైన పుణ్యాత్ములు నిరంతర హరినామస్మరణంచే మనోనందం చెందుతూ విబుధుల పాదసేవచేస్తే మోక్ష మార్గమందునూ, శ్రీహరి యందునూ, నిశ్చలబుద్ధి కలుగుతుంది.

నరేంద్రా! నేను భరతుడను ధాత్రీపతిని. సర్వసంగ పరిత్యాగంచేసి భగవదారాధన చేస్తూ కారణాంతరంచేత ఒక లేడిపిల్లపై మమకారం పెంచుకొని లేడిగా జన్మించాను. కాని ఆ మృగ జన్మంలోకూడా హరిభక్తిని విడువని హేతువు చేత తిరిగి ఇప్పుడు మనుష్యుడనయ్యాను. అయినా మనుష్యులతో ఎలాంటి సంబంధం పెట్టుకోకుండా ఒంటరిగా చరిస్తున్నాను. మానవుడు పరలోకం పొందాలంటే వృద్ధజనులను సేవించాలి. సంసారమోహం వదలిపెట్టాలి. శ్రీహరిని ధ్యానిస్తూ కీర్తిస్తూ పూజిస్తూ జ్ఞానం గడించాలి—అని భరతుడింకా ఇలా అన్నాడు.

రాజా! విను. జీవుడు మాయలో చిక్కి ఫలాపేక్షతో లాభమాశించి తిరిగెడి వ్యాపారి లాగా సంసారమనెడి అడవిలో తిరుగుతాడు. ఆ అడవిలో కామక్రోధాదులను దొంగలుంటారు. ఇంద్రియ నిగ్రహం లేని నరుని పట్టుకొని ఆ దొంగలు అతని దగ్గర ఉన్న ధర్మమనెడి ధనాన్ని అపహరించుకు పోతారు. కనుక సంసారమందు ఆకాంక్ష తగదు. సంసారాటవిలో దార సుతాదులు, మిత్రులు అనెడి తోడేళ్ళు నరులనెడి మేకపోతులను పట్టుకొని తినేస్తాయి.

సంసారమనెడి భయంకరారణ్యంలో ఇండ్లచుట్టూ లతాతరు గుల్మాదులచే దుర్గమాలైన పొదరిండ్లయందు దుర్జనులను కందిరీగలుంటాయి. వాటి వలన బాధ ఇంతా అంతా కాదు. గృహస్థాశ్రమంలో ఇంద్రియ సుఖాలకు వశుడై మానవుడు విశ్వాన్ని గంధర్వనగరం (మాయా కల్పితమైనది) గా భావించి ఆనందిస్తాడు. కొఱవిదయ్యాన్ని చూచి అక్కడ అగ్ని దొరుకుతుందని భ్రాంతిపడి దాని వెంటపడితే వృథా శ్రమ తప్పితే ప్రయోజనం ఏమీ ఉండదు. అలాగే కొందఱు ధనాకాంక్షతో ధనవంతుల పంచలను బడి తిరుగుతూ తుదకు ఆశోపహతులవుతారు.

సుడిగాలికి రేగిన దుమ్ముకణాలు కళ్ళల్లోపడి చూపును పోగొట్టుకున్నవాడు దిక్కుతోచక ఒకచోటికి వెళ్ళదలచి మఱోచోటుకు పోవునట్లు మదాంధుడైన నరుడు గమ్యమనేది లేక ఊరికే తిరుగుతూ ఉంటాడు. సంసారాటవిలో అలా తిరిగెడివాడు పడే పాట్లు అన్నీ ఇన్నీ కాదు.

ఒకచోట చెవులు బ్రద్దలయ్యేలాగా గుడ్లగూబలు, ఈల పురుగులు కావించెడి దారుణ ధ్వనులవంటి శత్రురాజ తిరస్కారాలకు దుఃఖపడతాడు. ఒకచోట ఆకలిగొని పిచ్చిచెట్ల ఫలాలను ఆశించినట్లు పాపులూ, ధనహీనులూ అయిన వారిని ఆశ్రయించి నిర్వేదం చెందుతాడు. ఒక్కయెడ దప్పిక గొని నిర్జలమైన నదిని వెదుకుతూ పోయినట్లు ఇహపర దూరులైన పాషండులను సేవించి పరితపించాడు. మఱొకచోట అగ్నితప్తుడైన వాడు దావాగ్నిని సమీపించి మఱింత సంతాపం చెందునట్లు అన్నార్థియై దాయాదుల దగ్గఱకు పోయి వారిచేత తిరస్కృతుడై మఱింత బాధపడతాడు.

ఒకప్పుడు కన్నుగానక రాజ్యకాంక్షతో ఆత్మీయులైన వారిని వధించి కొంతకాలానికి తనకంటె బలవంతులైన శత్రురాజులచే నిర్జితుడై సర్వసంపదను కోల్పోయి శోకపరవశుడౌతాడు... ఒకప్పుడు గంధర్వ నగరంలాగా మాయా కలితమూ, అస్థిరమూ అయిన సంసారసుఖం అనుభవించి సంతోషంలో పరవశించిపోతాడు. 'పర్వతారోహణం చేసేవాడు ముళ్ళతోను,

రాళ్ళతోను బాధపడుతూ ముందుకు సాగలేక వ్యధచెందునట్లు, గృహా శ్రమో చితాలైన యజ్ఞ యాగాది మహానుష్ఠానాలకు ఉద్యమించి వ్యసనాలనెడి కంటక పాషాణాలచే పీడితుడై వాటిని అవిఘ్నంగా పరిసమాప్తి చెయ్యలేడు. ఒక్కొక్కప్పుడు జఠరాగ్నిచే పీడితుడై ఏమీ చేయలేక కుటుంబసభ్యుల మీద క్రోధంతో విరుచుకు పడతాడు. కొండచిలువ నోటిలో పడిన వానిలాగా ఒక్కొక్కవేళ రాత్రులందు గృహాటవిలో నిద్రతో నష్టుడై యుంటాడు.

మరొకప్పుడు అడవిలో తృణచ్ఛన్నమైన కూపంలో పడి సర్పదష్టుడైనట్లు సంసారకూపంలో పడి దుష్టులచేత వ్యధితహృదయుడౌతాడు. అందుడై అజ్ఞానాంధకారంలో పడి దిక్కుతోచకుండా ఉంటాడు. ఒక్కొక్కప్పుడు జుంటితేనె కోసం వెళ్ళి తేనెటీగలు చుట్టూ మూగి కుట్టితే వ్యథితుడైనట్లు పరదార ద్రవ్యాలను కాంక్షించి గృహపతులచేతనో భూపతులచేతనో తన్నులు తింటాడు. యౌవనంలో శీతవాతా తపాది ప్రయాసలు సహించి సంపాదించిన ధనాన్ని వార్ధక్యంలో ఉపయోగపడుతుందనే ఊహతో పరుల - చేతుల్లో పెడితే అది తిరిగిరాదు. అపుడెంతో చింతాక్రాంతుడౌతాడు.

అడవిలో బోయలు స్వల్పమైన మాంసం కోసం పరస్పర వైషమ్యంతో కలహించునట్లు అల్పద్రవ్యంలో లేనిపోని వ్యవహారాన్ని సృష్టించి పోరాడ డానికి సంసిద్ధుడౌతాడు కొద్దిపాటి ధనం సంపాదించుకున్నవాడు తనకున్న ఇల్లూ వాకిలితో తృప్తిపడక పరధనాన్ని కాంక్షించి వారియిద్దకుపోయి పరిభవింపబడతాడు మరికొందరు ఒకరికొకరు ఇచ్చిపుచ్చుకుంటూ ఏదో తగులుపడి ఆత్మచింత లేకుండా అలమటిస్తారు. సంసారమార్గంలో ఎంతో శ్రమించి సంపాదించిన ధనంతో ఐహిక సుఖా లనుభవించాలనుకుంటాడు. మోక్షచింత చెయ్యడు. ఇంతలో అనుకోకుండా మృత్యువాత పడతాడు. అభిమానవంతులు, శూరులు అయినవారు వైరంతో యుద్ధరంగంలో ప్రాణాలు విడుస్తారు కాని మూర్ఖత్వంతో మోక్షమార్గం చూడరు.

ఒకరు కాలచక్ర నియంత్రితుడైన శ్రీహరిని సేవింపక కాకులు, గ్రద్దలు, కొంగల్లాంటి పాషండుల చేతుల్లో పడి వంచింపబడతాడు. బ్రాహ్మణ కులంలో పుట్టి శ్రౌతస్మార్త కర్మలు ఆచరిస్తూ కూడా మధ్యలో విషయ సుఖాల్లో తగుల్కొని ఎన్నటికైనా మృత్యువు తప్పదని గ్రహింపక చెట్టు లాగా పెరిగి దారసుతాదులయందే ప్రాణాలు నిలుపుకుని ఉంటాడు. ఏనుగును చూచి భయపడి పారిపోతూ లోతైన బావిలో పడినట్లు మృత్యువనెడి ఏనుగు నకు వెఱచి కొండగుహలాంటి అజ్ఞానాంధకూపంలో పడతాడు. కనుక రాజా! నీవు మాయాకల్పితమైన సంసారమార్గంబగు రాజభావం విడిచి సర్వభూత మైత్రి కలిగి జితేంద్రియుడవై జ్ఞానఖడ్గం చేదాల్చి సురక్షితంగా నీవు సీ

గమ్యస్థానం చేరుకో — అని పలికిన విప్రునకు సింధురాజేంద్రుడైన రహూగణుడిలా అన్నాడు—

మానుషజన్మం గొప్పది.. ఎప్పుడు? మహాయోగుల సాంగత్యం లభించినప్పుడే. లేకపోతే అది నిరర్థకమే. విప్రేంద్రా! నీ పాదాంబుజ రేణు సంస్పర్శం చేత నా పాపాలన్నీ తొలగిపోయాయి. నాకు పరిపూర్ణమైన హరిభక్తి కలిగింది. విప్రవరులందు యోగీశ్వరులు అవధూత వేషంలో తిరుగుతూ ఉంటారు. వారికి వయస్సుతో పనిలేదు. అంచేత పిన్న పెద్దలనక విప్రులందరికి నా నమస్కారం— అని సన్నుతించగా యోగీశ్వరుడైన భరతుడు కరుణార్ద్ర చిత్తుడై సింధుపతికి తత్వజ్ఞానం ఉపదేశించాడు. సింధుపతి మహానందంతో ఆ యోగీంద్రునకు పాదాభివందనం చేశాడు. భరతుడు సింధునముద్రంలాగా కరుణారసపూర పూరితమైన మనస్సుతో యథాప్రకారం తిరిగి లోకసంచారం సాగించాడు. సింధురాజు కూడా సజ్జన సమాగం వలన తత్వజ్ఞాన మార్జించి దేహాత్మభ్రాంతిని విడిచిపెట్టాడు.

భరతుని చరిత్ర వర్ణనాతీతం. ఈగ ఎంత ఎగిరినా గరుత్మంతుని చేరలేదు. అలాగే భరతుని ఎంత స్తుతించినా అతని చరిత్రను సాకల్యంగా చెప్పలేరు. అతడు ఎన్నడో దార సుతాదులను, రాజ్యాన్నీ విడిచిపెట్టి భగవత్పరుడై యజ్ఞరూపంగా, ధర్మరూపంగా జ్ఞానమూర్తిగా ప్రకృతి పురుష స్వరూపంగా నారాయణుని దర్శించి నమస్కరించాడు. అంచేతనే అతడు మృగరూపాన్ని విడిచి తిరిగి మానుషజన్మం ఎత్తాడు. అలాంటి భరతుని కథ ఎవరు చెప్పినా విన్నా వారిని శ్రీవిష్ణువు రక్షిస్తాడు. ధనధాన్య సమృద్ధీ, ఆయుర్వృద్ధీ కలిగి వారు స్వర్గోపభోగాలు పొందుతారు.'

## భరతుని వంశం

శుక మహర్షి పరీక్షిన్నరేంద్రునకు భరతుని చరిత్ర చెప్పాక అతని వంశాన్ని గురించి యిలా చెప్పాడు- 'రాజేంద్రా! భరతుడు రాజ్యం విడిచి దేశాటనం చేస్తూండగా అతని కొడుకు సుమతి ధర్మబద్ధంగా రాజ్యపాలనం చేస్తున్నాడు. దుష్టులైన పాషండులది తెలిసికొని ఎలాగైనా అతన్ని వంచించి అక్కడ పాషండ మతం స్థాపించాలనే ఊహతో అతణ్ణి సమీపించి- రాజా! నీవు మామతం స్వీకరించు. నిన్ను బుద్ధదేవుని కొలిచినట్లు కొలుస్తాం- అన్నారు కాని అతడుమాత్రం నిర్లిప్తంగా ఉండి వారికేమీ సమాధానం చెప్పలేదు.

సుమతి భార్య ధ్రువసేన. అతనికి ఆమెయందు 'దేవజిత్తు' అను కొడుకు జన్మించాడు. ఆ దేవజిత్తునకు ఆసురి యను నామె వలన దేవద్యుమ్నుడు పుట్టాడు. అతనికి ధేనుమతి యందు పరమేష్ఠి జనించాడు. అతనికి

సువర్చలయందు ప్రతీహుడను కొడుకు కలిగాడు. ప్రతీహుడు పరమ పురుషుడు. అందరికీ బ్రహ్మోపదేశం చేసి పరిశుద్ధాత్ముడై హరిభక్తుడయ్యాడు. అతనికి యజ్ఞకరణ నిపుణులైన ప్రతిహర్త, ప్రస్తోత, ఉద్గాత అను ముగ్గురు కొడుకులు పుట్టారు. ప్రతిహర్తకు స్తుతియను నామె యందు వ్యోమ భూములను ఇద్దరు తనయులు జనించారు. భూమునకు ఋషికుల్యయందు ఉదీథుడను సుతుడుద్భవించాడు. అతనికి భారతియందు పృథుషేణుడూ, ఆ పృథుషేణునకు ఆకూతియందు నక్తుడు ఉదయించారు. ఆ నక్తునకు రాజశ్రేష్ఠుడైన గయుడను కీర్తి సంపన్నుడు పుట్టాడు.

శ్రీహరియే జీవకోటిని రక్షించాలనే ఊహతో నిజాంశంలో సత్వ ప్రధానమైన శరీరం దాల్చి గయుడుగా అవతరించాడని ప్రతీతి ఆటువంటి మహనీయ గుణాకరుడైన గయుని గాథా వర్ణనం నేను పురాణ విదులైన మహాత్ములవలన వినిన రీతిలో చెప్తతాను విను.

గయుడు సాక్షాచ్ఛ్రీ విష్ణువు. మానవ మాత్రుడు కాడు. అతడు ప్రజలను వేయికళ్ళతో కనుపెట్టుకొని కన్నబిడ్డలవలె లాలిస్తూ శాసిస్తూ ధర్మ మార్గంతో రాజ్యపాలనం చేశాడు. యజ్ఞాల్లో యజ్ఞ పురుషుడైన ఈశ్వరుణ్ణి మనస్సునందు సేవించాడు. అఖిల జీవకోటికి ఆనందం కలిగిస్తూ స్వాభిమానం లేకుండా భూమండలాన్ని ఏలాడు. అతడు సత్యనిరతుడు. ధర్మపరుడు. సాధుసేవయందు ఆసక్తిగల సహృదయుడు.

అలాంటి మహాపురుషుడూ, గుణగరిష్ఠుడూ అయిన గయునకు దక్షకన్యకలైన శ్రద్ధ, మైత్రి, దయ-మొదలగువారు తమంతట వచ్చి అతని మనోరథాలను తీరుస్తారు. వసుంధర కామధేనువై - అతని ప్రజలకు సంపదలను పిండుతుంది వేదాలు వారి కోర్కెల్నన్నింటినీ తీరుస్తాయి. యుద్ధంలో పరాజితులైన రాజులు కానుకలు అర్పిస్తారు. బ్రాహ్మణులు ధర్మంలో ఆరవపాలు పంచియిస్తారు. నిరంతరం సోమరసం అర్పిస్తూ శ్రద్ధతో, భక్తితో అతడాచరించు యజ్ఞాలతో ఇంద్రాది దేవతలు తృప్తులై అతనికి యజ్ఞ ఫలం ఇస్తారు. అతడు బ్రహ్మ మొదలు తృణగుల్మలతా పర్యంతం సమస్త జీవరాసులను సంతృప్తి పరుస్తూ శ్రీహరిని సంతృప్తి పరచినట్లే భావించి ఆనందిస్తాడు.

గయుడు ఆ రీతిగా చాలాకాలం రాజ్యం చేశాడు. అతని భార్య జయంతి. వారికి చిత్రరథుడు, స్వాతి, అవరోధనుడు అను ముగ్గురు కొడుకులు పుట్టారు. చిత్రరథునకు ఊర్ణయందు సమ్రాట్టును, వానికి ఉత్కళయందు మరీచియు, అతనికి బిందుమతియందు బిందుమంతుండును పుట్టారు. ఆ బిందుమంతునకు సరఘయను నామెవలన మధువును, మధువునకు సుమనస

వల వీరవ్రతుడును, ఆ వీరవ్రతునకు భోజయందు మన్యువు, ప్రమన్యువు అను ఇరువురును, వారిలో మన్యువునకు సత్యయందు భువనుడును, అతనికి దోష యందుత్వష్టయు, ఆ త్వష్టకు విరోచనయను నామెవలన విరజుడును పుట్టారు.

ఆ విరజునకు విషూచి యందు నూర్గురు కొడుకులు పుట్టారు. వారు మహావీరులు, శత్రురాజులందఱినీ జయించారు. వారికి ఒక తోడ బుట్టువు కూడా ఉంది. ఇంద్రానుజుడైన విష్ణువు లాంటివాడైన విరజుడు ప్రియవ్రతుని వంశంలో కడపటివాడు-' అని చెప్పిన శుకునకు పరీక్షిత్తు ఈ రీతిగా అన్నాడు.

'మునీంద్రా! సూర్యరశ్మి యెందాకా వ్యాపిస్తుందో నక్షత్రాలతో గూడిన చంద్రకిరణాలు ఎందాకా ప్రసరిస్తాయో అంత దూరమూ ప్రియవ్రతుని రథ నేమి ఘట్టనలచేత సప్తద్వీపాలూ, సప్త సముద్రాలూ ఏర్పడ్డాయని చెప్పావు. ఆ ద్వీపసముద్రాల పరిమాణాలు తెలిసికోవాలని కుతూహల పడుతున్నాను. గుణమయమూ, స్థూలరూపమూ, అయిన శ్రీహరి శరీరమే కదా ఈలోకం. దీనియందు సక్తమైన చిత్తం అగుణమూ, సూక్ష్మమూ, ఆత్మజ్యోతీ, పర బ్రహ్మమూ అయిన వాసుదేవుని యందుకూడ నిలుస్తుంది. కనుక ద్వీప వర్షాది విస్తారాన్ని వివరించి చెప్పు-' అనేసరికి శుకయోగి ఇలా అన్నాడు.

'రాజేంద్రా! ఈ సముద్రాలు, ద్వీపాలు, వర్షాలు శ్రీహరి మాయగుణ విభూతులు. వీటి పరిమాణాలు తెలిసికొనడం ఎవరి తరమూ కాదు. నాకు మాత్రం ఎలా తెలుస్తుందీ? అయినా నాకు తెలిసినంతవరకు సంక్షిప్తంగా చెపుతాను. విను-' అని శుకమహర్షి యిలా చెప్పడం మొదలుపెట్టాడు.

## భూగోళ స్వరూపాదికం

'రాజేంద్రా! విను. జంబూద్వీపం భూ పద్మానికి మధ్య ప్రదేశంలో ఉంది. అది లక్ష యోజనాల వెడల్పు, అంతే పొడవు కలిగి తామరాకులాగా గుండ్రంగా ఉంటుంది. ఆ జంబూద్వీపంలో ఒకొక్కటి తొమ్మిదివేల యోజ నాల విస్తృతి గల నవ వర్షాలున్నాయి. ఆ వర్షాలను విభజిస్తూ వాటికి సరి హద్దులుగా ఎనిమిది పర్వతాలు* ఉన్నాయి. నవ వర్షాల్లో నట్టనడుమగల వర్షానికి ఇళావృత వర్షమని పేరు. దాని నడుమ సువర్ణమయమైన మేరు పర్వతం ఉంది. అది భూపద్మానికి దుద్దులాగా ఉంటుంది. అది కుల పర్వతాలకు అధిపతి.

---

* నీలం, శ్వేతం, శృంగవత్తం, నిషధం, హేమకూటం, హిమాలయం' మాల్యవంతం, గంధమాదనం- ఇవి ఆ పర్వతాల పేర్లు.

ఈ మేరు పర్వతం యెత్తు లక్షయోజనాలు. దాని నడిమిదళం పది యాఱువేల యోజనాల ఎత్తూ, అంతే లోతూ కలిగి ఉంటుంది. దాని ఉపరి తలం ముప్పది రెండువేల యోజనాల వైశాల్యం కలిగి ఉంటుంది. దానికి ఉత్తరోత్తరాన క్రమంగా నీలం, శ్వేతం, శృంగవంతం అను మూడు పర్వతాలున్నాయి. రమ్యకం, హిరణ్మయం, కురువు అను వర్షాలకు అవి సరిహద్దు కొండలుగా ఉంటాయి. అవి తూర్పునకు దీర్ఘంగా వ్యాపించి ఉంటాయి. రెండువేల యోజనాల విస్తీర్ణంగల ఆ పర్వతాలు పూర్వ పశ్చిమములందు ఉప్పుసముద్రాన్ని అంటి ఉంటాయి. వానిలో మొదట దానికంటె ఉత్తరమున నుండు పర్వతం యొక్క నిడివి పదునొకండవ వంతు తగ్గి ఉంటుంది.

అలాగే ఇలావృతానికి దక్షిణాన నిషధం, హేమకూటం, హిమాలయం అనబడే పర్వతాలున్నాయి. అవి తూర్పునకు దీర్ఘంగా వ్యాపించి నీలాదులతో సమానపరిమాణం కలిగి ఉంటాయి. అవి క్రమంగా హరివర్షం, కింపురుష వర్షం, భారతవర్షం అను వర్షాలకు ఎల్లలుగా ఉంటాయి.

అదేరీతిగా ఇలావృతానికి తూర్పున గంధమాదనం, పడమర మాల్యవంతం రెండువేల యోజనాల నిడివికలిగి నీలనిషధ పర్వతాలదాకా వ్యాపించి ఉంటాయి. అవి భద్రాశ్వవర్షానికి, కేతుమాల వర్షానికి సీమాపర్వతాలు. మేరువునకు నలుగడలా మందరం, మేరుమందరం, సుపార్శ్వం, కుముదం అని నాలుగు పర్వతాలున్నాయి. వాటి నిడివి పదివేల యోజనాలు. మందరం మేరువునకు తూర్పున, మేరుమందరం దక్షిణాన, సుపార్శ్వం పడమరవైపున, కుముదం ఉత్తరాన ఉంటాయి.

ఆ పర్వతాలపైన క్రమంగా మామిడిచెట్టు, నేరెడుచెట్టు, కడిమిచెట్టు, మఱ్ఱిచెట్టు ఉన్నాయి. అవి ఒక్కొక్కటి పదునొకొండువేల యోజనాల ఎత్తుంటాయి. వాటి కొమ్మలు నూఱు యోజనాల వఱకు వ్యాపించి ఉంటాయి. ఆ నాలుగు కొండలమీద నాలుగు హ్రదాలు (మడుగులు) ఉన్నాయి. అవి పాలతో, తేనెతో, చెఱకురసంతో. స్వచ్ఛజలంతో నిండి ఉంటాయి. స్నానపానాదులతో ఆ మడుగుల సేవించే గంధర్వగణాలకు అణిమాదులగు అష్టసిద్ధులూ లభిస్తాయి.

ఆ గిరులందు- నందనం, చైత్రరథం, వైభ్రాజం, విశ్వతోభద్రం-అను నాలుగు దివ్యోద్యానాలున్నాయి. ఆ వనాల్లో దేవతలు దేవాంగనలతో గూడి గంధర్వుల గీతనృత్యాలకు ఆనందిస్తూ విహరిస్తారు. మందరపర్వత శిఖరాగ్ర

---

ఇలావృతం, రమ్యకం, హిరణ్మయం, కురువు హరివర్షం, కింపురుషం, భారతం, భద్రాశ్వం, కేతుమాలం— ఇవి జంబూద్వీపాంతర్గతాలైన నవ వర్షాలు.

మందుగల మామిడిచెట్టు యొక్క పండ్లు అమృతోపమానంగా ఉంటాయి. అవి నగశృంగాలంతేసి ఉంటాయి. అవి మాగి కొండమీదపడి పగలగా వాటి నుండి స్రవించే రసం నదిగా ప్రవహిస్తుంది. ఆ నదికి 'అరుణోద' అని పేరు. మాధుర్యం, సౌగంధ్యం, అరుణకాంతి కలిగియుండడంచే దానికి ఆ పేరు వచ్చింది. అది మందరపర్వతపార్శ్వముల నుండి క్రిందికి జాఱి ఇలావృతంలో పూర్వవాహినియై ప్రవహిస్తూ అందఱినీ తనియింపచేస్తుంది.

ఆ అరుణోదలో జలక్రీడలాడెడి పార్వతీదేవి చెలికత్తెల అవయవాలను స్పృశించి వీచెడివాయువు చుట్టూ పదియోజనాలు ఆ పరిమళాన్ని వ్యాపింప జేస్తుంది. మేరుమందర శిఖరానగల జంబూఫలాలు ఏనుగులంతేసి ఉంటాయి.అవి పండి రాలి శిథిలంకాగా వాటినుండి స్రవించిన రసం నదియై ప్రవహిస్తుంది. ఆ ప్రవాహమే జంబూనది. అది ఇలావృతవర్ష దక్షిణభాగాన్ని తడుపుతుంది. అది అలా ప్రవహిస్తున్నప్పుడు అచటి మట్టి ఆ నదీజలంతో కలిసి వాయ్వగ్ని సంయోగంవలన విపాకంపొంది సువర్ణమౌతుంది. అంచేతనే సువర్ణానికి జాంబూనదం అని పేరు కలిగి దేవతలకు భూషణార్హమై వన్నె కెక్కింది.

సుపార్శ్వనగ శృంగానగల కడిమిచెట్టు తొఱ్ఱలనుండి అయిదు నంది శృంత లావుగల అయిదు మధుధారలు ఆ పర్వతశిఖరంనుండి జాఱి ఇలావృత పశ్చిమభాగాన్ని తడుపుతూ ప్రవహిస్తాయి. ఆ మధుధారలు గ్రోలినవారి ముఖమారుత గంధం శతయోజన పర్యంతం పరిమళిస్తుంది.

మేరుపర్వతానికి ఉత్తరమున కుముదనగ శిఖరాగ్రానగల వటతరు స్కంధంనుండి పాలు, పెరుగు, తేనె, బెల్లం, ఇతర ఆహారద్రవ్యాలు వెలువడి ఇలావృతంలో వసించేవారికి సంతృప్తి కల్పించడమేకాక శయ్యాసనాది వస్తువు లందించి వారికోర్కెలు తీరుస్తాయి. ఆ మధుదధిక్షీరాదులను సేవించెడివారికి శరీరం ముడుతలుపడదు. దుర్గంధం ఉండదు. ముదిమిదరిచేరదు. తల నెరయదు. మరణభయం ఉండదు. దేవదానవులు గంధర్వులు ఆ పర్వతపాదాన్ని ఆశ్రయించుకొని అక్కడే విహరిస్తూ ఉంటారు.

భూమి అనే కమలానికి కర్ణిక (దుద్దు) లాంటి మేరుగిరిచుట్టూ, కురంగం, కురరం, కుసుంభం, వైకంతకం, త్రికూటం, శిశిరం, పతంగం, రుచకం, నిషధం, శితివాసం, కపిలం, శంఖం మొదలైన పర్వతాలు కేసరాల్లాగా గోచరిస్తాయి. ఆ మేరునగానికి తూర్పున జఠరదేవకూటాలనే కొండలు, పడమట పవనపారియాత్రాలనే పర్వతాలు ఉన్నాయి. ఆ నాలుగు పర్వతాల్లో ఒక్కొక్కదానికి దక్షిణంనుండి ఉత్తరానికి పదునెనిమిదివేల యోజనాల పొడవు, తూర్పునుండి పడమరకు రెండువేల యోజనాల వెడల్పు ఉంటుంది.

దానికి వెలుపలి ఆవరణలో దక్షిణాన కైలాసం, కరవీరం, అను పర్వతాలు ఉత్తరాన త్రిశృంగం మకరాద్రి అను పర్వతాలు ఉన్నాయి. ఇవి ఒక్కొక్కటి తూర్పునుండి పడమరకు పదునెనిమిది యోజనాల పొడవు, దక్షిణంనుండి, ఉత్తరానికి రెండువేల యోజనాల వెడల్పుకలిగి ఉంటాయి. ఇలా ఈ ఎనిమిది పర్వతాలచేతను పరివృతమైన మేరుపర్వతం దర్భలచే పరివృతమైన అగ్ని హోత్రునిలాగా ప్రకాశిస్తూ ఉంటుంది. మేరుశిఖరాన దశ సహస్రయోజనాల నిడుపు, అంతే విస్తృతికలిగి సువర్ణమయమైన చతుర్ముఖుని పురం ఉంది. ఆ నగరాన ఎనిమిదిదిక్కులయందూ లోకపాలకులపురా* లున్నాయి.

పూర్వం శ్రీహరి వామనావతారంలో తన మూడుపాదాలతో ముల్లోకాలను ఆక్రమించినపుడు, అతని కాలిగోటితాకిడికి ఆ బ్రహ్మనిలయం యొక్క ఊర్ధ్వాండం పగిలి రంధ్రంఏర్పడ్డది. అపుడు బయటనున్న జలధార ఆరంధ్రంగుండా లోనికి ప్రవహించి శ్రీహరి పాదస్పర్శచేత సకలలోకాల పాపాలను పోగొట్టుతూ భగవత్పాది యని ప్రసిద్ధికెక్కి చిరకాలం స్వర్గాన విహరించింది. ఉత్తానపాదుని కుమారుడూ, పరమభాగవతోత్తముడూ అయిన ధ్రువుడు తన కులదేవతయైన శ్రీహరి పాదస్పర్శచే పవిత్రమైన స్వర్గంగా జలాన్ని శిరస్సున చల్లుకొని పులకించిపోతాడు. ఆనందబాష్పాలు కారుస్తాడు.

ఆ ధ్రువునకు క్రిందుగా సప్తర్షిమండలం ఉంది. వారు శ్రీహరి పాదోదక ప్రభావం ఎఱిగినవారు కావున పవిత్రమైన గంగాజలంలో స్నానంచెయ్యడమే తమ తపస్సిద్ధియని భావించి సర్వాంతర్యామియైన ఈశ్వరుని యందు భక్తినలిపి ఇతరపదార్థాపేక్ష లేకుండా మోక్షార్థి ముక్తిమార్గాన్ని మాత్రమే ఆదరించునట్లు ఆ గంగాజలాన్ని భక్తిగౌరవాలతో తమ జటాజూటాలపై ధరిస్తారు.

లెక్కింపసలవికాని దివ్యవిమానాలు దేవమార్గాన చంద్రమండలాన్ని ఒరసికొంటూ వచ్చి మేరునగశిఖరాగ్రాన గల బ్రహ్మపట్టణానికి వస్తుంటాయి. ఆ బ్రహ్మపట్టణానికి నాలుగువైపులా నాలుగు ద్వారాలున్నాయి. ఆ ద్వారాల నుండి ఆ మహానది ప్రవహిస్తూ నాల్గుదిక్కుల యందునుగల ఉప్పుసముద్రంలో సంగమిస్తుంది. నాలుగుద్వారుల్లో అది నాలుగుపేర్లతో వ్యవహరింపబడుతుంది. తనను దర్శించినవారికి, తనయందు స్నానంచేసిన వారికి అది అమృతత్వాన్ని చేకూరుస్తుంది.

బ్రహ్మపట్టణం తూర్పుద్వారంనుండి ప్రవహించునది పేరు సీత. అది

---

*అమరావతి, తేజోవతి, సంయమని, కృష్ణాంగన, శ్రద్ధావతి, గంధవతి మహోదయం, యశోవతి— ఈ యెనిమిది దిక్పాలుర నగరాలు.

పద్మకేసరాల్లాగా వలయాకారంలో ఉన్న పర్వతపంక్తులను తడుపుతూ గంధమాదనపర్వతంచేరి అచటినుండి భద్రాశ్వవర్షాన్ని పావనంచేస్తూ తూర్పునగల ఉప్పునముద్రంలో కలిసిపోతుంది.

పశ్చిమ ద్వారంనుండి వెల్వడెడి ప్రవాహానికి చక్షువని పేరు. అది మాల్యవత్పర్వతాన్ని ఛేదించుకొని కేతుమాలవర్షాన్ని పునీతంచేస్తూ పడమటగల ఉప్పు నముద్రంలో కలుస్తుంది.

ఉత్తర దిగ్ద్వారంనుండి ప్రవహించెడి భద్ర అను పేరుగల ప్రవాహం కుముద, నీల, శ్వేత పర్వతశిఖరాలమీదుగా ప్రవహించి అచ్చట క్రిందికిజారి మానసోత్తరములైన ఉత్తర కురుభూములందు వయనిస్తూ ఉత్తరదిక్కునగల ఉప్పు నముద్రంలో చేరుతుంది.

బ్రహ్మనదన దక్షిణ ద్వారంనుండి ప్రవహించెడి నదీప్రవాహానికి అలకనంద అని పేరు. అది దుర్గమాలైన అనేక పర్వతాలను గడచి హేమకూట హిమకూట నగాలను దాటి అత్యంతవేగంతో కర్మక్షేత్రమైన భారతవర్షాన్ని పావనంచేస్తూ దక్షిణ లవణనముద్రంలో నంగమిస్తుంది.

జగతిలో మేరువు మొదలైన పర్వతాలకు పుత్రికలైన పుణ్యతీర్థాలు వేనకువేలున్నాయి. జంబూద్వీపంలో భారతవర్షం కర్మభూమి. మిగిలిన వర్షాలు స్వర్గంనుండి భువికిదిగి వచ్చినవారు పుణ్యశేషం అనుభవించడానికి తగిన భోగస్థానాలు మాత్రమే. అంచేత వాటిని భూతలస్వర్గాలనవచ్చు. కాని అవి కర్మక్షేత్రాలు కావు. ఆ వర్షాల్లో వసించేవారి ఆయుఃప్రమాణం పది వేల సంవత్సరాలు. వారు వజ్రదేహులు. పదివేల యేనుగులబలం కలిగి దేవతా సమానులై ఉంటారు. వారు అప్రమత్తులై నిత్యానందం అనుభవిస్తూ ఉంటారు.

ఆ అష్టవర్షాల్లో నివసించే స్త్రీ పురుషులు సురతసుఖంలో మునిగి తేలుతూ మోక్షాన్ని కూడ గణింపరు. వారెప్పుడో ఒకేమారు జన్మించి త్రేతా యుగకాలం జీవిస్తారు. దేవతలుకూడా అక్కడికి విహారార్థం వస్తారు. ఎందుకంటే అక్కడ అన్ని ఋతువుల్లో చిగుళ్ళు, పువ్వులు, పండ్లు కలిగిన వృక్షాలతో దట్టంగా పెరిగిన వనాలనేకం ఉంటాయి. కొండలోయలు వర్షాజలంతో నిండి ఉంటాయి. అచటి నరోవరాలు వికసించిన నానావిధ పద్మాల సౌరభం విరజిమ్ముతూ ఉంటాయి. ఆ పద్మసుగంధాన్ని ఆస్వాదిస్తూ రాజహంసలు, కలహంసలు విహరిస్తూ ఉంటాయి. నీటికోళ్ళు, బెగ్గురుపక్షులు, జక్కవలు ఈదులాడుతూంటాయి మదించిన తుమ్మెదల ఝంకారధ్వని శ్రవణసుభగాం వినబడుతూ ఉంటుంది. అచట దేవాంగనలు వినోదచేష్టలతోను, హానవిలాసాలతోను, ప్రేమార్ద్రాలైన క్రీగంటిచూపులతోను కామోద్రేకం కల్పిస్తుంటారు. లోకానుగహం నిమిత్తం శ్రీమన్నారాయణుడు ఈ నవవర్షాల్లో నిరంతరం

సంచరిస్తూంటాడు. రాజేంద్రా! ఈ నవవర్షాలను గురించి సంగ్రహంగా చెపుతాను విను.

1. ఇలావృతవర్షం :- ఈ వర్షానికి అధిపతి శివుడు. ఇచట ఒక వనం ఉంది. అంబికశాపంచేత ఆ వనప్రాంతానికి వచ్చిన పురుషులు స్త్రీలుగా మారిపోతారు. పార్వతీదేవి అనుదినం చెలికత్తెలతో ఆ వనానికివచ్చి ఈశ్వరుణ్ణి సేవిస్తుంది. అచటిజనులు శివపరములైన మంత్రతంత్రాలలో, ఆ దేవదేవుని పూజిస్తారు.

2. భద్రాశ్వవర్షం :- ఈ వర్షానికి ఏలిక భద్రశ్రవుడు. అతడు మేరు నగధీరుడు. అతడు సముద్ర పర్యంతమైన భూమిని పాలించాడు. ఆ రాజునకు ఇష్టదైవం హయగ్రీవుడు, ఆ దైవాన్ని నిరంతరం ధ్యానిస్తూ, సేవిస్తూ, స్తుతిస్తూ హయగ్రీవ తత్వాన్ని ప్రకాశింపజేసెడి ప్రధానమంత్రాన్ని పరమార్థ దృష్టితో జపిస్తూ అచ్చటి జనులు ముక్తి చెందుతారు.

3. హరివర్షం :- ఈ వర్షాధిపతి నరసింహుడు. అచటి జనులు దైత్య దానవులలో ఉత్తములు. వారు ప్రహ్లాదాది వృద్ధజనులతో గూడి స్నాతులై చక్కని పట్టు బట్టలు ధరించి భక్తితో ఆ దైవ సంబంధ మంత్ర తంత్రాదులు జపిస్తూ ఆ దేవదేవుని కరుణాతిశయంచేత భుక్తినీ ముక్తినీ పొందుతారు.

4. కేతుమాల వర్షం :- ఈ వర్షంలో భగవంతుడు శ్రీదేవి మనోనందం కోసం కామ దేవరూపంతో ఉంటాడు. ఆ మహాపురుషుని అస్త్రతేజః ప్రభావంచేత ప్రజాపతి కూతుళ్ళు రాత్ర్యభిమానదేవతల గర్భాలు సంవత్సరాంతంలో నిర్జీవాలై స్రవిస్తాయి. అపుడు మన్మథుడు తన యొయ్యారపు నడకలతోను, విలాస దృక్కులతోను, చక్కని కను బొమలతోను, సుందరమైన వదనార విందకాంతులతోను శ్రీ రమాదేవిని రమింపజేస్తాడు. భగవన్మాయారూపిణియైన లక్ష్మీదేవి ప్రజాపతి పుత్రికలైన రాత్రులతోను, పుత్రులైన పవళ్ళతోను గూడి కామదేవుని స్తోత్ర పరనపూజా ధ్యానాదులతో సేవిస్తుంది.

5. రమ్యక వర్షం :- ఈరమ్యక వర్షవాసులకు మత్స్యావతారం ధరించిన విష్ణువు ఇష్టదైవం. వారి ప్రభువు మనువు. మనువు తన పుత్రపౌత్రులతోను, మంత్రిగణంతోను, మత్స్యావతార తత్వాన్ని వ్యక్తంచేసే మంత్ర తంత్రాలు జపిస్తూ హోమాలు ధర్మకర్మలు చేస్తూ మత్స్యమూర్తిని ఆరాధించి తరించి మోక్షం పొందుతాడు.

6. హిరణ్మయ వర్షం:- ఈ వర్షానికి కూర్మావతారం ధరించిన విష్ణువు అధిదేవత. పితృపతియైన అర్యముడు జనపాలకుడు. ఆ మహాత్ముడు ఆ వర్షవాసులతోగూడి శ్రీహరిని మనస్సులో ధ్యానిస్తూ స్తుతిస్తూ ఇహపర సౌఖ్యాలు పొందుతాడు.

7. ఉత్తర కురువర్షం :— ఈ వర్షాధిపతి వరాహస్వామి. ఆ భూములను పాలించెడి రాజూ, ప్రజలూ ఆ స్వామిని భక్తి ప్రపత్తులతో సేవించి కైవల్య పదం పొందుతారు.

8. కింపురుష వర్షం :— ఈ మహావర్షానికి సీతా లక్ష్మణ సమేతుడైన శ్రీరాముడు అధిదేవత. ఆ శ్రీరామ చంద్రుని ఆంజనేయుడు కింపురుష గణంతో గూడి తత్సంబంధిత మంత్ర తంత్రాలతో ఉపాసిస్తాడు.

9. భారత వర్షం :— భారత వర్షానికి అధిపతి బదరి కాశ్రమవాసియైన నారాయణుడు. ఆ వర్ష ప్రజలు నారదాదులతో గూడి ఆ మహాత్ముని ఉపాసించి చరితార్థులౌతారు. ఉచిత రీతిని సాంఖ్యయోగోపదేశాన్ని పొంది శ్రీమన్నారాయణుని తత్ప్రకాశక మంత్రస్తుతులతో ప్రసన్నునిగా చేసికొని ముక్తిపొందుతారు.

పరీక్షిన్నరేంద్రా! భారత వర్షంలో అనేక పుణ్యపర్వతాలు, పుణ్య తీర్థాలు ఉన్నాయి. ఇక వాటిని వివరిస్తాను. విను—' అని శుకమహర్షి యిలా చెప్పడం మొదలు పెట్టాడు—

## భారత వర్షంలో గల పుణ్యపర్వతాలు

'మలయపర్వతం, మంగళ ప్రస్థం, మైనాకం, త్రికూటం, ఋషభం, కూటకం, గోల్లం, సహ్యాద్రి, వేదాద్రి, ఋశ్యమూకం, శ్రీ శైలం, వేంకటాద్రి, మహేంద్రం, వారిధరం, వింధ్య పర్వతం, శుక్తిమత్పర్వతం, ఋషగిరి, పారి యాత్రం, ద్రోణ పర్వతం, చిత్రకూటం, గోవర్ధన పర్వతం, రైవతకం, కుకుంభం, నీలగిరి, కాక ముఖం, ఇంద్రకీలం, రామగిరి— మొదలైనవి భారత వర్షంలోని ముఖ్యమైన పుణ్యనగాలు.

## భారత వర్షంలో గల పుణ్య నదీ నదాలు

చంద్రవట, తామ్రపర్ణి, అవటోద కృతమాల, వైహాయసి, కావేరి, వేణి, పయస్విని, పయోద, శర్కరావర్త, తుంగభద్ర, కృష్ణవేణి, భీమరథి, గోదావరి, నిర్వింధ్య, పయోష్ణి, తాపి, రేవానది, శిలానది, సురనది, చర్మణ్వతి, వేదస్మృతి, ఋషికుల్య, త్రిసమ, కౌశికి, మందాకిని, యమున, సరస్వతి, దృషద్వతి, గోమతి, సరయువు, భోగవతి, సుషమ, శతద్రువు, చంద్రభాగ, మరుద్వృధ, వితస్త, అశ్నికి, విశ్వ - ఇవి మహానదులు. సింధు, శోణ— ఇవి నదాలు. ఇవన్నీ పర్వతాలనుండి జనించినవే.

ఈ మహానదుల్లో స్నానం చేసినవారికి మోక్షం కరతలామలకం.

ఈ భారతవర్షంలో జనించినవారు సాత్విక, రాజస, తామసాలైన త్రివిధ కర్మలాచరించి క్రమంగా దేవ, మనుష్య, నరక గతులను పొందుతారు. రాగద్వేషాధిశూన్యుడూ, అవాఙ్మానసగోచరుడూ, అనాధారుడూ, అయిన శ్రీ వాసుదేవుని యందు మనస్సు నిలిపి భక్తియోగంతో ఆరాధించేడి మహాత్ములు అవిద్యాగ్రంథిని త్రెంచివేసుకొని పరమభాగవతోత్తములు పొందేడి ఉత్తమ గతిని పొందుతారు. అంచేతనే భారతవర్షం మిక్కిలి ఉత్తమమైనదని మహాపురుషులిలా స్తుతిస్తారు.

"భారత వర్షంలోని జీవకోటి భాగ్యమే భాగ్యం. శ్రీహరి ఈ పవిత్ర భూమిలో మాటిమాటికీ అవతరిస్తూ ఇచటి వారికందరికీ చెలియై చుట్టమై తత్వోపదేశం చేసి కృతార్థులను చేస్తాడు. తన జన్మకర్మలను కీర్తించేడి వారి కోర్కెలను తీరుస్తూ వారికి మోక్షాన్ని అనుగ్రహిస్తాడు. భారతవర్షీయులకు అసాధ్యమైనదేదీ లేదు.

నారాయణ స్మరణం వారి సమస్త పాపాలను పోగొట్టుతుంది. అది లేకపోతే ఎన్ని యజ్ఞాలు, తపస్సులు, దానాలు చేసినా పాపవిముక్తి కలుగదు. ఇతర స్థానాల్లో పునర్జన్మ భీతితో బ్రహ్మకల్పాంతం జీవించేదానికన్నా, భారతవర్షంలో క్షణమాత్రం మనస్సులో సర్వసంగాలు త్యజించిన పురుష శ్రేష్ఠునకు శ్రీహరి పదప్రాప్తి సులభంగా సంభవిస్తుంది. అంచేతనే అందరూ భారతవర్షంలోనే జన్మించాలని కాంక్షిస్తారు.

ఎక్కడ శ్రీహరి కథాగానం వినబడదో, ఎక్కడ పరమ భాగవతోత్తములుండరో, ఎక్కడ యజ్ఞేశ్వరుని మహోత్సవాలు జరుగవో అది సురేంద్రలోకమైనా ఉండదగదు. భగవంతుడు మానవునకు జ్ఞానం, అనుష్ఠానం, ద్రవ్యసంపత్తి అనుగ్రహించాడు అతడు వాటిని సంపూర్ణంగా వినియోగించుకొని తపశ్చర్యతో మోక్షం సాధించకపోతే మృగాల్లాగా తన కట్టుత్రాళ్లు తానే తెచ్చుకుంటాడు. భారతవర్షంలో ప్రజలు శ్రద్ధాసక్తులతో అనుష్ఠించేడి యజ్ఞములందు వేల్చెడు హవిస్సులను పుండరీకాక్షుడు కరుణతో స్వీకరించి ఇహపర సౌఖ్యాలిస్తాడు."

జంబూద్వీపంలో సగరసుతులు అశ్వమేథాశ్వాన్ని అన్వేషించడానికి బయలుదేరి భూమిని త్రవ్వారు. ఆ మట్టిలో ఎనిమిది చిన్నద్వీపాలు ఏర్పడ్డాయి. అవి ఈ నవవర్షాలకూ ఉపద్వీపాలు. అవి - స్వర్ణప్రస్థం, చంద్రశుక్లం, ఆవర్తనం, రమణకం, మందేహారుణం, పాంచజన్యం, సింహళం, లంక - అను నామాలతో వ్యవహరింపబడుతున్నాయి. జంబూద్వీపం లక్ష యోజనాల ఉప్పు సముద్రంచే పరివేష్టితమై ఉంటుంది. నరేంద్రా! జంబూద్వీపం గురించీ, అందుగల వర్ష విభాగలను గురించీ యథాక్రమంగా

వర్ణించి చెప్పాను. ఇక ప్లక్షాది ద్వీపాలు అటి టి పరిమాణం, లక్షణాలు, అచటి విశేషాంశాలు విభజించి యథాక్రమంగా చెపుతాను. విను— అని శుకమహర్షి ఇలా చెప్పడం మొదలుపెట్టాడు.

ప్లక్షద్వీపం :— దీని విస్తృతి రెండులక్షల యోజనాలు. ఇది లవణ సముద్రాన్ని చుట్టి ఉంటుంది. ఈ ద్వీపంలో చక్కని ప్లక్షతరువు (జువ్వి చెట్టు) ఉంది. అంచేతనే ఈ ద్వీపం ప్లక్షద్వీపం అని ప్రసిద్ధికెక్కింది. ఆ ద్వీపవాసులకు అగ్నిదేవుడు ఇష్టదైవం. ఆ ద్వీపానికి అధిపతి ప్రియవ్రతుని కుమారుడు ఇధ్మజిహ్వుడు. ఇధ్మజిహ్వుడు ఆ ప్లక్షద్వీపాన్ని ఏడు వర్షాలుగా విభజించి వానికి తన కుమారులేడుగురను పరిపాలకులుగా చేశాడు. ఆ వర్షాలకు వారి పేర్లే పెట్టాడు. శివుడు, యశస్వుడు, సుభద్రుడు, శాంతుడు, క్షేముడు, అభయుడు, అమృతుడు - అనునవి వారి నామాలు. వారిని అధిపతులనుగా చేశాక ఇధ్మజిహ్వుడు తపస్సు చేసుకునేందుకు వెళ్ళిపోయాడు.

ఈ యేడువర్షాల్లో క్రమంగా మణికూటం, వజ్రకూటం, ఇంద్రసేనం, జ్యోతిష్మంతం, ధూమ్రవర్ణం, హిరణ్యగ్రీవం, మేఘమాలం— అను యేడు కులపర్వతాలున్నాయి. అలాగే వరుసగా అరుణ, నృమణ, అంగిరస, సావిత్రి, సుప్రభాత, ఋతంభర, సత్యంభర— అను నదులుకూడా ఉన్నాయి. అచట నాలుగు వర్ణాలవారూ ఉన్నారు. వారికి వరుసగా హంసులు, పతంగులు, ఊర్ధ్వాయనులు, సత్యాంగులు - అని పేరు. వారి ఆయుఃపరిమాణం వేయి సంవత్సరాలు. వారు దేవతుల్యులు. వారు దృష్టిమాత్రంచేతనే సంతానోత్పత్తి చేస్తారు. ఆ సంతానానికి అలసట, చెమట మొదలైనవి ఉండవు. వారు సూర్యోపాసకులు. వారు సూర్యుని వేదత్రయాత్ముడుగా, స్వర్గద్వారభూతుడుగా భావించి ఆరాధిస్తారు. ప్లక్షద్వీపం మొదలుగా మీదటి ద్వీపపంచకంలోని పురుషులకు ఆయురింద్రియపటుత్వం, తేజోబలం పుట్టుకతోనే సంక్రమిస్తాయి. రెండులక్షల యోజనాల మేరగల ఇక్షుసముద్రం ఈ ప్లక్షద్వీపాన్ని పరివేష్టించి ఉంటుంది.

శాల్మలీద్వీపం :— దీని విస్తృతి నాలుగులక్షల యోజనాలు. ఈ ద్వీపమందు ప్లక్షద్వీపంలోని జువ్వి చెట్టంతటి శాల్మలీ వృక్షం (బూరుగుచెట్టు) ఉంది. ఆ వృక్షం పేరుతోనే ఈ ద్వీపానికి శాల్మలీద్వీపం అని పేరు వచ్చింది. ఈ వృక్షం క్రింద గరుత్మంతుడు స్థిరనివాసం కల్పించుకొని ఉంటాడు. ఈ ద్వీపాధిపతి ప్రియవ్రతుని కొడుకు యజ్ఞబాహువు. అతడు దీనిని ఏడు వర్షాలుగా విభజించి వాటియందు తన యేడ్గురు కొడుకులను అభిషిక్తులను చేశాడు. సురోచనుడు, సౌమనస్యుడు, రమణకుడు, దేవబర్హుడు, పారిబర్హుడు, ఆప్యాయుడు, అభిజ్ఞాతుడు- అని వారి పేర్లు. అచట స్వరస,

శతశృంగం, వామదేవం, కుముదం, ముకుందం, పుష్పవర్షం, శతశృతం అను ఏడుపర్వతాలూ, అనుమతి, సినీవాలి, సరస్వతి, కుహూవు, రజని, నంద, రాక - అను నదీన ప్తకం ఉన్నాయి. అచట శ్రుతధరులు, విద్యాధరులు వసుంధరులు, ఇర్మధరులు అను నాలుగు జాతులవారుంటారు ఆ వర్షజనులు భగవత్స్వరూపుడూ, వేదమయుడూ, ఆత్మస్వరూపుడూ అయిన సోముని వేదమంత్రాలతో ఆరాధిస్తారు నాలుగులక్షల యోజనాల పరిమితిగల సురా సముద్రం ఆ ద్వీపాన్ని పరివేష్ఠించి ఉంటుంది.

కుశ ద్వీపం :— ఇది సురానముద్రం చుట్టూ ఎనిమిది లక్షలయోజనాల పరిమాణం కలిగి ఉంటుంది. దాని నడుమ ఎత్తైన కుశ స్తంభం ఉంది. అది దేవతా కల్పితమైన కాంతిచే దిక్కులను వెలిగిస్తూ ఉంటుంది. దానివల్లనే ఆ ద్వీపానికి కుశద్వీపం అని పేరు వచ్చింది. దాని కధిపతి ప్రియవ్రతుని కొడుకు హిరణ్యరేతసుడు. అతడా ద్వీపాన్ని ఏడు వర్షాలుగా విభజించి వాటికి తన యేడ్గురు కొడుకులను అధినేతలనుగా చేశాడు వసువు, దానుడు, దృఢరుచి, నాభిగుప్తుడు, సత్యవ్రతుడు, విప్రుడు వామదేవుడు - అని వారి పేర్లు -

ఆ సప్తవర్షాల్లో వరుసగా బభ్రువు, చతుశ్శృంగం, కపిలం, చిత్ర కూటం, దేవానీకం, ఊర్ధ్వరోమం, ద్రవిణం అను సప్త పర్వతాలూ, రస కుల్య, మధుకుల్య, శ్రుతవింద, మిత్ర వింద, దేవగర్భ, ఘృతచ్యుత మంత్ర మాల–అను సప్త నదులూ ఉన్నాయి. ఆ నదీ జలాల్లో స్నానంచేసి కుశల, కోవిద, అభియుక్త, కులకులను పేర్లుగల ఆ వర్ష పురుషులు భగవంతుడైన యజ్ఞపురుషుని ఆరాధిస్తారు. ఆ కుశద్వీపాన్ని ఎనిమిది లక్షల యోజనాల పరి మాణం గల ఘృత సముద్రం పరివేష్ఠించి ఉంటుంది.

క్రౌంచ ద్వీపం :— ఘృత సముద్రానికి వెలుపల పదునారు లక్షల యోజనాల పరిమాణంకల క్రౌంచ ద్వీపం ఉంది. దీనికి ఆ పేరు రావడానికి కారణం ఆ ద్వీపం నడుమగల క్రౌంచ పర్వతం. పూర్వం కుమారస్వామి ఒక బాణం ప్రయోగించగా అది ఆ క్రౌంచ పర్వతంపై నుండి క్రిందికి దూసుకొని పోయి పెద్దబిలం ఏర్పడ్డది. ఆ బిలం నుండి పాలవెల్లి వెలువడి ఆ ప్రాంతాన్ని తడుపుతుంది. వరుణుడు ఆ ప్రదేశాన్ని రక్షిస్తూ ఉంటాడు కనుక అక్కడ ఏ భయమున్నూ లేదు. ఆ ద్వీపపతి ఘృతపృష్ఠుడు. అతనికి–ఆమోదుడు, మధు వహుడు, మేఘ పృష్ఠుడు, సుదాముడు, ఋషిజ్యుడు, లోహితుడు, వన స్పతి–ఏడుగురు కొడుకులు. ఆ ద్వీపాన్ని ఏడు భాగాలుగా విభజించి ఆ యేడుగురికి పట్టంకట్టి తాను తపోవనానికి వెళ్ళాడు.

ఈ ద్వీపమందలి ఏడు వర్షాల్లో క్రమంగా శుక్లం, వర్ధమానం, భోజ నాద్రి, ఉపబర్హణం, ఆనందం, నందనం, సర్వతో భద్రం–అని ఏడు సీమా

పర్వతాలూ, అభయ, అమృతౌఘ, ఆర్యక, తీర్థవతి, తృప్తిరూప, పవిత్రవతి, శుక్ల-అను ఏడునదులూ ఉన్నాయి. గురువులు, ఋషభుల్ను, ద్రవిణకులు, దేవకులు, అను పేర్లుగల చాతుర్వర్ణ్యం ఆ పవిత్ర నదీజలాలను అనుభవిస్తూ ఆ జలాంజలులతో వరుణదేవుని ఆరాధిస్తారు. ఆ క్రౌంచ ద్వీపం చుట్టూ పదు నాఱువేల యోజనాల విస్తీర్ణతగల క్షీరసముద్రం ఉంది.

శాక ద్వీపం :— దీని పరిమాణం ముప్పదిరెండు లక్షల యోజనాలు. ఆ ద్వీపంలో శాక వృక్షమొకటుంది. అందుచేత దానికి ఆ పేరు వచ్చింది. ఆ వృక్షసుగంధం ఆ ద్వీపం నలుమూలలా వ్యాపిస్తుంది. దానికి అధిపతి ప్రియవ్రత పుత్రుడు మేథాతిథి. అతనికి ఏడుగురు కొడుకులు. పురోజవుడు, మనోజవుడు, లేపమానుడు, ధూమ్రానేకుడు, చతుర రథుడు, బహురూపుడు, విశ్వాచారుడు - అని వారి పేర్లు. మేథాతిథి ఈ ద్వీపాన్ని ఏడు వర్షాలుగా విభక్తం చేసి తన కొడుకుల కిచ్చారు. వాటికి కూడా తన కొడుకుల పేర్లే పెట్టాడు. అనంతరం అతడు తపశ్చర్యకై వెళ్ళిపోయాడు.

ఆ వర్షాలయందు వరుసగా ఈశానం, ఉరుశృంగం, బలభద్రం, శతకేసరం, సహస్రస్రోతం, దేవపాలం, మహానసం, అను ఏడు సరిహద్దు కొండలూ, అనఘ, ఆయుర్ద, ఉభయ సృష్టి, అపరాజిత, పంచపది, సహస్ర స్రుతి, నిజ ధృతి-అను ఏడు నదులూ ఉన్నాయి. ఆ వర్ష పురుషులకు ఋత వ్రతులు, సత్యవ్రతులు, దాన వ్రతులు, సువ్రతులు అని పేరు. వారు ప్రాణా యామం చేస్తూ రజస్తమో గుణాలను నశింప జేసుకొని సమాధినిష్ఠులై వాయు రూపుడైన భగవంతుని ఆరాధిస్తారు. ఆ శాకద్వీపాన్ని అరికట్టి అదే ప్రమాణం గల దధి సముద్రం ఉం

పుష్కర ద్వీపం :— ఆ దధి సముద్రం చుట్టూ వెలుపల పుష్కర ద్వీపం ఉంది. దాని పరిమాణం అరువది నాలుగు లక్షలయోజనాలు. ఆ మహా ద్వీపంలో పదివేల బంగారు రేకులుగల తామరపువ్వు ఉంది. అది బ్రహ్మ దేవుని నివాస స్థానం. ఆ ద్వీపం నడుమ మానసోత్తరం అను పర్వతం ఉంది. దాని తూర్పుపడమరల యందుగల రెండు వర్షాలకు అది సరిహద్దు పర్వతం. దాని విస్తీర్ణం పదివేల యోజనాలు. ఎత్తుకూడా అంతే. దానికి నలువైపులా నాలుగు లోక పాలకుల నగరాలున్నాయి. ఆ పర్వత శిఖరాగ్రమందు సూర్యుని రథ చక్రం సంవత్సరాత్మకమై అహోరాత్రాలు మేరువునకు ప్రదక్షిణం చేస్తుంది. ఈ పుష్కరద్వీపానికి అధిపతి వీతి హోత్రుడు. అతనికి రమణకుడు, ధాతకుడు-అని ఇద్దఱు కొడుకులు. వీతి హోత్రుడా యిద్దఱిని వర్షద్వయానికి పట్టంకట్టి తన పూర్వుల మార్గాన్ని అనుసరించి తానున్నూ భగవత్కర్మ శీలుడై తపస్సుకు వెళ్ళాడు.

ఆ వర్షపురుషులు నిశ్చలబుద్ధితో కర్మమార్గాన పద్మాసనుని ఆరా

దిస్తారు. ఆ ద్వీపంలో చతుర్వర్ణ విభాగం లేదు. అందరు సమానులై సరసంగా ప్రవర్తిస్తారు. అది అరువదినాలుగు లక్షల యోజనాల విస్తృతిగల శుద్ధోదక సముద్రంచేత పరివృతమై ఉంటుంది.

ఆ సముద్రానికి అవల లోకాలోకపర్వతముంది. ఆ రెంటికి నడుమ రెండుకోట్ల యోజనాల విస్తీర్ణంగల నిర్జనభూమి ఉంది. అక్కడ ఏమీఉండదు. అద్దంలాగా ఉంటుంది. అది దేవతలకు వాసయోగ్యంగా ఉంటుంది. అంతేకాని అచటికి ఏ జీవివెళ్ళినా తిరిగి కనబడదంకల్ల. ఆపైన ఎనిమిదికోట్ల యోజనాలు సువర్ణభూమి గోచరమవుతుంది. అది సూర్యునినుండి ధ్రువతారవరకు వ్యాపించి ఉంటుంది. దానియందు కోట్లకొలది జ్యోతిర్గణాలున్నాయి. దాన్ని కూడా లోకాలోకపర్వతమనే అంటారు.

ఈ విధంగా సప్తద్వీపాలతో గూడిన మొత్తం భూమండలం యొక్క పరిమాణం ఏబదికోట్ల యోజనాలు. దీనిలో నాలుగోవంతు ప్రమాణంగల లోకాలోకపర్వతంమీద అఖిలజగద్గురువైన బ్రహ్మ లోక రక్షణార్థం నాలుగు వైపులా ఋషభం, పుష్కరచూడం, వామనం, అపరాజితం-అను నాలుగు దిగ్గజాలను నిర్మించాడు. ఆదిదేవుడూ, జగద్గురువూ అయిన అచ్యుతుడు తన విభూతిరూపాలైన దేవతలకు తేజస్సును శౌర్యాన్ని వృద్ధిచేయడానికిన్నీ, అఖిలలోకాలను రక్షించడానికిన్నీ ఆ పర్వతంమీద యోగమాయా విరచితుడై బ్రహ్మకల్ప పర్యంతం ఉంటాడు. అక్కడ ధర్మజ్ఞాన వైరాగ్యసంపన్నులైన విష్వక్సేనుడాదిగా గల పార్షదులు ఆ దేవదేవుని వెంట ఉంటారు.

ఆ పర్వతాగ్రమందు నానావిధాలైన మంత్రాలను (సృష్టిరహస్యాలను) రక్షించడానికి శ్రీమన్నారాయణుడొక్కడే ఉంటాడు. లోకాలోకపర్వతానికి అవల అతనికొక్కనికి తప్ప ఇతరులెవ్వరికీ చరించేశక్తిలేదు. బ్రహ్మండానికి సూర్యుడు మధ్యగతుడై ఉంటాడు. ఆ సూర్యునకు రెండువైపులా ఇరువది యైదుకోట్ల పరిమాణంగల అండకటాహం (బ్రహ్మండపుడిప్ప) ఉంటుంది. సూర్యుడే ఆకాశం, దిక్కులు, స్వర్గాపవర్గాలు, నరకాలు నిర్ణయిస్తాడు. దేవతలకు, తిర్యక్కులకు, మనుష్యులకు, పక్షులకు, సర్పాలకు, తృణగుల్మలతాది సకలసృష్టిజాలానికి సూర్యుడే ఆత్మ. రాజేంద్రా! నీకు భూమండల విశేషాలన్నీ చెప్పాను. ఇక మిగిలిన సృష్టి విశేషాలను వాటికొలతలను చెపుతాను. విను—' మని శుకయోగి యింకా ఇలా చెప్పడం ప్రారంభించాడు.

## ఖగణవిషయం

బ్రహ్మండానికి మధ్యగతుడైన సూర్యుడు తన ఎండతో ముల్లోకాలకు

వెచ్చదనాన్ని వెలుగును ఇస్తాడు. సూర్యునకు ఉత్తరాయణం, దక్షిణాయనం, విషువు అను మూడుగతులుంటాయి. ఉత్తరాయణమందు పైకిపోతాడు. అపుడు గతిమాంద్యంచేత పగళ్ళు దీర్ఘంగా రాత్రిళ్ళు హ్రస్వంగా ఉంటాయి. దక్షిణాయనంలో క్రిందికి వస్తాడు. అపుడు శీఘ్రగమనం వలన పగళ్ళు కుఱచలై రాత్రులు దీర్ఘంగా ఉంటాయి. ఇక విషువులో సమగతివలన అహోరాత్రాలు సమంగా ఉంటాయి.

మేష తులారాసులందు సూర్యుడున్నప్పుడు అహోరాత్రాలు సమంగా ఉంటాయి. వృషభ మిధున కర్కాటక సింహ కన్యా రాసులందున్నప్పుడు రాత్రులందొక్కగడియ తఱిగి పవళులందొక్కొక్క గడియ అధికమవుతుంది. అలాగే సూర్యుడు వృశ్చికం, ధనస్సు, మకరం, కుంభం ,మీనం-అనుఅయిదు రాసులందు వర్తించునపుడు రాత్రులందొక్కొక్క గడియ హెచ్చి దీర్ఘంగా ఉంటాయి. పగళ్ళు ఒక్కొక్కగడియ తగ్గి పొట్టిగా ఉంటాయి.

ఈరీతిగా పగళ్ళు ఉత్తరాయణ దక్షిణాయనాల్లో వృద్ధిక్షయాలు పొందుతాయి. సూర్యరథం ఒక అహోరాత్రంలో తొంభైకోట్ల యాభైయొక్క యోజనాల పరిమాణంగల మానసోత్తర పర్వతంమీద తిరుగుతుంది. ఆ మానసోత్తరపర్వతంమీద తూర్పున దేవధానియను ఇంద్రపురం, దక్షిణాన సంయమని యను యమనగరం, పడమట నిమ్లోచని అను వరుణనగరం, ఉత్తరాన విభావరి యను సోమనిలయం ఉంటాయి. ఈ నాలుగు పట్టణాలయందు సూర్యుడు క్రమంగా ఉదయం, మధ్యాహ్నం అస్తమయం, నిశీధం అను కాల భేదాలు కల్పిస్తాడు. ఈ కాలభేదాన్ని సూర్యుడు జీవకోటి ప్రవృత్తికోసం కల్పించిందే. సూర్యుడు ఇంద్రనగరం నుండి బయలుదేరి ఈ నాలుగు పట్టణాలన్ను చంద్రాది గ్రహనక్షత్రాలతో గూడి సంచరిస్తాడు. ఒక పట్టణంనుంచి మఱో పట్టణానికి మధ్యగల దూరం రెండుకోట్ల ముప్పదియేడులక్షల డెబ్బది అయిదువేల యోజనాలు. ఈ దూరం నడవడానికి సూర్యునకు పదునైదు గడియలకాలం పడుతుంది. పంన్రెండు అంచులు (మాసాలు), ఆఱుకమ్ములు (ఋతువులు) మూడు తొలులు (త్రికాలాలు) కలిగి సంవత్సరాత్మకమైన ఏకచక్రంగల సూర్యరథం ముహూర్తకాలంలో ముప్పది నాలుగులక్షల యెనుబది వందల యోజనాలు తిరుగుతుంది.

సూర్యుని రథానికి రెండు ఇరుసులున్నాయి. ఒకటి మేరుశిఖరాన ఉంది. చక్రసహితమైన రెండవది మానసోత్తర మందుంది. ఇవి వాయుపాశాలచే కట్టబడి ఉంటాయి. సూర్యుని రథచక్రం మానసోత్తరమందు తైల యంత్రంలాగా తిరుగుతుంది. అలా తిరిగేటప్పుడది ధ్రువాలను తాకుతుంది. ఆ రథం కాడిపొడవు ముప్పదియాఱు లక్షల యోజనాలు. ఆ రథానికి షష్ఠ

గుణాలున్నాయి. అవి— గాయత్రి, బృహతి, ఉష్ణిక్కు, జగతి, త్రిష్టుప్పు అనుష్టుప్పు, పంక్తి — అను ఛందోనామాలతో వ్యవహరింపబడతాయి.

సూర్యుని రథచోదకుడు అరుణుడు. బ్రొటనవ్రేలి కణుపంతటి శరీరాలు గల అరువేలమంది ఋషిశ్రేష్ఠులు సూర్యునిముందు స్తోత్రాలు చేస్తూ సంచరిస్తారు. వారికి వాలఖిల్యులని పేరు. వారు సౌక్తసూక్తులతో సూర్యభగవానుని స్తోత్రం చేస్తారు. వారుకాక. ఇంకెందరో మునులూ, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, నాగులు, అప్సరలు, పతంగాదులు నెలనెల వరుసక్రమంలో సేవిస్తారు. అలా వారి సేవలందుకుంటూ తొమ్మిదికోట్ల యేబది యొక్క లక్ష యోజనాలు పరిమాణం కలిగిన భూమండలాన్ని క్షణానికి రెండువేల యేబది యోజనాలు అతిక్రమిస్తూ సూర్యుడు ఒక అహోరాత్రంలో భూమండలం అంతా సంచరిస్తాడు'— అనిన శుక యోగీంద్రునకు పరీక్షిన్నరేంద్రుడు- 'మునీశ్వరా! సూర్యుడు మేరువునకు, ధ్రువునకు ప్రదక్షిణంగా తిరుగుతాడని మొదట చెప్పావు. ఇపుడు రాసులకు అభిముఖుడై తిరుగుతున్నాడన్నావు. ఇది ఎలా సాధ్యం? ఒకనికి ఒక పర్యాయం గతిద్వయం నంభవించడం అనుభవ విరుద్ధం కదా!—' అనేసరికి శుకయోగి కరుణాన్వితుడై శ్రీహరిని స్మరిస్తూ తిరిగి యిలా అన్నాడు.

'రాజా! అతివేగంతో తిరుగుతూన్న కుమ్మరి సానయందు చీమలు, బారులు తీర్చి తిరుగుతూ ఉంటాయి. ఆ చీమల నడక చక్రభ్రమణం కంటె భిన్నమైనది. చక్రమూ తిరుగుతూ ఉంటుంది. దాని నాశ్రయించి చీమలూ తిరుగుతూ ఉంటాయి. అలాగే నక్షత్రాలతోను, రాసులతోను గూడిన కాలచక్రం ధ్రువమునకు, మేరువునకు ప్రదక్షిణం తిరుగునపుడు ఆ కాలచక్రం వెంట తిరిగెడి సూర్యాది గ్రహాలకు, నక్షత్రాల్లోను, రాసుల్లోను ఉనికి ఉండడంవలన వాటికి గతిద్వయం (కాలచక్రగతి, స్వీయగతి) ఉండడంలో విరోధమేమిన్నీ లేదు.

అదీకాక ఆ సూర్యుడు ఆదినారాయణమూర్తి. అతడు లోకశ్రేయస్సు కాంక్షించి వేదత్రయాత్మకుడయ్యాడు. కర్మసిద్ధికోసం, దేవతలూ ఋషులూ ఆ ఆదిదేవుని స్వరూపాన్ని గురించి తర్కిస్తూ ఉంటారు. అలాంటి తన స్వరూపాన్ని సూర్యుడు పన్నెండు విధాలుగా విభజించి వసంతాది ఋతువులను, ఆయా కాలవిశేషాల యందు ప్రవర్తింపజేస్తున్నాడు. అటువంటి పరమపురుషుని మహిమను ఈ లోకంలో మహాత్ములు తమతమ వర్ణాశ్రమాచారోననుసరించి వేదోక్తవిధిని భక్తిభావంతో ఆరాధిస్తూ శుభాలు పొందుతారు.

సూర్యస్వరూపుడైన ఆదినారాయణమూర్తి జ్యోతిశ్చక్రంలో తిరుగుతూ స్వీయతేజస్సుచేత సమస్త జ్యోతిర్గణాలను ప్రకాశింపజేస్తాడు. పన్నెండు

సుల్లో ఒక సంవత్సరం తిరిగివచ్చేది ఆ ఆదిపురుషుని గమన విశేషకాలాన్ని
కులు — అయనాలు, ఋతువులు, మాసాలు, పక్షాలు, తిథులు మొదలైన
ర్లల్లో వ్యవహరిస్తారు. ఈ రాశి చక్రమందు ఆఱవభాగాన సూర్యుడు
ంచరించు కాలపరిమితిని ఋతువంటారు. సగభాగంలో నంచరించు కాల
రిమితిని ఆయనం అంటారు. అలాకాక అన్ని రాసులయందును సంచరిస్తే
కాలాన్ని సంవత్సరం అని నిర్ణయిస్తారు. సూర్యుడు సమగ్రరాశి సంచారం
స్తేటప్పుడు శీఘ్రగతి, మందగతి, సమగతు లనెడి మూడువిధాలైన గతి
శేషాలచేత సంవత్సరం అయిదు విధాలుగా ఏర్పడుతోంది. సంవత్సరం,
రివత్సరం, ఇడావత్సరం, అనువత్సరం, ఇద్వత్సరం— ఇవి ఆ అయిదువిధ
వత్సరాలు.

చంద్రుడు సూర్యమండలంపై లక్షయోజనాల దూరంలో న్నాడు.
అతనివలననే చాంద్రమాన సంవత్సరం, పక్షాలు, రాశిసంచారం, నక్షత్రభుక్తి
మొదలైనవి ఏర్పడుతున్నాయి. చంద్రుడిలా పైన ఉండి మిగిలిన గ్రహాల
కంటె శీఘ్రగమనంలో నంచారం చేస్తాడు. అతనికి శుక్లపక్షంలో వృద్ధి,
కృష్ణంలో క్షయం కనిపిస్తుంది. శుక్లపక్షం పితృదేవతలకు పగలు. కృష్ణపక్షం
రాత్రి. అనగా మానవులకొక మాసం పితృదేవతలకు ఒక రోజు.

చంద్రుడు నకలజీవకోటికి ప్రాణాధారం కల్పిస్తాడు. ఒక్కొక్క
నక్షత్రంలో ముప్పది ముహూర్తాలకాలం తిరుగుతాడు. అతనికి షోడశ కళ
లున్నాయి. మనోమయ, అన్నమయ, అమృతమయ కళలతో చంద్రుడు
దేవతలకు, పితృదేవతలకు, మనుష్యులకు, భూతకోటికి, పశువులకు, పక్షు
లకు, సరీసృపాలకు, తరులతాగుల్మాదులకు ప్రాణప్రీతి కలిగిస్తాడు కనుక
సర్వసముడని విఖ్యాతి చెందాడు.

చంద్రునికన్న పైన లక్షయోజనాల యెత్తున తారలు మేరుపర్వతానికి
ప్రదక్షిణంగా తిరిగివస్తాయి. అభిజిత్తు అను నక్షత్రం కూడా ఆ తారాచక్ర
మందు తిరుగుతూ ఉంటుంది.

తారామండలంకంటె రెండులక్షల యోజనాల యెత్తున శుక్రమండలం
ఉంది. శుక్రుడు సూర్యునకు ముందుగా వెనుకగాని ఉదయించి నంచారం
చేస్తాడు. సూర్యునిలాగానే ఇతనికిన్నీ శీఘ్ర మంద సమగతులున్నాయి. ఇతడు
జనులకు క్షేమకారకుడు, వర్షప్రదాత. వర్షపాతానికి విఘ్నాలు కలిగించే
గ్రహాలకు శాంతి చేసేవారికి ఇతడు శుభాలిస్తాడు.

శుక్రునకు పైన రెండులక్షల యోజనాల దూరంలో బుధమండలం
ఉంది. బుధుడు ఎప్పుడూ సూర్యునకు దగ్గరగానే ఉదయించడం వల్ల సామా
న్యంగా కనబడడు. అలాకాక ఏ వేళ కనబడితే భూమిమీద కరువులు,
దోపిడీలు మొదలైన ఉపద్రవాలు తప్పవు.

బుధునకు రెండులక్షల యోజనాల దూరంలో అంగారకుడున్నాడు. అతడు మూడేసి పక్షాలకు ఒక్కొక్క రాశి చొప్పున అతిక్రమిస్తూ పంన్రెండు రాసులను భుజిస్తాడు. అతడు రజఃప్రవృత్తి కలవాడవడంచేత వక్రించినా వక్రించకపోయినా ప్రజలకు తఱచుగా పీడలు కల్పిస్తాడు.

అంగారకునకు పైన రెండులక్షల యోజనాల దూరంలో బృహస్పతి ఉన్నాడు. అతడు ఒక్కొక్క రాశిలో ఒక్కొక్క సంవత్సరం సంచరిస్తాడు. అతడు వక్రించినప్పుడు కూడా బ్రాహ్మణులకు ఎప్పటికప్పుడు శుభాలను కలిగిస్తాడు.

బృహస్పతికి రెండులక్షల యోజనాల దూరంలో పైన శని తిరుగుతూ ఉంటాడు. ఇతడొక్కొక్క రాశిలో ముప్పది మాసాలుంటాడు. సామాన్యంగా అతడు అశుభకారకు డంటారు.

శని మండలానికి ఉపరిభాగాన పదునొకండు లక్షలయోజనాల దూరాన సప్తర్షి మండలం ఉంది. ఆ మహర్షులు సమస్త జీవకోటి శుభాన్ని కాంక్షిస్తారు.

ఆ సప్తర్షి మండలానికి పదమూడు లక్షల యోజనాల దూరంలో శింశుమార చక్రం ఉంది. అది అన్నింటికన్న పైన ఉన్న చక్రం. ఆ శింశు మారచక్రంలో ధ్రువుడు - ఇంద్రుడు, వరుణుడు, కశ్యపుడు, యముడు మొదలైన వారితోగూడి విష్ణుపదానికి ప్రదక్షిణం చేస్తాడు. అతడు భాగవతోత్తముడు. కల్పాంతజీవి. ఉత్తానపాదుని తనూభవుడైన ధ్రువుని మహిమను వర్ణించడం బ్రహ్మకుకూడా సాధ్యంకాదు. నేను ఎఱిగిన యంతవఱకు నీకు ఇదివఱకే చెప్పాను. ఆ మహానుభావుని తిరిగి ఒకసారి స్మరించు—' అని పరీక్షిత్తునకు శుకుడు ఒకా ఇలా అన్నాడు.

'నిమిష మాత్రంకూడా వ్యవధిలేకుండా నిరంతరం అస్పష్టవేగంతో తిరిగెడి జ్యోతిర్గ్రహ నక్షత్రాలకు ధ్రువుడు ఆధార భూతుడు. దృఢమైన కట్టుస్తంభంలాంటివాడు. కట్టాయ్యకు త్రాళ్ళతో కట్టబడిన వృషభాదులు కొంచెం దూరంలో ఉన్న ధాన్యాదులను అందుకోవాలనే తలంపుతో స్తంభానికి చుట్టూ స్వస్థానం అతిక్రమించకుండా వలయాకారంగా తిరుగుతూ ఉంటాయి. అలాగే జ్యోతిశ్చక్రంకూడా వాయువుచే ధార్యమానమవడంచేతను, కాలవశం చేతను, ధ్రువుని ఆధారంచేసికొని ఉండడం చేతను, నేలపై కూలిపోకుండా కల్పాంతం దాకా పరిభ్రమిస్తూ ఉంటుంది జ్యోతిర్గణాలన్నీ శింశుమారచక్రంగా అమరి ఉంటాయి; ఇక ఆ వివరాలన్నీ చెప్తాను. విను.

కొందఱి యోగుల దృష్టిలో జ్యోతిర్గణానికి ఆధారమైన శింశుమారం భగవచ్ఛరీరమని భావన. సర్పంలాగా భగవంతుడు తన ఆ శరీరాన్ని కుండలీకరణం చేసి (చుట్టగా చుట్టి) క్రిందికి తలను, మీదికి తోకను ఉంచేలా

చేశాడు. అలా పైకి ఎత్తబడి ఉన్న తోకపైన ధ్రువుడు ఉంటాడు. తోక యందు ప్రజాపతి, అగ్ని, ఇంద్రుడు, ధర్ముడు అను తారకలుంటాయి. తోకమూలము నందు ధాత, విధాత అను వారుంటారు. కటి ప్రదేశమందు సప్తర్షులుంటారు.

చుట్ట చుట్టినట్లున్న భగవచ్ఛరీర భూతమైన శింశుమార చక్రానికి ఎడమవైపున ఉత్తరాయన నక్షత్రాలు కుడివైపున దక్షిణాయన నక్షత్రాలు ఉన్నాయి. పృష్ఠభాగాన దేవమార్గం, ఆకాశగంగ ఉన్నాయి. వానికి ఉత్తర భాగాన పునర్వసు, పుష్యమి, దక్షిణ భాగమున ఆర్ద్ర, ఆశ్లేష ఉన్నాయి. కుడికాలిపై అభిజిత్తు, ఎడమకాలిపై ఉత్తరాషాఢ ఉన్నాయి. దక్షిణ వామ నాసారంధ్రాలయందు శ్రవణ పూర్వాషాఢలు, దక్షిణ వామ నేత్రాలయందు ధనిష్ఠా మూలలు, దక్షిణ వామకర్ణాల యందు మఖ మొదలగు ఎనిమిది నక్షత్రాలు ఉన్నాయి ఈ రీతిగా ఎడమ పార్శ్వమందు దక్షిణాయన నక్షత్రాలుండగా—

కుడి పార్శ్వమున కృత్తిక, రోహిణి, మృగశిర, ఉన్నాయి. ఇంకను ఉత్తరాయణ నక్షత్రాలూ ఉన్నాయి. ఎడమ మూపున శతభిషం కుడిమూపున జ్యేష్ఠ ఉన్నాయి. పై దవడ యందు అగస్త్యుడు, క్రింది దౌడయందు యముడు, ముఖమున అంగారకుడు, మర్మావయవమున శని, పురుషాంగమందు బృహస్పతి, వక్షమందు సూర్యుడు, నాభియందు శుక్రుడు ఉన్నారు. అలాగే మనస్సునందు చంద్రుడు, స్తనాలయందు అశ్వినులు, ప్రాణాపానములందు బుధుడు, కంఠాన రాహువు, సర్వాంగాలయందు కేతువు, ఉన్నారు. రోమాలుగా తారకలున్నాయి. ఇది సర్వదేవతా మయమైన పుండరీకాక్షుని దివ్యదేహం.

అలాంటి దివ్యశరీరాన్ని ప్రతిదినం సంధ్యాకాలల్లో భక్తితో నియతుడై మౌనం వహించి మనస్సులో ధ్యానిస్తూ శింశుమారచక్రాన్ని జపిస్తూ మునీంద్ర సేవ్యమూ, జ్యోతిస్స్వరూపమూ, అయిన శింశుమార విగ్రహానికి మాటి మాటికి నమస్సులర్పించే వానికి సకలార్థాలు సిద్ధిస్తాయి. తుదకు ముక్తి లభిస్తుంది.

సూర్యమండలానికి దిగువగా పదివేల యోజనాల దూరమందున్న కక్ష్యలో రాహుగ్రహం అపసవ్య మార్గంలో తిరుగుతూ ఉంటుంది. అసురుల్లో అధముడైన అతడు చతుర్ముఖుని వరం వల్ల అమరత్వం వహించి అన్యగ్రహాలతో పాటు సమంగా విహరిస్తున్నాడు. పదివేల యోజనాల విస్తృతిగల సూర్యమండలాన్ని, పన్నెండువేల యోజనాల పరిమితిగల చంద్రమండలాన్ని ఈ రాహుగ్రహం కప్పివేస్తుంది. ఈ గ్రహపరిమాణం పదమూడు వేల యోజనాలు. పూర్ణిమావాస్యల్లో రాహువు చంద్ర సూర్యులను గ్రసిస్తాడు. దీనినే గ్రహణం అంటారు. ఆ కాలంలో అందరు ఎవరి ధర్మాన్ని వారు పాటిస్తారు.

ఇంతలో అయిదారు గడియల లోపుననే సూర్య చంద్రమండలాలను రక్షించ డానికి శ్రీహరి సుదర్శనం వస్తుందనే భయంతో రాహువు వారిని విడిచి పోతాడు.

ఆ రాహువునకు దిగువ పదివేల యోజనాల దూరంలో సిద్ధులు, చారణులు, విద్యాధరులు తిరుగుతారు. వారికి క్రిందుగా పదివేల యోజనాల దూరంలో యక్షులు, భూతప్రేతలు, రాక్షసులు పిశాచాలు సేవిస్తూ ఉండగా విహరిస్తారు. యక్షాదుల విహారస్థానానికి దిగువగా వాయువశంచేత కల్పితమైన మేఘమండలం. ఆ మేఘమండలానికి క్రింద భూమండలం ఉంది.

## అధోలోకాలు

భూమండలానికి దిగువగా పదివేల యోజనాల దూరమందు అనగా భూగోళ గర్భంలో ఒక దానికొకటి క్రిందుగా ఏడు అధోలోకాలున్నాయి. వాటి పేర్లు అతలం, వితలం, సుతలం, రసాతలం, తలాతలం, మహాతలం, పాతాళం. ఈ లోకాల్లో కూడా స్వర్గ సుఖాలను మించిన సుఖాలున్నాయి. ఐశ్వర్యానికి ఆనందానికి లోటులేదు. మనోహరాలైన ఉద్యానవనాలతో క్రీడా విహారస్థానాలతో ఆ లోకాలు రమణీయంగా ఉంటాయి. అక్కడ దైత్యులు, దానవులు, కాద్రవేయులు (నాగులు) మొదలైన దేవయోనులు భార్యాపుత్రులతో, సుహృద్బాంధవులతో దాసదాసీ పరిజనంతో నిత్యానందం అనుభవిస్తారు. మణిఖచితాలైన వారి గృహసీమలు ముచ్చటగా ఉంటాయి.

వారికి అధివ్యాధులుండవు. మాయావిశేషంచేత వారు క్రొత్త క్రొత్త కేళీగృహాలు, విహార మండపాలు, విచిత్రోద్యానాలు నిర్మించుకొని కేళీ వినోదాల్లో మునిగి తేలుతూ ఉంటారు ఆ పాతాళ లోకాల్లో మయకల్పితాలైన నగరాలెన్నో ఉన్నాయి. అందు రత్న నిర్మితాలైన ప్రాకారాలు, గోపురాలు గల భవనాలున్నాయి ్భలు, అరుగులు తిన్నెలు ఉన్నాయి. నాలుగు బాటలు కలిసినచోట అసుర ఉపతులు విహరిస్తుంటారు. విలాసార్థం వారు ఎప్పుడు కావాలంటే అప్పుడు కృత్రిమ భూములుగల క్రీడామందిరాలను కల్పించుకుంటారు. అలాగేవారు కృత్రిమంగా సృజించిన చిలుకలు, కోకిలలు, గోరువంకలు, కలకూజితాలలో వీనులవిందు చేస్తాయి, ఆ గృహోద్యానాల్లో సువాసనలు వెదజల్లెడి పూగుత్తులతోను చిగురాకులతోను, పక్వఫలాలతోను అనేక వృక్షాలు నయన పర్వంగా ఉంటాయి. లతలు ఆ చెట్లను పెనవేసుకొని వానిని కౌగిలించుకున్నట్లు గోచరిస్తాయి.

అచటి సరోవరాలు నిర్మలజల పూరితాలై మనోహరంగా ఉంటాయి. వాటిల్లో మనస్సుకూ, ఇంద్రియాలకు ఆనందం కల్పించెడి నానా విధ జల

క్షుల జంటలు విహారం చేస్తూంటాయి. చేపలు అటూ ఇటూ వడి వడిగా రుగుతూ ఉండడంవల్ల ఆ సరోవరాల్లోని కలువలు, తామరలు కదలి ఊగుతూ ంటాయి. అలాంటి సరోవరాలు కల ఉపవనాల్లో క్షణంలో లీలాగృహాలను ృజించుకొని స్వర్గసుఖాలను మించిన సుఖాలను అనుభవిస్తారు. అక్కడ ూర్యోదయాస్తమయాలుండవు గనుక వారికి అహోరాత్రాది కాలవిభాగం ెలియదు. శేషాదుల శిరోమణి కాంతులచేత అక్కడ చీకటి అనేది లేక ల్లప్పుడూ పగలుగానే ఉంటుంది.

ఆ లోకవాసులు నిరంతరం దివ్యౌషధి రస రసాయనాలను అన్న ానాలుగా సేవించడం వలన వారికి జరా వ్యాధులుండవు. శరీర వైవర్ణ్యం ండదు. జుట్టు నెరయదు శరీరం ముడుతలు పడదు. చెమటగాని దుర్గంధం ాని ఉండదు. వారికి ఒక్క హరి చక్రభయం తప్పితే మరో విధమైన మృత్యుభీతిలేదు. ఆ పాతాళంలో ఎప్పుడైనా విష్ణుచక్రం ప్రవేశిస్తే అచటి ాక్షసస్త్రీలకు భయకారణం చేత గర్భస్రావం జరుగుతుంది. పరీక్షి న్నరేంద్రా! ఈ అధోలోకాలను గురించి సంగ్రహంగా చెపుతాను విను.' అని శుకుడు ఇలా చెప్పడం మొదలు పెట్టాడు.

**అతలం** :– ఇది అధోలోకాల్లో మొదటిది. మయుని కుమారుడైన బలా సురుడు ఈ లోకానికి అధిపతి. అతనికి తొంబది ఆరు విధాలైన మాయలు తెలుసు. వాటితో అతడు జీవకోటిని మోహపరచి వినోదిస్తూ ఉంటాడు. ఈ లోకానికి ఎదురుగాగల భూమండలంలో కొందరు ఈ ని మాయల్లో చిక్కు కొంటారు.

ఆ బలాసురుడు ఆవులించినప్పుడు ఆ ఆవులింతలనుండి స్వైరిణులు, కామినులు, పుంశ్చలులు అను స్త్రీలు జనించి వారు పాతాళ లోకంలో అడుగుపెట్టిన పురుషునకు హాటక రసమనెడి ఒక సిద్ధరస ఘటిక ఇస్తారు. దానితో అతడు కామాంధులూ, వ్యభిచారిణులూ, అయిన వారికి లోబడి పోతాడు. వారి శృంగార చేష్టలకు, హావభావాలకు, స్మిత సంభాషణలకు ముగ్ధుడై వారి కోర్కెలు తీరుస్తాడు. వా ఆటవస్తువుగా పెంపుడు జంతు వుగా పరిణమిస్తాడు. ఇదంతా తన సామర్థ్యమేననీ, తాను పదివేల ఏనుగుల బలంగల వాడననీ, గర్విస్తాడు.

**వితలం** :– ఈ లోకానికి వుడు అధిపతి. అతని నచ్చట హాట కేశ్వరుడంటారు. అతడక్కడ పార్షదులతో ఉంటాడు. బ్రహ్మ సృష్టిని వృద్ధి చెయ్యడానికి అతడు అక్కడ ఒకచోట పార్వతితో సంభోగించగా వారి వీర్యం వలన హాటకి అను నది జనించింది. అగ్నిదేవుడు వాయు ప్రసారం వలన ప్రదీప్తుడై సీయ్యలంచే ఆనదినిపానంచేసి ఉమియగా అది హాటకం

అనే పేరుతో స్వచ్ఛమైన సువర్ణమైంది. వితల వాసులు ఆ సువర్ణంతో ఆభరణాలు కల్పించుకొని ధరిస్తారు.

సుతలం:— ఇది వితలానికి దిగువన ఉంది. ఇక్కడ మహా పుణ్యాత్ముడైన బలిచక్రవర్తి వసిస్తాడు. అతడు విరోచనుని పుత్రుడు. పూర్వం విష్ణువు, ఇంద్రునకు సంతోషం కలిగించడానికి అదితి గర్భంలో వామనుడుగా పుట్టి త్రివిక్రముడై ముల్లోకాలను ఆక్రమించాడు. ఆ విష్ణువే బలికి సుతలమున ఇంద్రత్వమిచ్చాడు. ఆ బలిచక్రవర్తి అక్కడ నిరంతరం పుణ్యకర్మలు చేస్తూ శ్రీహరిని ఆరాధిస్తూ ఉంటాడు.

నరేంద్రా! సకల భూతాంతర్యామియూ, తీర్థ భూతుడూ అయిన వాసుదేవుని యందు గల భక్తితో బలి యిచ్చిన భూదానానికి శ్రీహరి అతనికి మోక్షం ఇవ్వాలి కాని పాతాళ రాజ్యమా యిచ్చేది? ఇందులో ఒక రహస్యముంది. మోక్షం ఇస్తే అది ఎవ్వరికీ కనబడదు, లోకప్రదర్శనార్థం పాతాళం ఇచ్చి అక్కడ అతనికి స్వర్గం కల్పించాడు. భగవంతుడు బలిచక్రవర్తినుండి ముల్లోకాలు తీసికొని అతణ్ణి శరీరమాత్రావశిష్టుణ్ణి చేసి వారుణ పాశంలో కట్టి విడిచినపుడు మహా జ్ఞాని అయిన బలీంద్రుడిలా అన్నాడు—

'పరమేశ్వరునకు ఏ వస్తువునందును తృష్ణ లేదు. ఇంద్రాదులు పోరడం వల్ల అతడు నన్ను అర్థించాడుగాని కాక అతనికి కోరికలేమిటి? నాకు కావలసింది అతడుగాని ఈ లోకత్రయమెంత? మన్వంతరాధిపత్యమెంత? మా తాత ప్రహ్లాదుడు అభిమానవంతుడు. శ్రీహరి అతణ్ణి చూచి సంతసించి 'నీకేది కావాలో ఇస్తా'నని అంటే ప్రాజ్ఞుడైన యాతడు ఈశ్వరుని అంతర్యం గ్రహించి తనతండ్రి రాజ్యాన్ని తిరస్కరించి పరమేశ్వరుని దాస్యాన్ని కోరాడు.

పరీక్షిన్నరేంద్రా! చూచావా? బలి యెంతటి భాగవతోత్తముడో! అంచేతనే శ్రీహరి అతనికి మోక్షం ఇవ్వకుండా సుతల రాజ్యాధిపత్యం ఇచ్చి అక్కడ స్వర్గాధిక సుఖాలను కల్పించడమేకాక ఆ పరమ భాగవతోత్తముని యందు తన కెంత ప్రేమ భావముందో లోకానికి వ్యక్తం చెయ్యడానికి తాను స్వయంగా శంఖ చక్ర గదాద్యాయుధాలు ధరించి బలిచక్రవర్తి గృహ ద్వారం దగ్గర కాపలా ఉన్నాడు. లోకాలన్నింటినీ జయించాలనే కాంక్షతో దశకంఠుడొక పర్యాయం అక్కడికి వచ్చాడు. ఆ బలిచక్రవర్తి ద్వారంనుండి ప్రవేశించి లోకాలను జయించాలని అతని సంకల్పం. అపుడక్కడ ఉన్న శ్రీహరి కాలి గోటితో మీటగా రావణుడు పదివేల యోజనాల దూరాన పోయి పడ్డాడు.

తలాతలం :— ఇది సుతలానికి క్రిందనుంది. దీనికి ప్రభువు అసుర

పుర నిర్మాతయైన మయుడు. శ్రీహరి లోకహితార్థం శివుని చేత త్రిపుర సంహారం చేయించాడు. అపుడు మయుడు భయకంపితుడై హరిహరులను శరణు వేడేసరికి వారు అనుగ్రహించి అతనికి తలాతలాధిపత్యం ఇచ్చారు. శ్రీధరుని సుదర్శన భయం తప్ప అతనికి ఇంకే భయమున్నూ లేదు.

మహాతలం :— తలాతలానికి దిగువను మహాతలం ఉంది. అచట కద్రువ కొడుకులైన సర్పరాజులున్నారు. అనేక శిరస్సులతో వారు క్రోధ మూర్తులై తిరుగుతారు. కుహకుడు, తక్షకుడు, కాళీయుడు, సుషేణుడు మొదలైన సర్పముఖ్యులు దృఢగాత్రులు. వారికి విష్ణువాహనమైన గరుత్మంతుడంటే భయం. అంచేత అతని వలన ఎప్పుడేమి ప్రమాదం వస్తుందేమో అని వారందరు ఒంటరిగా ఉండక ఎప్పుడు కుటుంబ పరివారంతో కలిసి ఉంటారు.

రసాతలం :— మహాతలానికి క్రిందగా ఉన్న రసాతలంలో నివాత కవచులు, కాలకేయులను దైత్య దానవులు వసిస్తారు. వారు నివసించు పురం పేరు హిరణ్యపురం. వారు దేవ విరోధులు. మహాసాహసులు, మహా తేజస్వులు. అయినా వారు సకల లోకాధీశ్వరుడైన శ్రీహరి తేజస్సునకు భయపడి పుట్టలో దాగిన సర్పాల్లాగా అణగి ఉంటారు. ఇంద్రదూతియైన సరమ మంత్రాత్మక వాక్యాలకు వారు భయాక్రాంతులౌతారు.

పాతాళం :— ఇది అన్నిటికంటె దిగువను ఉంది. దీనిలో నాగకులం ఆనందంలో క్రీడిస్తూ ఉంటుంది. వాసుకి, శంఖుడు, కులికుడు, మహాశంఖుడు, శ్వేతుడు, ధనంజయుడు, ధృతరాష్ట్రుడు, శంఖచూడుడు, కంబళుడు, అశ్వతరుడు, దేవదత్తుడు, మొదలగు మహానాగాలు ప్రధానులు. వీరిలో కొందరికి అయిదు, ఆరు, పది, నూరు, వేయి తలలుకూడా ఉంటాయి. వీరి తలలపై గల మణుల కాంతులు అచటి చీకట్లను పారద్రోలుతాయి.

పాతాళ లోకం అడుగున ఆదిశేషుడు ముప్పదివేల యోజనాల వెడల్పున తోకను చుట్టగాచుట్టుకొని ఉంటాడు. అతడు విష్ణుని ఉగ్రరూపం. అతనిని అనంతుడని, సంకర్షణుడని కూడా అంటారు. అతని శిరస్సుపై భూమి ఆవగింజవలె ఉంటుంది. లోక సంహార సమయంలో ఆదిశేషుడు ప్రచండ క్రోధంతో ఏకాదశ రుద్రమూర్తులను సృజిస్తాడు. ఆ రుద్రమూర్తులకు మూడవ కన్ను ఉంటుంది. వారందరు త్రిశూల పాణులై ఉంటారు. అచటి సర్ప ముఖ్యులు భక్తిభావంతో శేషు చరణ కమలాలను ఆశ్రయించి తమ హారి రత్నాలతో అతనికి నీరాజనాలర్పిస్తారు.

సంకర్షణ మూర్తియైన శేషుని చేరి నాగకన్యలు అతనికి చందనం, కస్తూరి, మొదలైన సుగంధ ద్రవ్యాలు పూస్తారు. అతని దర్శన స్పర్శనాదుల

వలన వారికి మన్మథా వేశం కలుగుతుంది. అపుడు వారు సిగ్గుపడి మంద హాసంతోను ప్రేమ రసార్ద్రాలైన దృక్కులతోను తమ కోర్కెలను వ్యక్తం చేస్తూ అతని వంక సానురాగంగా చూస్తారు. అపుడా అనంతుడు లోకక్షేమం గోరి తన క్రోధాన్ని ఉపసంహరింపుకొంటాడు. అపుడు సురాసురులు, సిద్ధ గంధర్వ విద్యాధరాదులు, మునులు సేవిస్తూండగా అతడు మ్రాగన్ను పెట్టి నాగాంగనల నృత్యగీత వాద్యాలను విని ఆనందిస్తూ తన పరివారాన్ని సస్నేహంగా చూస్తాడు. అప్పుడే త్రుంచిన తులసీ దళాలతోనూ పువ్వులతోనూ కూర్చిన వైజయంతీ వనమాలికలను ధరిస్తాడు. ఆ తులసి దళాల పరిమళం గుబాళిస్తూ ఉంటుంది. తుమ్మెదలు పూదేనె త్రావి మధురంగా ఝంకృతులు చేస్తాయి. అతడు నీలాంబరధారియై హలాయుధాన్ని పట్టుకొని ఉంటాడు. అతడప్పుడు మహేంద్రుడో హరుడో అన్నట్లుంటాడు. ముముక్షువులు అతన్ని నిరంతరం ధ్యానిస్తూ సన్నుతిస్తారు. నారదాదులు బ్రహ్మసభలో సత్య స్వరూపుడైన ఆ అనంతుని ఇలా స్తుతిస్తారు.

'దేవా! నీ లీలావినోదాలు సృష్టి స్థితి లయాలకు హేతువులు. నీ చూపులనుండియే సత్వరజస్తమో గుణాలు జనించాయి. నీ వివిధ రూపాలు ఏకమై లోకాలను రక్షిస్తాయి. తలవని తలంపుగా నీ నామస్మరణం చేసినా సకల పాపాలూ హరిస్తాయి. సంకర్షణాఖ్యుడవైన నీవు అవ్యయుడవు. ముల్లోకాల్లో వాక్కులతోగాని మనస్సుతోగాని నిన్ను సన్నుతించడం ఎవరికీ సాధ్యంకాదు. నీవు అనేక విధాల మావంటి వారిని రక్షించడానికి సాత్విక స్వభావంలో సాక్షాత్కరించావు. అనంతా! నీకు మా నమస్కారాలు.'

ఆదిశేషుని ఆకస్మికంగాగాని ఆర్తుడైగాని ఎవ్వరైనా స్మరిస్తే చాలు పాపాలు తొలగిపోతాయి. శుభాలు కలుగుతాయి. ఆ ఆదిశేషుని ముముక్షువులాశ్రయించి ధ్యానించి భవబంధ విముక్తులౌతారు. అతని ఫణాగ్రమందు భూగోళం అణుమాత్రంగా గోచరిస్తుంది. అతని మహిమలను వినుతించడానికి వేయినాల్కలు గల పురుషునకుకూడా శక్యంకాదు. ఆ అనంతుడు పాతాళమందుండి సకలలోక హితంకోసంభూమిని ధరిస్తున్నాడు — నరేంద్రా! నీకు లోకస్థితిని గురించీ, మనుష్యులను గురించీ, ఇతర జీవరాసులను గురించీ చెప్పాను. ఇంకా నీకు ఏం వినాలనికుతూహలంగా ఉందో చెప్పు—'మని శుకయోగి అనగా పరీక్షిత్తు— 'మునీంద్ర నీవు చెప్పిన లోకచరిత్ర చాలా విచిత్రంగా ఉంది. అది నా మనస్సంతా నిండి ఉంది. ఈ స్థితిలో నేను ఏం వినాలని అడగాలో నాకు తెలియకుండా ఉంది' అనేసరికి శుకయోగి 'అయితే నేనే చెపుతాను. విను' అని ఇలా చెప్పడం మొదలుపెట్టాడు.

'నరేంద్రా! ప్రతిజీవికి ఏదో ఒకధ్యాయందు శ్రద్ధ ఉంటుంది. సత్య

రజస్తమోగుణాలను బట్టి అది ముప్విధాలుగా ఉంటుంది. అంచేతనే కర్మ గతుల్లో తరతమ భేదాలు గోచరిస్తాయి. ప్రతిషిద్ధ లక్షణంగల అధర్మాచరణం చేస్తే మానవుని శ్రద్ధ విపరీతంగా ఉంటుంది. అలాంటివానికి కలిగే కర్మఫలం కూడా విపరీతంగానే ఉంటుంది. కనుక అనాదియైన అజ్ఞానంచేతనూ, కామ ప్రవర్తనచేతనూ అనేక విధాలుగా కలిగెడి కర్మగతులను సంక్షిప్తంగా తెలియజేస్తాను— 'అని పలికిన శుకునకు పరీక్షిత్తు-' మునీంద్రా! నరకాలు ముల్లోకాల యందున్నాయా? లేక అంతరాళంలో ఉన్నాయా? కాక వెలుపల ఉన్నాయా? అదీకాక అవి దేశంలో అంతర్గతాలైన భూవిశేషాలా?— అని ప్రశ్నించేసరికి శుకుడిలా చెప్పడం మొదలుపెట్టాడు.

## నరకలోక వర్ణనం

'ముల్లోకాలకు అవల దక్షిణదిక్కున అంతరాళంలో నానావిధ నరక స్థానాలున్నాయి. అవి స్థిరగా ఉంటాయి. దక్షిణమున అగ్నిష్వాత్తులు మొదలైన పితృదేవతలుంటారు. వారు తమ వంశస్థులందరికీ మేలు కలగాలని వారిని ఆశీర్వదిస్తారు. అక్కడి పితృదేవతల కధిపతియైన యముడుంటాడు. అతడు తనలోకానికి వచ్చిన జీవుల కర్మలకు తగిన ఫలాన్ని ఇచ్చి శిక్షిస్తాడు. నరకస్థానాలు ఇరువదియొకటని కొందరి మతం. కొందరి మతంలో అవి ఇరువది యెనిమిది. ఆ యిరువది యెనిమిది నరకాలకు ఆయా నామాలు ఎలా వచ్చాయో, ఏ యే దుష్కర్మలు చేసినవారు ఆయా నరకాల్లో ఎలాంటి శిక్షలు అనుభవిస్తారో చెపుతాను. విను.

1. తామిస్రం :- తామిస్రమంటే చీకటి. ఈ స్థానం చీకటిమయం. అంచేత ఆ పేరు వచ్చింది. ఇతరుల భార్యలను, పిల్లలను అపహరించే పాపాత్ముని యమభటులు పాశాలతో బంధించి ఇక్కడ వేస్తారు. వానికి అన్నపానాదులుండవు. పర్వతం పైనుండి క్రిందికి త్రోస్తారు. కఱ్ఱలతో మోదుతారు. ఆ యాతన పడలేక అతడు మూర్ఛితుడౌతాడు.

2. అంధతామిస్రం :— ఇది పరమ చీకటిమయం. అందువలన దానికి ఆ పేరు. భర్తను వంచించి పరకాంతను పొందును కోరిన దుష్టుణ్ణి యమకింకరులు ఈ నరకకూపంలో త్రోసి నానా బాధలు పెడతారు. దానితో వానికి మతి చెడిపోతుంది. వాడు దృష్టిని పోగొట్టుకొని అంధుడవుతాడు. అంచేతకూడ ఈ నరకానికి అంధతామిస్రం అని పేరు వచ్చింది. తుదకతడు వేళ్ళు తెగిన చెట్టులాగా అక్కడ కూలిపోతాడు.

3. రౌరవం :— స్వకుటుంబ పోషణార్థం ఇతరులకు ద్రోహం చేసేవాడు, ఇహలోకంలో స్వేచ్ఛగా తిరుగుతూ పరులకు ఏమీ హాని చెయ్యని

పశు పక్ష్యాదులను బాధించేవాడు, ఈ నరకంలో పతితుడై నానాయాతన లనుభవిస్తాడు. భూలోకంలో ఇతడు ఏ భూతకోటికి ద్రోహంచేశాడో అవి రురు మృగాలై అతనిపై పగతీర్చుకుంటాయి. పొడుగుపాటి కొమ్ములతో మిక్కిలి క్రూరములైన రురువులను జంతువులు వారిని బాధించడంచేత ఈ నరకాన్ని రౌరవం అని అంటారు.

4. మహారౌరవం :— మహారౌరవంలో కూడా రురువులు హింసిస్తాయి. కాని మరో విశేషం ఉంది. రౌరవంలో హింసమాత్రమే ఉంటుంది. కాని మహారౌరవంలో రురువులు ఆ నరకంలో పడిన వారిని చీల్చి చెండాడి వారి మాంసాన్ని భక్షిస్తాయి.

5. కుంభీనసం :— దేహ పోషణార్థం మూషకాదులను బిల నిరోధం చేసి వధించే దయాహీనున్ని యమభటులు ఈ నరకంలో తప్తతైలంలో నిండిన కుంభం (పాత్ర) లో దహించి పచనం చేస్తారు. ఆ కారణం చేతనే ఈ నరకానికి కుంభీనసం అని పేరు వచ్చింది.

6. కాల సూత్రం :— ఈ నరకంలో పదివేల యోజనాల వైశాల్యం గల రాగిపెనం ఒకటి ఉంటుంది. క్రిందనున్న అగ్నిజ్వాలలతోను, పైనున్న సూర్యకిరణాల వేడిమితోను ఆ పెనం ఎంతో వేడెక్కుతుంది. తల్లిదండ్రులను బ్రాహ్మణులను నిష్కారుణంగా వధించేవానిని ఆ పెనం మీద వేస్తారు. అతడక్కడ ఆకలి దప్పులతో అలమటిస్తూ ఆ మంట సహించలేక లేచి పారి పోవాలని యత్నిస్తాడు కాని యమభటులు వానిని కదలనీయకుండా అక్కడ పశువునకు రోమాలెన్ని ఉంటాయో అన్ని సంవత్సరాల దాకా దానిమీదనే ఉంచి బాధిస్తారు. బహుకాలానుభవం ఇచ్చట ఉంటుంది. కనుక దీనికి కాల సూత్రమని సార్థక నామంకలిగింది.

7. అసిపత్రవనం :— అసి అనగా కత్తి. కత్తుల్లాంటి ఆకులతో గూడిన వృక్షాలతో దట్టంగా ఉన్నవనం అక్కడ ఉంటుంది. అంచేత ఆ నర కానికి ఆ పేరు వచ్చింది. వేద మార్గాన్ని విడిచి పాషండమార్గాన్ని అవలం బించిన వానిని యమకింకరులు ఈనరకంలో చబుకులతో కొడుతూ పరిహ సిస్తూంటే ఆ బాధ భరించలేక వాడు ఆ వనంలో పరుగులు పెడతాడు. ఇరువైపులా వాడికత్తుల్లాంటి చెట్ల ఆకులచేత ఖండితాంగుడై హాహాకారాలు చేస్తాడు.

8. సూకర ముఖం :— దండనార్హులుని బ్రాహ్మణులను గాని ఇతరు లను గాని దండించే వారిని కింకరులు ఈ నరకంలో పడవేస్తారు. అక్కడ సూకర (పంది) ముఖంలాంటి ముఖంగల జంతువులు వారి అవయవాలను చెఱకుగడ ముక్కల్లాగా విఱిచి నమిలి పిప్పిచేస్తాయి. సూకరముఖాలుగల

జంతువులుండడంచేత ఆ నరకానికి ఆ పేరు కలిగింది.

9. అంధకూపం :— ఈశ్వర కల్పితమైన వృత్తిలో ఎవరికీ ఏ హానీ కలిగించకుండా జీవించెడి జంతువులను హింసించెడి వానికి ఈ నరకపాతం సంభవిస్తుంది. తాను పూర్వంచేసిన భూతద్రోహం వలన అతడక్కడ క్రూరములైన పశు పక్ష్యాదులచేతను, సర్పాలచేతను, దోమలు, నల్లులు, ఈగలు మొదలైన వాని చేతను నానాబాధలు పడుతూ మహాంధకారంలో లేశమైనా సుఖం లేకుండా దుష్టశరీరంలోని జీవుడులాగా మృతప్రాయుడై ఉంటాడు. అంధకూపమనగా చీకటిబావి. అంచేత ఆ నరకానికి ఆ పేరు వచ్చింది.

10. క్రిమి భోజనం :— తన కలిమిని తన బాంధవులను అనుభవింపనీయక కాకిలాగా తానొక్కడే అనుభవించేవాడు ఈ నరకంలో పడతాడు. ఇక్కడ లక్ష యోజనాల వైశాల్యంగల క్రిమికుండం (పురుగుల గుంట) ఉంటుంది. ఈ నరకంలో పడినవాడు ఆ క్రిమికుండలో తానొక పురుగులాగా తిరుగుతూ అచట పురుగులనే తింటూ మహా దుఃఖం అనుభవిస్తాడు.

11. సందశం :— ఏ విపత్తు లేకపోయినా చౌర్య వృత్తిని అవలంబించి బ్రాహ్మణాదుల బంగారాన్ని, రత్నాలను అపహరించేవానిని యమ కింకరులు ఈ నరకంలో త్రోసి అగ్నితప్తాలైన పట్టుకార్లతో ఛేదిస్తారు. సందశం అంటే పటుకారు. అంచేత ఈ నరకానికి సందశం అను పేరు వచ్చింది.

12. తప్తసూర్మి :— కామాతురులైన స్త్రీ పురుషులు అక్రమ సాంగత్యం చేస్తే వారిని యమభటులు కొరడాలతో కొడుతూ అగ్నితప్తాలైన ఉక్కు ప్రతిమలను కౌగిలించుకొనేలా చేస్తారు. సూర్మి అంటే లోహ ప్రతిమ. అచట అగ్నితప్తమైన సూర్మి ఉంటుంది. కనుక దానిని బట్టి ఆ నరకానికి ఆ పేరు వచ్చింది.

13. వజ్ర కంటక శాల్మలి:— సకల జంతువులతో సంగమించెడి నీచులను బట్టి యమకింకరులు ఈ నరకంలో పడవేస్తారు. వజ్రాయుధాల్లాంటి తీక్ష్ణములైన ముళ్ళుగల శాల్మలీ (బూరుగు) వృక్షానికి కట్టి బాధిస్తారు. వజ్రమయాలైన ముళ్ళుగల శాల్మలీ వృక్షం ఉంది కనుక ఆ నరకానికి ఆ పేరు కలిగింది.

14. వైతరణి:— పాషండుడై వేదోక్త ధర్మ మర్యాదలను పాడుచేసేవాడు ఈ నరకంలో పడతాడు. ఇచట వైతరణీ నది ప్రవహిస్తూ ఉంటుంది. ఆ నది మలమూత్రాలు, చీము, నెత్తురు, వెండ్రుకలు, గోళ్ళు, ఎముకలు, మేదస్సు, మాంసం, నరాలు మొదలైన వాటితో నిండి ఉంటుంది. ఆ నదిలో పడిన వానిని అందలి జలచరాలు పట్టుకొని తింటాయి. అప్పుడాతడు చావు బ్రతుకుల మధ్య తాను చేసిన పాపాలను తలచుకొంటూ ఆ వైతరణీ నదిలో

నంతపుడౌతారు. అచట వైతరణీనది ఉంది కనుక ఆ నరకానికి ఆ నదీ నామమే వచ్చింది.

15. పూయోదం :—శూద్రస్త్రీ సాంగత్యం చేస్తూ శౌచాచారాలు విడిచి పెట్టి సిగ్గులేకుండా పశుప్రాయుడుగా తిరిగేది బ్రాహ్మణుడు ఈ నరకంలో మలమూత్రాలు, చొంగ, చీము, శ్లేష్మం మొదలైన వాటితో నిండిన సముద్రంలో నెట్టబడి మిక్కిలి హేయములైన పదార్థాలను భుజిస్తూ నానాయాతన లనుభవిస్తాడు. పూయం (చీము) ఉదకంగా గలది కనుక దానికి పూయోదం అని పేరు కలిగింది.

16. ప్రాణరోధం :—కుక్కలను పెంచి స్వప్రయోజనం కోసం మృగా లను వేటాడి చంపేవానిని యమకింకరులు ఈ నరకంలో ప్రాణంపోయేదాకా నిశిత బాణాలతో ఖండించి బాధిస్తారు. అంచేత ఈ నరకానికి ప్రాణరోధం అని పేరు వచ్చింది.

17. వైశసనం :—దాంభికుడై ఇతరుల మెప్పుకోసం యజ్ఞాలుచేసి పశువధ చేసేవానిని యమభటులు కొనిపోయి వైశసన నరకంలో పడవేసి హింసించి చంపుతారు. విశసనం అంటే చంపడం. అచట పాపాత్ములను విశస నం చేస్తారు కనుక దానికి ఆ పేరు వచ్చింది.

18. లాలాభక్షం :—కామమోహితుడై ఎవ్వడైనా తన భార్యచేత తన రేతస్సును (వీర్యాన్ని) త్రాగిస్తే అతణ్ణి ఈ నరకంలో రేతోహ్రదంలో పడవేసి యమభటులు అతనిచేత లాలా భక్షణం (రేతోభక్షణం) చేయిస్తారు. అంచేతనే దానికి లాలాభక్షం అను పేరు వచ్చింది.

19. సారమేయాదనం : దొంగతనం చేసే వారిని, ఇండ్లను తగుల పెట్టేవారిని, విషంపెట్టి అన్యులను చంపేవారిని ఈ నరకంలో వజ్రాల్లాంటి కోరలుగల ఏడువందల ఇరవై కుక్కలు ఎడతెగకుండా పట్టుకొని పీకి తింటాయి. సారమేయాదనం అంటే కుక్కలు తినడమని అర్థం. అంచేత ఈ నరకానికి సారమేయాదనం అనునామం వచ్చింది.

20. అవీచిమంతం :—లంచం తీసుకొని అసత్యసాక్ష్యంచెప్పే పాపా త్ముని పట్టకట్టి ఈ నరకంలో నూఱుయోజనాల ఎత్తుగల పర్వతాగ్రంనుండి తలక్రిందుగా త్రోస్తారు. అతడు బొబ్బలు పెడుతూ అలలులేని సరోవరంలాగా చదరంగాఉన్నా పాషాణంమీద పడగా అతని శరీరం చిన్న చిన్న తునక లవు తుంది. అయినా ప్రాణాలుపోవు. ఎంతో యాతన అనుభవిస్తాడు. వీచి అంటే నీటియల. అవీచిమంతం అనగా అలలులేనిది అనిఅర్థం. అచట శిలామయమైన స్థలం జలమయస్థానంలాగా కనబడుతుంది కనుక దానికి అవీచిమంతం అని పేరు వచ్చింది.

21. అయఃపానం :- సోమయాజి భార్యను కామించి ఆమెతో సంగమించిన వానినీ, కపటవృత్తితో అనుదినమూ మద్యపానం సోమపానం చేసే వైశ్యులనూ, బ్రాహ్మణులనూ, పట్టుకొని ఈ నరకంలో పడవేస్తారు. ఇక్కడ కింకరులు వారిని క్రిందపడవైచి బొమ్మలపైఎక్కి త్రొక్కుతారు. ముఖాలు తిరిగిపోయేలాగా మోదుతారు. అగ్నిలో ఎఱ్ఱగాకాచిన ఇనుపద్రవాన్ని నోటిలో పోస్తారు. అంచేతనే ఈ నరకానికి అయఃపానం అని పేరువచ్చింది. అయస్సు అంటే ఇనుం.

22. క్షారకర్దమం :- తపో దాన విద్యాచారాలచేత పెద్దలైన వారిని అవమానంచేసే నీచుడు క్షారకర్దమమనెడి నరకంలో పడతాడు. అతన్ని యమభటులు అక్కడగల క్షారకర్దమం (ఉప్పుబురద) లో తలక్రిందులుగా పాతి హింసిస్తారు. ఉప్పు బురదలో ఉంది కనుక దీనికి ఆ పేరు వచ్చింది.

23. రక్షోగణభోజనం :- స్త్రీ పురుషులెవరైనా నిజశరీర రక్షణార్థం పశువులనుగాని నరులనుగాని బలియిస్తే హతులైన ఆ పశువులు, నరులు యమసదనంలో రక్షోగణాలై తమను చంపినవారిని చురకత్తులతో ముక్కలు ముక్కలుచేసి ఆడుతూ పాడుతూ వారి రక్తాన్ని త్రాగుతారు. రక్షోగణాలు అలా ఆ దుష్టాత్ములను అక్కడ భుజిస్తారు. కనుక దీనికి రక్షోగణభోజనం అను పేరు కలిగింది.

24. శూలప్రోతం :- గ్రామాల్లోగాని అరణ్యాల్లోగాని శూలాదులకు గ్రుచ్చి విలాసార్థం ఎవరు వధిస్తారో వారిని ఈ నరకంలో త్రోసి యమభటులు శూలాలతో పొడిచి బాధిస్తారు. వారు ఆకలిదప్పులచే బాధపడుతూ, పరవశులై ఉండగా వారిని రాబందులు గ్రద్దలు తమ వాడిముక్కుల కొనలతో పొడిచి తింటాయి.

25. దందశూకం :- దూర్తస్వభావంతో జనపీడనం గావించెడి వారిని ఈ నరకంలో అయిదు, ఏడు శిఖాలుగల సర్పాలు కరిచి బాధిస్తాయి. దందశూకం అనగా సర్పం. అందుచేత దానికి ఆ పేరు వచ్చింది.

26. అవటనిరోధనం :- దొడ్లల్లోగాని, ఇండ్లల్లోగాని పశువులను, పక్షులను, తేళ్ళను నిరోధించి హింసించే పాపాత్ముని ఈ నరకంలో పడవేసి యమకింకరులు అచట అవటాల్లో (గోతుల్లో) త్రోసి విషంతోను, అగ్నితోను, పొగమంటలతోను నిరోధిస్తారు. అందుచేతనే ఆ నరకానికి అవటనిరోధనం అని పేరు వచ్చింది.

27. అపర్యావర్తనం :- ఎవడు తన యింటికి వచ్చిన అతిథులను,

అభ్యాగతులను కోపంతో పాపపు చూపులతో చూస్తాడో వాడు ఈ నరకంలో ప్రవేశిస్తాడు. వజ్రాల్లాంటి ముక్కులుగల రావులుగులు, గద్దలు వాని కనుగవను పొడిచి భక్షిస్తాయి.

28. సూచీముఖం :- ధనవంతుడై యుండీన్నీ ధర్మకార్యాలు చెయ్యక వక్రమార్గాల్లో ఆ ధనాన్ని ఊరికే పెంచి తుదకు మృత్యువాతపడిన వాడు సూచీముఖ నరకంలో ప్రవేశిస్తాడు. యమభటులు వానిని అక్కడ సూచీముఖాలతో కుట్టి బాధిస్తారు సూచీముఖం అంటే సూదిమొన. ఆ హేతువు చేతనే ఆ నరకానికి సూచీముఖం అని పేరు వచ్చింది.

రాజేంద్రా! ఇలాంటి నరకాలు యమసదనంలో ఇంకా వేలసంఖ్యల్లో ఉన్నాయి. ధర్మదూరులైన వారిని యమదూతలు అక్కడ నానా యాతనలు పెడతారు. ధర్మవంతులైనవారు [illegible] స్వర్గంలో భోగాలనుభవిస్తారు అయితే పుణ్యశేషాన్నిగాని పాపశేషాన్నిగాని అనుభవించడానికి భూలోకంలో పుడుతూ ఉంటారు. నరాధిపా! మోక్షమార్గం నీకు ఇదివరకే వినిపించాను. ఈ బ్రహ్మాండంలో పదునాల్గు లోకాలున్నాయని పురాణాలు చెపుతున్నాయి. అలాంటి ఈ బ్రహ్మాండం సమస్తం శ్రీహరి స్థూలశరీరం. ఈ బ్రహ్మాండాన్ని వర్ణించినా, ఆ వర్ణనం విన్నా సమస్త శుభాలూ కలుగుతాయి.

శ్రీహరి స్థూలశరీరంలోని రహస్యాలు తెలిసినవారికి నిజశరీర రహస్యం కూడా తెలుస్తుంది. భూమండలం, అరుదున్న ద్వీపాలు, వర్షాలు, నదులు, పర్వతాలు, ఆకాశం, సముద్రం, పాతాళం, దిక్కులు, నరకాలు, తారకలు మొదలైనవి మహాశ్చర్యాన్ని కలిగిస్తాయి ఇన్నిటియందు నిండియున్న సకల జీవసమూహమే శ్రీహరి స్థూలశరీరం. అది ఎంత అద్భుతమో యోచించు' అని శుకయోగి పరీక్షన్నరేంద్రునితో చెప్పాడు.

—



# ఎమెస్కో వచన మహాభాగవతం

## (రెండవ సంపుటం)

శ్రీ పోతన మహాభాగవతమునకు అనుకృతి

## అయినంపూడి గురునాథరావు

శతావధాని కీ॥శే॥ శ్రీ కోట వీరాంజనేయ శర్మగారి ఎమెస్కో వచన రామాయణం ప్రచురణ పూర్తి కాగానే - అనూహ్యంగా శ్రీ దేవీ భాగవతమును వచన రూపంలో వెలువరించాలని సంకల్పం కలిగింది.

ఈ సంకల్పము కలుగుటయే తరువాయి - మా చూపులు - సంస్కృతాంధ్ర ఆంగ్ల, హిందీ భాషా చతుర్ముఖులు అయిన విద్వాన్ శ్రీ అయినంపూడి గురునాథ రావుగారి దెస ప్రసరించాయి. శ్రీ గురునాథరావుగారు మా కోరిక ననుసరించి. శ్రీ దేవీ భాగవతమును ఆంధ్రీకరణములో సంస్కృత మూలమునకు తీసిపోకుండా సరళ వచన రచనములో ధారాళముగా రచన గావించారు. ఆ రచనను పూర్తిగా మూడు సంపుటాలుగా వెలువరించి యున్నాము.

ఎమెస్కో రామాయణమును సమాదరించినట్లుగా శ్రీ గురునాథరావుగారి రచన శ్రీ దేవీ భాగవతమును పాఠకులు సహృదయముతో భక్తి పూర్వకముగా సమాదరించియున్నారు. ఈ సమాదరణ-మమ్ములను ఆయనచే - బమ్మెర పోతన శ్రీ మద్భాగవతమును ఆంధ్రలోకమునకు సరళవచనములో అందించ తలంపునకు పురికొల్పినది.

బమ్మెర పోతన భాగవతము అనగానే భక్తి ప్రపూరితమైన గాథలు- గజేంద్ర మోక్షము, ప్రహ్లాద చరిత్ర, వామన చరిత్ర, రుక్మిణీ కళ్యాణం, అంబ రీషోపాఖ్యానము-ఈ భక్తమణుల మూల సూత్రమైన వాసుదేవతత్వము మనలో పొంగి పొరలుతుంది. హరికీ, యోగివరులకూ అభిలషితమైన భాగవతగాథలు మధుర భక్తిలో ముంచి పచ్చంతురాయిని కూర్చిన బమ్మెరపోతన తెలుగు కావ్యం భాగవతగాథను సంపూర్ణముగా సరళ తెనుగు వచనంలో అందజేస్తున్నాము.

ఈ సంపుటమును కూడ పాఠకులు భక్తి ప్రపత్తులతో సమాదరించగలరని మా భావన.


## యం. శేషాచలం అండ్ కంపెనీ

మచిలీపట్నం - సికింద్రాబాదు

శ్రీ బాలాజీ ఆర్టు ప్రింటర్స్.